# ప్రియ ఘుమఘుమలు మీకోసం

అద్భుతం... ఇది అమోఘం... ఔనండీ - ఈ ప్రియ పచ్చళ్లు మీ కోసమే ! మేలైన దినుసులు, నోరూరించే మధురిమల సమ్మేళనం - ప్రియ ఏ వేళైనా... ఏ వంటకమై అది భోజనమైనా - అల్పాహారమైనా - అతిథి సత్కారమైనా... 'ప్రియ' జోడించండి... మరచిపోలేని అనుభూతిని పొందండి!

## ప్రియ - ఇప్పుడు మీ కెంతో ఇష్టమైన 15 వేర్వేరు రుచుల్లో







ఊరగాయలు

ఉషోదయా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు- 500 482.

Sista's-UEL-272/92 TEL.B.



# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/–, రూ. 75/–, రూ. 50/– చొప్పున, మరో మూడింటికి రూ. 25/– చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

------------ కూపన్ ------------

ఏప్రిల్ 'చతుర' నవల 'లేడీస్‌లాయర్'

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

# చిత్రవిచిత్రాలు

## కింకర లక్ష్మి

ఆఫీసునుంచి బైక్‌మీద ఇంటికొస్తుంటే సెంటర్‌లో జోరుగా విన్పించాయి స్లోగన్లు.

"రండి బాబూ! రండి! రేపే డ్రా! కింకరలక్ష్మి సూపర్ బంపర్! రేపే డ్రా! మొదటి బహుమతులు పది. ఒక్కొక్కటి లక్ష. రెండో బహుమతులు ఇరవై. ఒక్కొక్కటి యాభైవేలు. ఇంకా ఎన్నో బహుమతులు! రండి బాబూ రండి, టిక్కెట్ ఒక్కరూపాయి మాత్రమే. త్వరపడండి. ఇంకా కొద్ది టిక్కెట్లు మాత్రమే వున్నాయి రండి! రేపే డ్రా"

మైకులో ఊదరగొట్టేస్తున్నాడు లాటరీ టిక్కెట్లు అమ్మే కుర్రాడు.

ఆ మాటలు వినగానే ఒక చిలిపి ఆలోచన వచ్చింది నాకు. వెంటనే బైక్‌ని వాడి దగ్గరకు పోనిచ్చి ఆపాను.

"ఏవోయ్. ఆ కింకరలక్ష్మి లాటరీ టిక్కెట్ ఒక్కటియ్యి..." అన్నాను పర్సులోంచి రూపాయి తీస్తూ.

"ఏంటీ ఒక్కటా! మీరు బొత్తిగా శ్రీరామచంద్రుడిలా వున్నారే! కనీసం మూడు సిరీస్‌లలో మూడయినా తీస్కోండి సార్. ఒక్కొక్కటి లక్ష చొప్పున పది బహుమతులు సార్. అదృష్టం ఉంటే మీకే తగలొచ్చు!?" అన్నాడు వాడు.

కాని నేను లొంగలేదు వాడి మాటలకి.

"అబ్బే, నాకసలు ఈ అలవాటు లేదోయ్. ఒక్కటి ఇవ్వు చాలు" అన్నాను.

వాడు నావంక అదోలా చూస్తూ టికెట్‌తీసి నా చేతికిచ్చాడు. నేను దాన్ని తీసుకొని నెంబరయినా చూడకుండా దాన్ని వాడి జేబులోనే పెడుతూ, "చూడు కుర్రాడా! ఈ లాటరీ టిక్కెట్ నీ దగ్గరే వుంచి, రేపు దీనికేదయినా ప్రైజు తగిలితే తెచ్చివ్వు. ఒకవేళ లక్షగాని వచ్చిందనుకో. అందులో పాతికవేలు నీకు ఇచ్చేస్తాను. టికెట్ ఖరీదు కూడా అప్పుడే ఇచ్చేస్తాను. సరేనా ఇదిగో నా అడ్రస్ కార్డు బై..." అంటూ నోరుతెరచుకుని ఆశ్చర్యంగా చూస్తున్న వాడిని పట్టించుకోకుండా బైక్‌ని 'రయ్‌న' ఇంటికి పోనిచ్చాను.

రెండురోజులు గడిచిపోయాయి.

మూడోరోజు తెల్లవారుజామున ఐదుగంటలకి, తలుపును దబ, దబమని బాదేస్తూ, కాలింగ్ బెల్ కూడా అదేపనిగా నొక్కేస్తూ ఇంకా చాలనట్టు "సార్... సార్..." అంటూ గొంతుచించుకుని అరుస్తున్నారెవరో. నా బంగారంలాంటి నిద్ర పాడుచేసినవాడు ఎవడైనా సరే పీక పిసికి చంపేద్దామని విసురుగా వెళ్లి తలుపు తీసిన నేను అక్కడ నిలబడివున్న లాటరీటిక్కెట్ల కుర్రాడిని చూసి ఆశ్చర్యపోయాను.

వాడు ఆయాసంతో రొప్పుతున్నాడు. వళ్లంతా చెమటలు పట్టివుంది. చాలాదూరంనుంచి పరిగెత్తుకొచ్చినట్టున్నాడు.

వాడి వాలకంచూసి "ఏమిటి... హడావిడీ!?" అని అడగబోతుండగా వాడే అందుకున్నాడు. "సార్... మీ అదృష్టం పండింది సార్. లాటరీలో మీకు లక్ష వచ్చింది. ఇదిగో టిక్కెట్టు, ఇదిగో పేపరు. చూడండి సార్. చూడండి" తెగ ఆయాసపడిపోతున్నాడు వాడు.

స్టన్నయిపోయాను నేను.

"మైగాడ్! లాటరీలో లక్షవచ్చిందా! అమ్మో. అంత అదృష్టమే" గబగబా పేపరులో నెంబరు చూశాను. నిజమే. 'యాహూ' అంటూ ఒక్కగెంతు గెంతాను.

"సార్... సార్... మరి నా పాతికవేలు నాకు

కవర్‌ఫొటో: వి.సత్యమూర్తి

ఇచ్చేస్తే...'' ఆనందంతో వెలిగిపోతున్న ముఖంతో అడిగాడు వాడు.

అప్పుడు గుర్తొచ్చింది నాకు 'వాడికి ఇస్తానన్న పాతికవేలు...' నవ్వొచ్చింది నాకు. ఏదో సరదాగా వాడిని ఏడిపిద్దామని టిక్కెట్ వాడి చేతిలో పెడితే, వాడు దాన్ని సీరియస్‌గా తీసుకుని సిన్సియర్‌గా దాన్ని నాకు తెచ్చివ్వడం.

''ఓరి నీ సిన్సియారిటీ మండ. భలేవాడివిరా...! లక్ష వచ్చిన టిక్కెట్టును నేను కనీసం నెంబరయినా చూడకుండా నీకిస్తే, తెచ్చి నా చేతిలో పెట్టి పాతికవేలు అడుగుతున్నావంటే... నువ్వు...''

వాడు సిగ్గుపడిపోయాడు. ''అవునండి'' అన్నాడంతే.

''అవునూ. ఇంతకీ ఈ టిక్కెట్టు నువ్వే మార్చుకోక కనీసం ముక్కు, మొఖం తెలియని నాకు ఇంత సిన్సియర్‌గా తెచ్చిచ్చావేంటీ...!?''

''అదాండీ...! మరేమో ఈ లాటరీ టిక్కెట్లయితే మా దగ్గరుంటాయిగాని, ఈ లాటరీ నిర్వహించే సంస్థ ఎక్కడుంటుందో ఎవరికి తెలుసండీ? ఇక మీకు లక్ష వస్తుందో, రాదో ఆ దేవుడికి తెలియాలి. ఆ తిప్పలన్నీ ఎవరు పడతారండీ! రాని లక్షకోసం పాతికవేలు ఎలా వదులుకుంటామండి. అందుకే ఆ టిక్కెట్టు మీ చేతిలో పెట్టి ఇంచక్కా నా పాతికవేలు నేను పట్టుకుపోదామని వచ్చానండి. మరి నా పాతికవేలు ఇస్తే నేవెళతానండీ...''

ఈసారి నిజంగా స్పృహ తప్పింది నాకు.

-బైనపాలెపు రాంబాబు





# ఇంకో పాఠం

కట్నకానుకలు దండిగా ముట్టచెబుతామన డంతో అందంగా, అమాయకంగా వున్న సుబ్బలక్ష్మిని కేవలం చదువులేదన్న వంకతో తిరస్కరించకూడదనుకున్నాడు జోగారావ్. అయిదు, క్లాసులే చదువుకున్న సుబ్బలక్ష్మి హైదరాబాద్ లాంటి ఊళ్లో ఎలా నెగ్గుకొస్తుందో అనీ, అప్పుడప్పుడు వచ్చిపోయే తన ఫ్రెండ్స్‌ని ఎలా మర్యాద చేస్తుందో అనీ మనసులో ఓ మూల




బెరుకు కూడా లేకపోలేదు. దానికితగ్గట్టు ఫ్రెండ్స్ కూడా "ఒరేయ్! ఈ రోజుల్లో కాస్తో కూస్తో చదువుకున్న అమ్మాయిని చేసుకోకపోతే చిక్కుల్లో పడతావ్ జాగ్రత్త" అని అననే అన్నారు.

భర్తంటే దైవమనీ, పరపురుషుడిని కన్నెత్తి చూస్తే పరమపాతకమనీ... ఇలాంటి ఎన్నో ధర్మసూత్రాలను చిన్నతనంనుంచే పుక్కిట పట్టేసిన సుబ్బలక్ష్మి, వాటిని ఆచరణలో పెట్టడానికి ఉవ్విళ్లూరుతోంది పెళ్లయినప్పటి నుంచీ.

ఎలాగయితేనేం హైదరాబాద్‌లో ఓ ఇల్లు కుదిర్చి, సుబ్బలక్ష్మిని కాపురానికి తీసుకొచ్చాడు జోగారావ్. వచ్చినప్పటినుంచీ "అలా మరీ పాతచింతకాయపచ్చడిలాగా చీరకట్టు మాన"మనీ, భర్తని పూజించడంకన్నా ప్రేమించడం అవసరమనీ ఇలా ఎన్నో ఆధునిక భావబీజాలు ఆమెలో నాటడానికి ప్రయత్నిస్తున్నాడు జోగారావ్.

ఓసారి రెండేళ్లు ట్రెయినింగ్ కోసమని అమెరికా వెళ్లి తిరిగి వచ్చిన తన స్నేహితుడిని ఇంటికి ఆహ్వానించాడు జోగారావ్. పెళ్లికి రాలేకపోవడంతో జోగారావ్ భార్యను చూడాలనుకున్న స్నేహితుడు ఓ మంచి ప్రెజెంట్ తీసుకుని మరీ జోగారావింటికొచ్చాడు. తీరా వచ్చికూర్చున్నాక అరిచిగీపెట్టినా జోగారావ్ ఫ్రెండ్‌కి కనిపించలేదు సుబ్బలక్ష్మి. కర్టెన్ చాటునే నుంచుని అస్పష్టంగా రెండు మాటలు మాట్లాడింది. 'ఆవిడ పద్ధతే అంత' అని నచ్చచెప్పి పెళ్లినాటి ఫొటోమాత్రం చూపించి స్నేహితుడిని సాగనంపాడు జోగారావ్. అతడలా వెళ్లగానే...

"సుబ్బూ!" అంటూ ఓ వెర్రికేకెట్టాడు.

"ఏమిటండీ?" అంటూ భయంగా వంటింట్లోంచి బయటకొచ్చింది సుబ్బలక్ష్మి.

"చూడు! పరాయిమొగాళ్లంటే రాక్షసులూ కారు. మొగుడంటే దేముడూ కాదు. ఇంటికొచ్చిన మనిషిని మర్యాద చెయ్యకుండా మొహం చాటెయ్యమని ఏ ధర్మశాస్త్రం చెప్పలేదు. ఇలాంటి అమ్మోమ్మ వేషాలు మానకపోయావంటే పుట్టింటికి పంపించేస్తానంతే" అంటూ కేకలేసి, కోపంగా బయటికెళ్లిపోయాడు.

సుబ్బలక్ష్మికి బతుకంతా అంధకారంగా అనిపించింది. "లాభంలేదు. ఆయనకనుగుణంగా తను మారకపోతే బతుకే నాశనమయ్యేలా వుంది" అనుకుంది.

మర్నాడు సాయంత్రం ఆఫీసునుంచొచ్చిన జోగారావుకి ఇల్లు తాళంవేసి వున్నట్టు కనిపించింది. 'గుమ్మంలో కొచ్చిన ఏ కూరగాయలో కొనడానికి తప్ప వీధులోకెళ్లని సుబ్బలక్ష్మి ఎక్కడికెళ్లింది చెప్మా' అని ఆశ్చర్యపోతూ, భయపడుతూ రోడ్డుకేసే చూస్తూ నుంచున్నాడు జోగారావ్. అంతలోనే ఓ ఆటోరిక్షా తన ఇంటివైపే రావడం, అందులో సుబ్బలక్ష్మి, పక్కింటి పావనరావూ వుండటం చూశాడు జోగారావు. రిక్షా ఆగగానే ఛెంగున వొక్కదూకు దూకి పరుగులాంటి నడకతో ఇంట్లోకెళ్లి తలుపేసుకున్నాడు పావనరావు. సుబ్బలక్ష్మి నెమ్మదిగా రిక్షా దిగింది. ఆవిడవేషం పూర్తిగా మారిపోయుంది.

"మధ్యాన్నం ఏంతోచక పక్కింటికెళ్లానండీ. ఆవిడ వూరెళ్లారట. ఆయన్ని సినిమాకెడదాం రమ్మన్నాను. పన్లోపనిగా బ్యూటీ క్లినిక్‌కు కూడా తీసుకెడతాను రమ్మన్నారాయన. మీరెంతసేపయిందీ వచ్చి...?" అంటూ తాళం తీస్తోంది.

మూర్ఛ వచ్చినంతపనయింది జోగారావుకి. 'మళ్లీ ఇంకో రకం పాఠం ఎల్లా మొదలెట్టాల్రా దేవుడా?' అని ఆలోచించడం ప్రారంభించాడు.

**-రాధాశివమోహన్**

---

## హతోస్మి!

**ఆ**ఫీసునుంచి బయటపడ్డాక కూడా అవే ఫైళ్లూ, కాగితాలూ... రేపు చేయాల్సిన అర్జంటువనులూ బుర్రలో సుళ్లు తిరుగుతుండడంతో పరధ్యానంగా స్కూటర్ నడుపుతున్నాను.

ఫ్రూట్ మార్కెట్ దాటి నాలుగుగజాలు వచ్చానో లేదో "ఏమండోయ్..." అన్న గావుకేకతో ఠక్కున ఆగింది స్కూటర్.

"ఏం మనిషమ్మా ఈయన...? గొంతుపగిలేలా అరుస్తున్నా విన్పించుకోరేం?" అంటూ రెండు చేతుల్లో రెండు బుట్టలు పట్టుకుని ఆయాసపడుతూ వచ్చింది రేణుక.

రేణుకంటే మా ఆవిడే! ఒక్కసారి చూస్తే మర్చిపోలేని రూపమామెది. వందలమందిలో నున్నా గుర్తించగల విగ్రహమామెది. అయితేనేం? 'పరధ్యానం పరాంకుశం'గా పేరుపడ్డ నేను గతంలో ఓసారి బస్టాండ్ వద్దా, మరోసారి రైల్వేస్టేషన్ వద్దా ఆవిడ ఉనికిని గుర్తించలేక తలవాచేలా చివాట్లు తిన్నాను. మొన్నటికిమొన్న సిన్మాహాలు మీదుగా ఇంటికి వెళ్తూ మ్యాటినీ చూసివెళ్లే జనంలో ఆవిడ ఉందని గ్రహించుకోకుండా నా ఆలోచనల్లో నేనుండి బండిమీద రయ్యిన వెళ్లిపోయాను. ఆ రాత్రి ఇంట్లో పెద్ద గొడవే జరిగిపోయింది.

"మనషన్నాక కాస్త ముందూ వెనుకా చూసుకోనక్కర్లేదా? మరీ ఇంత అయోమయంగా ఉంటే ఎలా? ఈ బుట్టలు తీసుకుని ఆటోలో రావాలంటే తడిసిమోపెడవుతుంది..." అంటూ స్కూటర్ ఎక్కింది లగాయితు ఇల్లు చేరేవరకూ 'ప్రైవేటు' సాగుతూనే వుంది. అంతేకాదు... ఇంట్లో కాలుపెడుతూనే మరో బాంబు పేలింది.

"నేను అందంగా ఎర్రగా బుర్రగా ఉండననేగదా మీకింత లోకువ. అందుకే మీ కంటికి నేను ఆనడంలేదన్న విషయం నాకు తెల్సులెండి... మొన్న మా అమ్మ కూడా ఆ మాటే అంది..." అంటూ బర్రున ముక్కుచీదింది రేణుక.

"హతోస్మి... ఇప్పుడేది దారి?" నాలో నేనే సతమతమైపోయాను. నా పరధ్యానంమీద నాకే అసహ్యంవేసింది.




ఇంక రోడ్డుమీద వెళ్లేప్పుడు కేర్‌ఫుల్‌గా వెళ్లాలి. ముఖ్యంగా రేణుకతో మళ్లీ ఇలా అన్పించుకోకుండా జాగ్రత్తపడాలి అని మనసులో స్థిరనిర్ణయం తీసుకొని ఎలాగోలా ఆమెకి నచ్చచెప్పుకున్నాను.

అది జరిగిన వారంరోజులకి- ఆఫీసునుంచి ఇంటికి వెళ్తుంటే ఎవరో నలుగురమ్మాయిలతో మాట్లాడుతూ దారిలో బస్‌స్టాప్‌లో కన్పించింది రేణుక.

“హాయ్ రేణూ...” అంటూ ఆమె పక్కనే స్కూటర్ ఆపాను. ఆ అమ్మాయిలకి వీడ్కోలు చెప్పి ముభావంగా వచ్చి స్కూటర్ ఎక్కింది రేణుక. తనను గమనించి స్కూటర్ ఎక్కించుకున్నందుకు అభినందిస్తుందనుకున్న నేను ఆమె సీరియస్‌నెస్ చూసి ఆశ్చర్యపోయాను.

ఇంటిదగ్గర దిగుతూనే, “ఏమండీ మీరు నన్ను తేలిగ్గానే గుర్తుపట్టారా? నేను మీ కంటికి ఎప్పటిలాగే కన్పిస్తున్నానా?” అంది రేణుక.

“అవును. వెయ్యిమందిలో ఉన్నా నిన్ను గుర్తించడం నాకసాధ్యం కాదు...” కోశాను.

అంతే! చివాలున బెడ్‌రూమ్‌లో దూరి మంచంమీదపడి ఏడుపు లంకించుకుంది. అయోమయంలో పడిపోయాను నేను. తరువాత అడగ్గా అడగ్గా ఎప్పటికో చెప్పింది. తను బ్యూటీపార్లర్‌కి వెళ్లివస్తోందట. వాళ్లు ఓ నాలుగొందలు తీసుకుని ఏవేవో పౌడర్లు పూసి, ఇంకేవో నూనెలు రాసి, “మేడం మీరు మీ భర్త కూడా గుర్తుపట్టలేనంతగా మారిపోయారు. నిజం చెప్పాలంటే సిన్మాస్టార్‌లా ఉన్నారు” అని చెప్పారట.

హతోస్మి!

-ప్రతాపచంద్ర





మడత పెట్టినప్పుడు ఇలా ఉంటుంది ఇది.



మొదటి బహుమతి పొందిన సైకిలు డిజైన్, 'అల్ట్రాఫోల్డర్'.
లండన్ నగర వాస్తవ్యుడైన జువాన్ జుమోవిస్కీ దీన్ని రూపొందించాడు.

దీన్ని ఉపయోగించడం అయ్యాక
ఇలా మడిచి పెట్టుకోవచ్చు.





రెండవ బహుమతి పొందిన డిజైన్ 'ప్లాస్టిక్ బైక్'
పీటర్‌బాసన్, రిచర్డ్ బెయిలీ, స్టీవెన్‌హాల్ అనే ముగ్గురు మిత్రుల సమిష్టికృషి ఇది.

సచిత్ర విచిత్రం



మూడవ బహుమతి సాధించిన సైకిలు ఇది. హెచ్.జి. హెర్బర్ట్ దీన్ని రూపొందించాడు.

# ఫోల్డింగ్ బైస్కిల్స్

దీన్ని ఇలా మడిచి ఇంట్లో ఓ గోడకు తగిలించుకోవచ్చు.



పేదవాడి ప్రయాణసాధనం సైకిలేనన్నది జగమెరిగిన సత్యం. పెరుగుతున్న జనసాంద్రత దృష్ట్యా - ముఖ్యంగా నగరాలలోనూ, పట్టణాలలోనూ అగ్గిపెట్టెలలాంటి గదులలో మగ్గిపోతున్నారు కిందితరగతులకు చెందిన ప్రజానీకం. అలాంటివారికోసం, ఇరుకిరుకు ఇళ్ళలో పెట్టుకోవడంకోసం మడతపెట్టుకునే సైకిళ్ళు అవసరంగనుక ఆ తరహా సైకిళ్ళ నమూనాలు చేయమని ఇంగ్లండ్‌లోని 'బ్రిటీష్ సైక్లింగ్ బ్యూరో'వారు ఓ పోటీ పెట్టారు. ఆ పోటీలో విజయం సాధించిన నమూనాలే ఇప్పుడు మీరు చూస్తున్న ఫొటోలు.

# రచయితలకు సూచనలు











ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్
**చతుర**
'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# ఏరిన ముత్యాలు

★ ఉదారంగా నీ శత్రువులను క్షమించు. వారు నీకెంత మంచి మిత్రులవుతారో చూడు.

--చిన్మయానంద

★ సన్యాసి వద్ద ఒక రొట్టెవుంటే అందులో సగంతిని మిగిలింది మరొకరికి ఇస్తాడు. అదే ఒకరాజు మరో రాజ్యాన్ని కబళించాలని చూస్తాడు.

--శేఖ్‌సాది

★ ఉదారబుద్ధివరోపకారం లేనివారికి ఎంత డబ్బు సంక్రమించినా అది పాపంవలె భారమే అవుతుంది. పైగా ప్రమాదంగా కూడా పరిణమించే అవకాశం వుంది.

--సిమ్మన్స్

★ ఉద్యమాలులేకపోతే ఒక్కసారిగా విప్లవమే రావచ్చు. అందుకనే ఉద్యమాలు అవసరం. వాటివల్ల శాంతి, అభ్యుదయం ఏర్పడతాయి. ఉద్యమం జరపడం మేధావుల లక్షణం.

--వెండెర్ ఫిలిప్స్

★ అన్ని ఉద్యమాలు అతివాద ఉద్యమాలే.

--బెర్ట్రాండ్ రస్సెల్

★ తోటివారికి సహాయం చెయ్యి. కానీ వారి స్వీయశక్తి నశింపచెయ్యకు.

--అరవిందఘోష్

★ లోకంలో హితబోధ చేసేవారులేక లోకం పతనం కావడంలేదు. వినేవారు, ఆచరించేవారులేక పతనమవుతోంది. మంచి చేసేవారి కన్నా చెప్పేవారు ఎక్కువ.

--బోర్డ్‌మెన్

★ ఎదుటివారు అర్థంచేసుకునే సామర్థ్యాన్ని అంచనావేసి వుపదేశం ఇవ్వు.

--హిదీస్

★ ఉపదేశాలిచ్చేవాడి లోపాలపైనే సామాన్యంగా మన దృష్టి వుంటుంది.

--లూథర్

★ సంభాషణ అవగాహనను పెంచుతుంది. కానీ ఏకాంతం ప్రతిభను మేల్కొలుపుతుంది.

--గిబ్బన్

★ ఇంకొకరికి మంచి చేయాలనుకున్నక్షణంలోనే నీకు నీవు మంచి చేసుకున్నవాడివవుతావు.

— కన్‌ఫ్యూశియస్

★ మంచివాడిని నమ్మాలి. లేకుంటే తాను మంచివాడినని అతనెలా నిరూపించుకుంటాడు.

— రామకృష్ణ పరమహంస

★ ఉత్సాహం అగ్నిహోత్రంలాంటిది. అది ఆరిపోకుండా ఓ కంట కనిపెడుతూ ఉండాలి.

-- ఆంగ్ల సామెత

# చతుర

సంపుటి: 16 సంచిక: 3 ఏప్రిల్: 1993

"ఏడవకు సింధుజా! నేనొచ్చేశాగా! ఇంక నీకేం భయం లేదు. నీ జీవితంతో చెలగాటాలాడి, నిన్ను వ్యభిచారిగా ముద్రవేసి నడివీధిలోకి గెంటించినవారందరి అంతూ తేలుస్తాను. ఆడదానివి నువ్వేం చెయ్యగలవని హేళనచేసిన వాళ్ళందరూ ఆ మాటన్నందుకు లెంపలేసుకునేలా చేస్తాను. పద కారెక్కు" అంటూ ఆ అమ్మాయికి ధైర్యంచెప్పి, ఆమెను ఓ విషవలయంనుంచి బయటకు తీసే దీక్షలో ఓ లేడీస్ లాయర్ ప్రయోగించిన ఎత్తులు, యుక్తులకి అక్షరరూపం...

పురుషాధిక్యంపై గురిచూసివదిలిన మహాస్త్రం...

**కాశీవిశ్వనాథ్** రచన **'లేడీస్ లాయర్'** ఈనెల 'చతుర' సమగ్రనవల.



"స్త్రీకి చదువక్కర్లేదు, స్త్రీకి స్వతంత్రం వుండకూడదు, ఆడది వుద్యోగం చెయ్యడం ఏమిటి... హవ్వ"

అంటూ నోరు నొక్కుకునే స్థితినించి అనసూయమ్మ మొన్న మొన్నే అంటే రెండేళ్ల క్రితమే బైటబడింది.

అందుక్కారణం ఆమెలో భావ విప్లవం వుదయించిందనో, ఎవరో ఓ అభ్యుదయవాది ఆమె మనసులో నవభావాలు అంకురింపజేశాడనో అనుకుంటే పొరపాటే.

స్టేట్ గవర్నమెంట్లో చిరుద్యోగం చేస్తున్న ఆమె భర్త ఆదినారాయణ రిటైరయిపోయి ఆరు వందల రూపాయిల పెన్షనర్గా మారిపోయేడు.

ఆనాటికి అతని మీద ఆధారపడి బతుకుతున్న జీవాలు మూడు.

అతని రెండవ భార్య అనసూయ, ఆమె ద్వారా పుట్టిన రేవతి పోగా ముఖ్యమైన మూడవ మనిషి, మొదటి భార్యద్వారా పుట్టిన సింధుజ.

సింధుజకి పెళ్లి చేసే వరకు తను ఏదైనా ప్రైవేటు కంపెనీలో వుద్యోగం చేస్తే ఇంటి వ్యవహారం గుర్రంలా పరుగులు తీయకపోయినా, తాబేలు లాగైనా నడుచుకుంటూ పోతుందని ఆదినారాయణ రిటైరయిన రోజే అనుకున్నాడు.

కానీ, అతని విషయంలో భగవంతుడు మరోలా ఆలోచించాడు. రిటైరయిన మూడో రోజునే లారీ **ఏక్సిడెంట్**లో అతని కాళ్లు రెండూ పోయేయి. దాంతో ఆయన్తోపాటు ఆ కుటుంబమే అవిటిదైపోయింది.

కుటుంబమే కాదు, ఎమ్.కామ్ చదవాలనుకుంటున్న సింధుజ ఆశ కూడా అవిటిదైపోయింది. అప్పటికి సింధుజ బీకామ్ ఫైనల్ ఇయర్ చదువుతోంది. దాంతోపాటు టైపు, షార్టు హేండు పరీక్షలకి వెళ్లి పాసైంది కూడా!

బీకామ్ ఫస్ట్ క్లాస్లో పాసయ్యేక, కళ్లు బాగా తెరచి 'నా భవిష్యత్తేమిటి?' అని చూసుకుంది.

ఆ భవిష్యత్తంతా పొగమంచు కమ్మేసినట్టుగా మసక మసకగా కనిపించింది.

మసకల్ని చెరిపేసి మరింత జాగ్రత్తగా చూస్తే కాళ్లు పోయిన తండ్రి బియ్యానికి, పప్పులక్కూడా చాలని అతని పెన్షను, తమతో పాటు ఎదిగిపోయిన అవసరాలు, ఇంటద్దె, దాన్ని కట్టకపోతే ఇంట్లోనించి బైటకి గెంటేస్తానని ఇంటి యజమాని హెచ్చరిక... ఇవన్నీ ఆమెకు ఎటువంటి మరకలు, మసకలు లేకుండా స్పష్టంగా కనిపించేయి.

పెళ్లి గురించి, కాబోయే భర్త గురించి ఆలోచించాల్సిన వయసులో సింధుజ వాటి గురించి ఒక్క క్షణం కూడా ఆలోచించకుండా ప్రతి క్షణం తన కుటుంబం గురించే ఆలోచించింది. ఆకలి తీర్చుకోవడం, ఇంటద్దెకట్టడం లాంటివన్నీ వాయిదా వెయ్యలేని అవసరాలే.

ఏం చెయ్యాలి?

చుట్టూవున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోడంకంటే గోరంత దీపం వెలిగించుకోవడం వుత్తమం అనే బుధజనుల మాట స్ఫురణకి తెచ్చుకుని "నేను వుద్యోగం చేస్తాను" అంది.

ఆడవాళ్లు వుద్యోగాలు చెయ్యడం, వూళ్లేలడం మన ఇంటా వంటా లేదంటూ అనసూయమ్మ సణిగింది.

ఆమెతో వాదించింది సింధుజ.

"గతంలో ఎప్పుడూ లేదని, ఇప్పుడు వుండకూడదా? అన్నింటికీ ఆ దేవుడే వున్నాడనుకుని మనం చేతులు ముడుచుక్కూర్చుంటే, ఆ దేవుడొచ్చి మనకి రేషన్ సామాన్లు, బట్టలు కొని, ఇంటద్దె కడతాడా? పోనీ నేను వుద్యోగం చెయ్యకుండా, మనకి ఆదాయం వచ్చే మరో మార్గమేదైనా వుందేమో చెప్పు" అంటూ ఎదురు ప్రశ్న వేసేసరికి అనసూయ ఏమీ జవాబు చెప్పలేకపోయింది.

ఇప్పుడు కావల్సింది డబ్బు! డబ్బు చేతిలో వుంటే, ఈ జనారణ్యంలో సమస్యలనే క్రూరమృగాల్ని డబ్బు అనే తుపాకీతో బెదిరించొచ్చు. మన సమస్యల్ని తీర్చడానికి మరెవరో వస్తారనుకోవడం మూర్ఖత్వం. మన సమస్యల్ని మనమే తీర్చుకోవాలని నిర్ణయించుకుని "గుడ్లక్ ఛిట్ఫండ్స్" కంపెనీలో స్టెనోగ్రాఫర్ వుద్యోగంలో జాయినైంది సింధుజ




సింధుజ వుద్యోగంలో అలా ప్రవేశించి ఇలా తొలి జీతం ఇంటికి తెచ్చినప్పుడు 'హమ్మయ్య, కష్టాలు తీరిపోయి ఒడ్డున పడిపోయేం' అని ఎవరూ అనుకోలేదు. ఏట్లో కొట్టుకుపోతున్న వాడికి చిన్న కర్రముక్కయినా ఆసరా దొరికిందని ఆదినారాయణ మాత్రం సంతోషించాడు. ''జీతం మరో వెయ్యి ఇస్తే వాళ్ల సొమ్మేం పోయిందీ'' అంటూ మూలిగింది అనసూయ.

సింధుజ వుద్యోగస్థురాలు కాగలగడానికి గల కారణం అంటూ వుంటే ఇదే! పుట్టి పెరిగిన గుంటూరులోనే వుద్యోగం రావడం, వుదయం తొమ్మిదిన్నరకి వెళ్లి సాయంత్రం అయిదు గంటలకి తిరిగొచ్చేసే వుద్యోగం అవడం వలన సింధుజకి పెద్ద కష్టమేమీ అనిపించలేదు. అక్కడ పని చేస్తూనే పేపర్లో పడుతున్న వుద్యోగ ప్రకటనలు చూసి, చాలా వాటికి అప్లికేషన్లు పంపించింది. కొన్నింటికి ఇంటర్వ్యూ కార్డులు వచ్చినా, అవన్నీ బయటి వూళ్లలో అవడంవలన ఆదినారాయణ ఒప్పుకోలేదు.

''మరో వూరెళ్లి నువ్వేం వుద్యోగం చేస్తావు? ఇప్పుడేదో నిలబడి నీళ్లు తాగుతున్నాంగా. మనకీ బతుకు చాల్లే'' అంటూ తండ్రి చెప్పిన మాటలు ఆమెను వూరు కదలనివ్వలేదు.

తండ్రి వ్యక్తం చేసింది సంతృప్తో, నిరాశో ఆమెకు అర్థం కాలేదు.

అయితే ఆమె వూర్నించి కదలక తప్పలేదు. విశాఖపట్నం బ్రేంచిలో స్టెనోగా పని చేస్తున్న వెంకటరాజు సడన్‌గా మరణించడంతో, గుంటూరు బ్రేంచ్‌లోని స్టెనోని వైజాగ్ బదిలీ చేస్తున్నట్టుగా హైదరాబాదు హెడ్డాఫీసునించి ఆర్డర్సు వచ్చేయి. ట్రాన్స్‌ఫర్ మీద వెళ్లకపోతే వుద్యోగం వదులు కోవడం మినహా మరో మార్గం లేదు. వుద్యోగం వదిలేస్తే, వెంటనే మరో వుద్యోగం అదే వూర్లో దొరుకుతుందన్న నమ్మకం లేదు.

ఒక రోజంతా ఆలోచించాక ''సర్లేమ్మా, మానింది మందు, బతికింది వూరూ అన్నారు పెద్దలు. విశాఖపట్నమే వెళ్లి పోదాం పద'' అన్నాడు ఆదినారాయణ.

  

సింధుజ విశాఖపట్నంలో డాబాగార్డెన్స్ ఏరియాలో, ఇళ్ల బ్రోకరు ద్వారా, ఓ చిన్న ఇంట్లో దిగింది. ఇల్లు బాగుందా, లేదా అనే ప్రశ్న కంటే, ఆఫీసుకి కాస్త దగ్గరగా వుంటుందన్న ఆలోచన ఒక్కటే ఆ ఇంట్లో ఆమెను దింపింది.

ఆ కంపెనీ బ్రేంచి మేనేజరు భానుమూర్తికి కొన్ని కొన్ని విషయాల మీద ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. వాటిని తనే సొంతంగా తయారు చేసుకున్నాడు కాబట్టి, వాటిని మార్చుకునే ప్రయత్నం ఏనాడూ చేయలేదు. వాటిని మార్చే అవకాశం మరొకరికివ్వలేదు. అతను ఏర్పర్చుకున్న అభిప్రాయాల్లో ముఖ్యమైంది, ఆడవాళ్ల గురించే. అందులోనూ వుద్యోగానికొచ్చే స్త్రీల గురించి చాలా కరక్టుగా రీసెర్చి చేశానని పదేపదే చెప్తుంటాడు. టచ్‌మినాట్ మొక్క మీద ఇలా చెయ్యి వేస్తే అలా ముడుచుకుపోవడం ఎంత సహజమో, వుద్యోగం చేసే స్త్రీ ఎలాంటిదైనా డబ్బు ఆశ చూపిస్తే లొంగిపోవడం అంతే సహజమనే నిర్ణయానికి ఆరేడేళ్ల క్రితమే వచ్చేశాడు.

ఆ నిర్ణయాన్ని కలిగించిన సంఘటనలు రెండు మూడు అతని జీవితంలోనే జరిగాయి. ప్రమోషన్ ఎరపెట్టి సీతారత్నాన్ని అనుభవించినప్పుడూ, వుద్యోగం ఇప్పించిన సత్తిరాజు కూతుర్ని భీమిలీ గెస్టుహౌస్‌లో అనుభవించాక 'అన్నం అంతా పట్టి చూడక్కర్లేదు, ఒక్క మెతుకు చూస్తే చాల'నే సామెత అన్నానికే కాదు ఆడదానికీ వర్తిస్తుందనుకున్నాడు.

ముప్ఫయ్యయిదేళ్లు రాకముందే అతని జుట్టు నెరవడంతో చాలా ఇబ్బంది పడిపోయేడు. శృంగారానికి, ముఖ్యంగా అమ్మాయిల్ని ఆకట్టుకోవడానికి తెల్ల జుట్టు మహా విరోధి అని గ్రహించి జుట్టుని నలుపు చేస్కోడం ఆరంభించాడు. నెత్తి మీద జుట్టుకంటే పదహారేళ్లు జూనియర్ అయిన మీసాలు కూడా జుట్టుతో పాటు నెరసిపోవడం ఓ దురదృష్టంగా భావించి, ఏకంగా మీసాల్ని తీసేశాడు. ఇప్పుడతని దృష్టిలో అతనో అందగాడు. పైగా చేతిలో అధికారం వున్న ఆఫీసరు! మిగతా అమ్మాయిల సంగతెలాగున్నా తన దగ్గర పని చేసే అమ్మాయిలు మాత్రం ఖచ్చితంగా లొంగి

పోతారు అనే ధీమాతో అతను వుంటున్న తరుణంలో అదే ఆఫీసుకి సింధుజ ట్రాన్స్‌ఫరై వచ్చింది.

ట్రాన్స్‌ఫర్ ఆర్డరు అందిస్తున్న సింధుజని చూస్తూ భానుమూర్తి అడదాన్ని చూడ్డం ఇదే మొదటిసారైనట్టుగా ఓ విచిత్రమైన అనుభూతికి లోనయేడు. ఇంతవరకూ తన జీవితంలో ఎంతోమంది అందగత్తెల్ని చూశాడుగాని, ఇంత అందమైన స్త్రీని చూడలేదనుకున్నాడు. ఇంత అందం ఇన్నాళ్లూ గుంటూరు బ్రేంచిలో వుండిపోయినందుకు బాధపడిపోయేడు. కనీసం ఇప్పుడైనా తన అధికారం కిందకి వచ్చినందుకు సంతోషించాడు. గుంటూరు బ్రేంచి మేనేజరు ఈమెను ఆల్‌రెడీ టేకిల్ చేసి వుంటాడా అని ప్రశ్నించుకున్నాడు. అతను రేపోమాపో రిటైరైపోయే పంతులుగారు పైగా దేవుడు, పాపాలంటూ కబుర్లు చెప్పే ముసలాడు కాబట్టి అలాంటిదేం జరిగుండదని తనకితానే జవాబు చెప్పుకున్నాడు.

సింధుజని కూర్చోబెట్టి, నవ్వుతూ మాట్లాడి, ఆమె కుటుంబ చరిత్రని అడిగాడు. అది ఆయనకి అనవసరం అనుకుంటూనే అడిగేవాడికి చెప్పేవాడు లోకువకదా అన్న సామెత గుర్తుకు తెచ్చుకుని తన కుటుంబం గురించి క్లుప్తంగా చెప్పింది.

తను గేలం వేయబోయే అమ్మాయి కుటుంబ చరిత్ర తెల్సుకోవడం మూర్తికి అలవాటు. యుద్ధానికెళ్లేప్పుడు ఎదుటివాడి బలాన్ని ముందుగా తెల్సుకోవాలని యుద్ధ నీతి చెప్తుంది. కొంతమంది పెద్దింటమ్మాయిలు ఇంట్లో వుబుసుపోక వుద్యోగాలు చేస్తుంటారు. అలాంటివాళ్లని తొందరపడి టేకిల్ చేస్తే కొన్నిసార్లు తన వుద్యోగమే పోయే ప్రమాదాలు కూడా ఏర్పడతాయి. సింధుజ చేస్తున్నది స్టెనోగ్రాఫరు వుద్యోగమైనా ఆమె చూడ్డానికి మధ్యతరగతి అమ్మాయి వేషం వేసుకున్న రాజకుమార్తెలా కనిపించడంతో తన సందేహాన్ని వెంటనే తీర్చుకున్నాడు. వివరాలు విన్నాక 'హమ్మయ్య, ఇది బురదలో వికసించిన పద్మమేగాని, నందనవనంలోని పారిజాతం కాదని' తేలికపడ్డాడు. ఈ అమ్మాయికి ఖర్మకాలి ఏదైనా అన్యాయం జరిగితే అదంతా విధి వైపరీత్యంవల్ల జరిగిందేనని ఒక ఏడ్పుఏడ్చి వూరుకునే కుటుంబమే తప్ప, హక్కులు, పోరాటాలూ అంటూ వీధికెక్కి పోట్లాడే రకంకాదని నిర్ణయించుకున్నాడు.

సింధుజ డ్యూటీలో జాయినైన క్షణంనించి ఆఫీసులోని అందరి కళ్లల్లోను అందమైన ఆమె ప్రతిబింబమే కదలాడ సాగింది. ఆమెకింకా పెళ్లి కాలేదని తెలిసి, ఒకరిద్దరు పెళ్లికాని గుమాస్తాలు అంతవరకు రాసుకోని టాయ్‌లెట్ పౌడర్లు రాసుకోడం ఆరంభించారు. రోజుకి ఓసారో, రెండు సార్లో మాత్రమే దువ్వుకునే జుట్టుని, ప్రతీ అరగంటకీ ఓ సారి దువ్వుకుంటున్నారు.

మర్నాడు భానుమూర్తి సింధుజని తన రూమ్‌లోకి పిలిచాడు. డిక్టేషన్ కోసం అనుకుని స్టెనోనోట్‌బుక్, పెన్సిల్ తీసుకొని వెళ్లింది.

మూర్తి నిన్నటికంటే ఇవాళ నీటుగా తయారయేడు. ఆమె చేతిలోని పుస్తకం చూసి, చిన్నగా నవ్వేడు. ''నేను నిన్ను పిలిచేనంటే అది కేవలం లెటర్ డిక్టేట్ చెయ్యడానికే తప్ప, మరెందుకూ కాకూడదా? ఇంద కాఫీ తీస్కో'' అంటూ ఓ గ్లాసుతో కాఫీ అందించాడు.

''వద్దండి'' అంది మొహమాటంగా.

''ఫర్వాలేదు తీస్కో! నా దగ్గర పనిచేసే వాళ్లని నా మనుమలుగా చూస్కోడమే నా అలవాటు. క్రమంగా ఆ విషయం నీకే తెలుస్తుంది''

అతను తననే రెప్పార్పకుండా చూస్తున్నాడని గ్రహించి, గబగబా కాఫీ తాగేసి, వెళ్లబోయింది.

''జస్ట్ ఎ మినిట్''

సింధుజ ఆగింది.

''డబ్బు గురించి నీ అభిప్రాయం ఏమిటి?''

సడన్‌గా అతనా ప్రశ్న ఎందుకు వేశాడో అర్థం కాలేదు. ఏం జవాబు చెప్పాలో అంతకంటే అర్థం కాలేదు.

మూర్తి పగలబడి నవ్వుతూ ''నా ప్రశ్న నీకు అర్థమైనట్టు లేదు. కూర్చో చెప్తాను. మనిషి బ్రతకడానికి బొందిలో ప్రాణం ఎంత ము

ఖ్యమో, ప్రాణం వున్న మనిషి బతకడానికి డబ్బూ అంతే ముఖ్యం. ఎవరి పరిధిలో వాళ్లు, ఎవరి శక్తి మేరకి వాళ్లు డబ్బు సంపాదించుకోడానికి ప్రయత్నాలు చేస్తారు. అంటే వుద్యోగం చేసో, వ్యాపారం చేసో, ఏదైనా వృత్తి చేసో, మంచి చేసో, మాయ చేసో అందరూ డబ్బు సంపాదన ధ్యేయంతోనే ఆయా పనులు చేస్తారు. ఏమ్ ఐ రైట్'' అంటూ ఆమెకు కాస్త దగ్గరగా వెళ్లి ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగాడు.

''ఔను సార్... కానీ, ఈ విషయం ఇప్పుడు నాకు ఎందుకు చెప్తున్నారో అర్థం కావడంలేదు''

''ఇప్పుడు అర్థం కాదు, నేను చెప్పిందంతా విని తీరిగ్గా, తెలివిగా ఆలోచిస్తే అప్పుడు అర్థం అవుతుంది. మనం ఈ ప్రపంచంలోని దేన్ని గురించైనా తెల్సుకునే ముందు మన గురించి మనం తెల్సుకోవడం ముఖ్యం. మనిషినించి నీడని ఎలాగైతే విడదీయలేమో మనిషినించి డబ్బుని కూడా విడదీసి మాట్లాడలేం. అలా విడదీసి డబ్బుకి దూరంగా బతగ్గలిగేవాళ్లు ఏ హిమాలయాల్లోనో తపస్సు చేస్కునే మునులై వుంటారుగానీ, సంఘజీవిగా వుండే మనిషి మాత్రం అయి వుండడు. ఇప్పుడు అసలు పాయింటుకొస్తున్నాను. డబ్బు ఎలా సంపాదించాలి? దానికి సక్రమమైన మార్గం ఏది? అక్రమమైన మార్గం ఏది? అసలు, డబ్బు విషయంలో సక్రమం, అక్రమం అంటూ రెండు మార్గాలున్నాయా? నా దృష్టిలో అయితే లేవు. ఓట్లు ఎక్కువ వేయించుకున్నవాడే నాయకుడవుతాడు. అవి దొంగ ఓట్లా, నిజంగా పడిన ఓట్లా అన్నది గాలికొదిలెయ్యాల్సిన విషయమే తప్ప ఆలోచించవలసిన విషయం కాదు. అలాగే డబ్బు ఎవరి దగ్గర ఎక్కువ వుంటే వాడే గొప్పవాడనిపించుకుంటాడు. ఎక్కువా అంటే, లక్షలు, కోట్లు వుండాలని కాదు. మాటవర్సకి నీ విషయమే తీసుకుందాం, నీ జీతం ఎంత? పది హేను వందలు. అంటే నీ సుఖాలుగానీ, నీ అవసరాలుగానీ ఆ పదిహేను వందలకే పరిమితం అయిపోతాయి. కానీ అదే నీకు నీ జీతం కాకుండా, నెలకి మరో రెండు వేలో, మూడు వేలో వచ్చేయనుకో...''

అతనలా ఎంతసేపు లెక్చరిచ్చేవాడోగాని, టెలిఫోన్ మోతకి అతను ఆగక తప్పలేదు. అందమైన బొమ్మని చూస్తున్నప్పుడు కళ్లల్లో గుప్పెడు ఇసుక జల్లినట్టుగా, చిరాకు పడుతూనే ఫోన్ అందుకున్నాడు. అది మామూలు ఫోన్ కాల్ కాదు. హైదరాబాద్‌నించి కంపెనీ ఛైర్మన్ దయానందనించి వచ్చిన కాల్. అయిదడుగుల పదంగుళాల పొడవున్న భానుమూర్తి అట్నుంచి వినిపించిన గొంతు వినగానే అంగుళన్నర సైజుకి మారిపోయి, ఫోన్‌లోకి దూరిపోయి మరీ ఎంతో వినయ విధేయతలతో కట్టుబానిస కామందుతో మాట్లాడినంత భయంతో మాట్లాడ్డం చూసి సింధుజ చిన్నగా నవ్వుకుంటూ ఆ గదిలోనించి తన సీటు దగ్గరకి వెళ్లిపోయింది. ఓ పావుగంట తర్వాత తెల్సింది, ఛైర్మన్‌గారి పిలుపు మీద భానుమూర్తి కంపెనీ మీటింగులో పాల్గొనడానికి రెండు రోజులపాటు హైదరాబాద్ వెళ్తున్నాడని. ఆ రోజు మరో రెండుసార్లు సింధుజని మూర్తి పిలిచినా, అదంతా ఆఫీసు వర్కు గురించే తప్ప, డబ్బు గురించి రెండవ పార్టు లెక్చరివ్వలేదు.

★ ★ ★

మూర్తి పనిగట్టుకుని డబ్బు గురించి ఎందుకు తనకి లెక్చరిచ్చేడో సింధుజకి అర్థం కాలేదు. ఆ విషయం గురించి ఆలోచిస్తూనే ఇంటికి వచ్చింది. ఇంటి దగ్గర రేవతి కనిపించలేదు. ఎక్కడికెళ్లిందని అడిగితే పొరుగింటి వాళ్లతో కలిసి సినిమాకి వెళ్లిందని అనసూయమ్మ చెప్పింది.

''దానికి సినిమాలు ఎక్కువైపోతున్నాయని నీకెన్నిసార్లు చెప్పేను పిన్నీ. అది ఇప్పటికి మూడుసార్లు మెట్రిక్ పరీక్షకి కూర్చున్నా పాస్ అవలేదు. ఇలా అయితే అదెప్పటికి డిగ్రీ పూర్తి చేస్తుంది''

రేవతి విషయంలో సింధుజ ఎప్పుడూ చెప్పినట్టే ఇప్పుడూ చెప్పింది. అనసూయమ్మ ఎప్పుడూ మౌనం వహించినట్టే ఇప్పుడూ వూరుకుంది. రేవతి గ్రేడ్యుయేట్ అయితే, ఆమె చేతకూడా వుద్యోగం చేయించాలని




సింధుజ అభిప్రాయం. కానీ మంచి సంబంధం వస్తే రేవతికి పెళ్లి చేసెయ్యాలని అనసూయమ్మ అభిమతం.

గుంటూరులో వున్నప్పుడోసారి ఓ సంఘటన జరిగింది.

నరసింహమూర్తి అనే సిద్ధాంతిగారి ద్వారా అనసూయమ్మ రేవతికో సంబంధం చూసింది. 'పెద్దదానికి పెళ్లి చెయ్యకుండా చిన్నదానికి పెళ్లేమిటి? శాస్త్రం ఒప్పుకోదు' అంటూ ఆదినారాయణ వాదించాడు. వారి వాదనంతా సింధుజ తన గదిలో వుండే వింటోంది.

''నా కూతురి పెళ్లికి శాస్త్రం ఒప్పుకోకపోతే, ఆ శాస్త్రాన్నిలా ఇవ్వండి, పొయ్యిలో పెట్టేస్తాను. అయినా సింధుజకి పెళ్లి చేసి, అత్తారింటికి పంపించేస్తే ఆ తర్వాత దాని జీతమంతా అత్తవారే లాక్కుంటారుగాని, మనకిస్తారా? దాని జీతం రాకపోతే మనం మన్నూ మషేణం తిని బతకాలా? మీకొచ్చే ముష్టి ఆరువందల రూపాయిల పెన్షన్‌తో ఎలా గడుస్తుందనుకున్నారు? అంచేత ఇంకెప్పుడూ పెద్దదాని పెళ్లి గురించి మాట్లాడకండి. పాలిచ్చే ఆవుని, గుడ్లు పెట్టే కోడిని, జీతం తెచ్చే కూతుర్ని ఎవరూ దూరం చేసుకోరు''

అనసూయమ్మ మాటలు సింధుజలోని స్త్రీని రెచ్చగొట్టేయి. ఆ మాటల్నిబట్టి, పినతల్లి తనకెంత విలువిస్తోందో, ఎందుకు విలువిస్తోందో **అర్థమవుతూనే** వుంది.

చదువుతున్న పుస్తకాన్ని విసిరేసి అనసూయ దగ్గరకొచ్చి, ఆవేశంగా సూటిగా అడిగింది

''నాకు పెళ్లి ఎందుకు వద్దనుకుంటున్నావు పిన్నీ?''

సింధుజ అలా అడుగుతుందని అనసూయా వూహించలేదు, ఆదినారాయణా వూహించలేదు. జవాబు కోసం తడబడింది అనసూయ.

''మన ఇంటి పరిస్థితి గమనించే నేను వుద్యోగంలో జాయినయ్యేను. అంత మాత్రాన నా జీవితం జీతం సంపాదించడానికే అంకితమైపోవాలా? నేను పెళ్లి చేస్కోకూడదా? నేను మనిషిని కాదా? నాకు సుఖపడాలనే ఆశ వుండదా? ఏం పిన్నీ మాట్లాడవ్? నేనిప్పుడు పెళ్లి చేసుకుంటాననీ చెప్పడంలేదు. నాకంటే ముందు రేవతికి చెయ్యొద్దనీ చెప్పడంలేదు. కానీ నాకు పెళ్లే అక్కర్లేదని నువ్వు నిర్ణయించావే, ఆ నిర్ణయాన్ని ప్రశ్నిస్తున్నాను. పెళ్లి అనగానే సిగ్గుతో ముడుచుకుపోవాల్సిన ఆడపిల్ల యిలా ఎదురు తిరిగి ప్రశ్నిస్తుందేమిటా అని ఆశ్చర్యపోకు. నన్ను పాలిచ్చే ఆవుతోను, గుడ్లుపెట్టే కోడితోనూ పోల్చినందుకే ప్రశ్నిస్తున్నాను. నా జీవితానికి ధ్యేయం జీతం సంపాదించి మిమ్మల్ని పోషించడమేనని నువ్వు నిర్ణయించినందుకే ప్రశ్నిస్తున్నాను''

ఎప్పుడూ ఎంతో శాంతంగా, సౌమ్యంగా వుండే సింధుజ ఇంత సూటిగా అడగ్గలుగుతుందనుకోలేదు. ఆమె అడిగిన ఒక్క ప్రశ్నకీ అనసూయ జవాబు చెప్పలేకపోయింది. మనసులో మాత్రం దీనికి పెళ్లి మీద గాలి మళ్లినట్టుందనుకుంది. ఆమె సంస్కారం ఆమె చేత అంతవరకే ఆలోచింపజేసింది తప్ప, సింధుజక్కూడా ఓ వ్యక్తిత్వం వుంటుందని ఆలోచించలేదు. ఆ తర్వాతనించి ఇప్పటివరకూ ఆ ఇంట్లో మళ్లీ ఆ ప్రస్తావన రాలేదు.

సింధుజకి వూహ తెలిసేటప్పటికి, తల్లి స్థానంలో అనసూయ కనిపించినా, తల్లి ప్రేమ ఆమెలో కనిపించలేదు. కన్నతల్లి కన్నుమూసి, కంటికి కనబడని లోకాలకి వెళ్లిపోయి, ఫొటోలో బొమ్మగా మాత్రమే మిగిలిపోయిందని సింధుజకి చాలా తొందరగానే తెలిసింది.

అనసూయకి చాలా ముందు చూపుంది. మారుటి కూతుర్ని ముందు ప్రేమగా చూసి, ఆ తర్వాత తనకి పిల్లలు పుట్టేక, ఆ ప్రేమని రద్దు చేస్తే ఆ ప్రేమకి అలవాటు పడిన సింధుజ ఎక్కడ ఇబ్బంది పడుతుందోననే మొదట్నించీ ఆమెను ప్రేమగా చూడలేదు. సింధుజ కూడా అనసూయని 'అమ్మా' అని కాకుండా 'పిన్నీ' అనే పిలవనారంభించింది. తన తండ్రి మరో స్త్రీని పెళ్లాడ్డమే ఆమెకిష్టం లేదు. అయితే అనసూయ ఆ ఇంటికొచ్చేసరికి సింధుజ వుయ్యాల్లోని బిడ్డే తప్ప, వుద్దేశ్యాలు వెల్లడించే వయసు లేదు. ఇన్ని సంవత్సరాల్లో సింధుజ, అనసూయ ఏవో మామూలుగా మాట్లాడుకోవడం మినహా ఏనాడూ మనసులు విప్పి మాట్లాడుకోలేదు. ఇద్దరూ ఒకే ఇంట్లో

ఇన్ని సంవత్సరాలుగా వుంటున్నా ఇద్దరి మధ్యా రైలు ప్రయాణికుల మధ్య కలిగే పరిచయం కంటే ఎక్కువ చనువు పెరగలేదు. ఆ ఇంట్లో గతంలో ఓ కుక్క, రెండు కోళ్లు వుండేవి. వాటితోపాటు తనూ ఆ ఇంట్లో పెరుగుతున్నానని సింధుజ ఏనాడో ఓ నిర్ణయానికొచ్చేసింది. సింధుజ గతం గురించి ఈ మాత్రం చెప్తే ఆమె ఏ నేపథ్యంలో జీవితాన్ని గడుపుకొచ్చేసిందో అర్థమైపోతుంది.

★ ★ ★

"నీ ఫ్రెండ్స్‌ని చూపించు నువ్వెలాంటివాడివో చెప్పేస్తాను" అన్నాడట ఓ మహాశయుడు. ఆ విషయం భానుమూర్తికి అక్షరాలా వర్తిస్తుంది.

అతనికి ఎందరో పరిచయస్థులున్నా అందులో ఆప్తమిత్రులుగా మారినవాళ్ళు యిద్దరే!

ఒకరు చంద్రమౌళి,

రెండవవారు ప్రభాకర్!

చంద్రమౌళి పోలీస్ సబ్‌ఇనస్పెక్టరు. ఈ దేశంలో, ఈ రాష్ట్రంలో, ఈ నగరంలో పోలీసులు ఎలాంటి మనస్తత్వంతో వుంటారో చంద్రమౌళిదీ అదే మనస్తత్వం! అడవుల్లో పులి, సింహంలాంటి క్రూరమృగాలతోపాటు లేడిపిల్లల్లాంటి సాధుజంతువులూ వుంటాయి. కానీ **పోలీసుల్లో** సాధుత్వం కలిగినవారు ఎక్కువమంది వుండరు. ఒకవేళ, ఒకటీ, అరా మనుషులున్నా కాకులమధ్య హంసలు బతకలేనట్టు, వాళ్ళూ కాకులుగా మారిపోవడమో, లేక ఏ ఫారెస్టు ఏరియాలకో ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోవడమో జరుగుతుంది. చంద్రమౌళికీవిషయం పోలీస్ డిపార్టుమెంట్లో జాయినవకముందే తెలుసు! అందుకే ముందు మంచివాడిగా వుండి, తర్వాత చెడ్డవాడిగా మారడంవల్ల ఎంతో కొంత నష్టపోవడం తప్ప, లాభం పొందేదేమీ వుండదని గ్రహించి ఖాకీ గుడ్డలు వేసుకున్న క్షణంనుంచి కరకు మనిషిగానే మారిపోయేడు.

లంచాలు తీసుకుని నేరస్థుల్ని వదిలేయడం, పెద్దవాళ్ళ ఆదేశాలమేరకి అమాయకులని జైల్లో పెట్టించడంలాంటి పనుల్ని ఎంతో సులభంగా చేయగలిగాడు.

అతని ప్రవర్తనని అతని భార్యే ప్రశ్నించింది. డబ్బుకోసం మరీ యింత అమానుషంగా ప్రవర్తించాలా? మీకు జీతం వస్తోంది. నేనూ ఉద్యోగం చేసి జీతం సంపాదిస్తున్నాను. చాలామందికంటే మన ఆదాయం ఎక్కువ. అలాంటప్పుడు యింకా ఈ అన్యాయాలూ, అమానుషాలూ ఎందుకండీ?" అంటూ ఓసారి నిలదీసినందుకు ఆమెకు రెండు సమాధానాలు లభించేయి.

చెంప కందిపోయేలా లెంపకాయ తగలడం ఒకటికాగా, రెండవది ఆయన్ని ఆయన సమర్థించుకోవడం!

"చూడూ! దేవాలయంలోకెళ్ళేటప్పుడు బయట చెప్పులు విడిచేస్తాం. ఎందువల్ల? గుడిలోకెళ్ళేటప్పుడు కాళ్ళకి చెప్పులు వుండకూడదనే ఓ సాంప్రదాయానికి కట్టుబడి అలా చేస్తాం. యుద్ధంలోకెళ్ళే సైనికుడు అహింసా సిద్ధాంతాన్ని పాటించకూడదు. పాటిస్తే ఎదుటివాడు పొడిచి పారేస్తాడు. పోలీసులం ఖాకీబట్టలే వేస్కోవాలితప్ప, సన్యాసుల్లా కాషాయవస్త్రాలు వేస్కోకూడదు. ఎందుకంటే మేం ఫలానా రంగుబట్టలే వేస్కోవాలనే నియమం వుంది. అలాగే మేం కొన్ని పనులు చెయ్యాలని, కొన్ని పనులు చెయ్యకూడదనీ నియమం వుంది. కాఫీ అన్నాక అది వేడిగా వుంటేనే దానికి రుచి! బీరు అన్నాక అది చల్లగా వుంటేనే దానికి రుచి! కాఫీ చల్లగా వున్నా బీరు వేడిగా వున్నా లాభం వుండదు. అలాగే పోలీసులు కరకు కత్తుల్లా గట్టిగా వుండాలితప్ప, దూది ఏకుల్లా మెత్తగా వుంటే మమ్మల్ని మొత్తేస్తారు. మేం సామాన్య ప్రజలకి అన్యాయం చేసి, పెద్దవాళ్ళకి కొమ్ముకాసి, లంచాలు మెక్కేస్తున్నాం అని చాలామంది గగ్గోలు పెడుతున్నారు. కానీ, నేనో ప్రశ్న అడుగుతాను చెప్పు, ధనవంతులుమాత్రం ప్రజలకిందకి రారా? వాళ్ళకి మేం సెల్యూట్‌లు కొడుతున్నాం అంటే, అందువల్ల లాభాలున్నాయి. లేకపోతే ఎందుకు కొడతాం? భక్తులు ఏడుకొండల వెంకటేశ్వరుణ్ణి కొలిచినంతగా అనకాపల్లి నూకాలమ్మనో, పిట్టలపాలెం పోతురాజునో ఎందుకు సేవించరు? ఏ దేవుడికి




మహిమలూ, ఫాలోయింగూ, గ్లామరూ వుంటాయో, ఆ దేవుడికే పూజలు ఎక్కువ జరుగుతాయి. ఎవడిదగ్గర డబ్బు, అధికారా లుంటే వాళ్ళకే మేం భజనలు చేస్తాం. కాకాలు పడతాం, కొమ్ముకాస్తాం''

చంద్రమౌళి యిలా తెగించి చెప్పేక రుక్మిణి మళ్ళీ ఎప్పుడూ ప్రశ్నించలేదు. తను ఎక్కాల్సిన రైలు కాకుండా, ఎక్కకూడని రైలు ఎక్కేసింది. ఇప్పుడు చైన్ లాగి రైలు ఆపి, దిగిపోయే అవకాశం లేదు. ఆ రైలు ఏ రూట్లో వెళ్తే తన ప్రయాణమూ అటు సాగాల్సిందే!

పెళ్ళికిముందు రుక్మిణి ఎక్కువగా సినిమాలు చూసేది. అందులోని కొంతమంది హీరోలు పోలీస్ ఆఫీసరు పాత్రలు ధరించి, సమాజంలోని దుండగుల్ని దుర్మార్గుల్ని చీల్చి చెండాడుతుంటే సంతోషించేది. తనక్కూడా అలాంటి నిజాయితీగల పోలీస్ ఆఫీసరు వీరుడు భర్తగా దొరికితే బావుణ్ణనుకుంది. పెళ్ళి చూపుల సమయంలో చంద్రమౌళి పోలీస్ ఆఫీసరని తెలిసి పొంగిపోయింది. కానీ, పెళ్ళయ్యేక తెలిసింది, తన భర్త పోలీస్ **ఆఫీసరే** గాని నిజాయితీపరుడు కాదనీ, అతనికి క్రూరత్వంతప్ప వీరత్వం లేదనీ.

ఆరోజు రుక్మిణి ఉదయం అయిదున్నరకే లేచింది. **పిల్లలిద్దరినీ** నిద్రలేపి, ముఖాలు కడిగించి, స్నానాలు చేయిస్తుండగా చంద్రమౌళి నిద్రలేచి, బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని సిగరెట్ వెలిగించి రుక్మిణి తెచ్చే కాఫీకోసం ఓ నిమిషంసేపు వెయిట్ చేశాడు. కాఫీ రాలేదు. ''రుక్కూ'' అంటూ అసహనంగా పిలిచేడు. బాత్‌రూమ్‌లో వున్న రుక్కూకి ఆ కేక వినిపించింది. ఆ యింటి పనులకి నియమించబడ్డ మఫ్టీ కానిస్టేబులు పోతురాజు ముంగిట్లో కూర్చుని బీడీ కాలుస్తున్నాడు. అతన్ని పిల్చింది. బీడీ పారేసి వచ్చేడు.

''ఫ్లాస్కులో కాఫీ వుంది. అయ్యగారికి ఓ కప్పులో పోసి యివ్వండి'' అంది.

పోతురాజు తెచ్చిన కాఫీని నేలక్కొట్టేడు చంద్రమౌళి. ''రుక్కూ రుక్కూ'' అంటూ యిల్లు అదిరిపోయేలా పిలిచేడు. పిల్లల ఒంటికి సబ్బు రాస్తున్న రుక్కు ఆ పనిని అలాగే ఆపి, చేతులు కడుక్కుని, గబగబా వెళ్ళి మరో కప్పులో కాఫీ పోసి చంద్రమౌళి దగ్గరకి తీసుకువెళ్ళింది.

''కానిస్టేబుల్‌చేత కాఫీ పంపించావేంటి? నీకు ఖాళీలేదా? కళ్ళు నెత్తికెక్కేయా?'' చంద్రమౌళి ఆమెవేపు రౌద్రంగా చూస్తూ అరిచాడు.

ఆమె వెంటనే జవాబు చెప్పకుండా పోతురాజువైపు చూసింది. అతను అర్థంచేసుకుని బైటకి వెళ్ళిపోయేడు.

''కానిస్టేబుల్సుముందు నన్ను అలా మాట్లాడితే, వాళ్ళకి నావట్ల గౌరవం ఏం వుంటుంది?'' అంది మెల్లగా.

''వాళ్ళకి గౌరవం వుండాల్సింది నామీద గాని, నీమీద కాదు. అయినా గౌరవాల గురించి అంతలా ఫీలైపోయేదానివి, నాకు బెడ్‌కాఫీ నువ్వు యివ్వడం మర్యాదని తెలియదా?'' అంటూ ఆమెను నఖశిక పర్యంతం చూశాడు.

ఆమె యింకా ముఖం కడుక్కోలేదు. స్నానం చెయ్యలేదు. తల దువ్వుకోలేదు. మంచంమీదనుంచి ఎలా లేచిందో అలాగే వుంది. పైగా పిల్లలకి స్నానాలు చేయిస్తూ, చేయిస్తూ రావడంవల్ల చేతులమీద సబ్బునురగ కూడా వుంది.

''నీకు లక్షసార్లు చెప్పేను. నాకు బెడ్‌కాఫీ యిచ్చేటప్పుడు నువ్వు కడిగిన ముత్యంలా కళకళలాడుతూండాలని. అయినా, స్నానం చెయ్యకుండా ఏబ్రాసి ముఖంతోనే దర్శనమిస్తుంటావు... ఛీ...ఛీ'' అంటూనే కాఫీ సిప్‌చేశాడు.

''చూడండి, నీట్‌నెస్ గురించి నాకు మరొకరు చెప్పాల్సిన అవసరం లేదు. కానీ మీరు నాసైడ్‌నుంచి ప్రాక్టికల్‌గా ఆలోచించండి. పెళ్ళై, పిల్లలు పుట్టేవరకూ నేను వుదయం లేచి, కడిగిన ముత్యంలా తయారయే మీకు బెడ్‌కాఫీ యిచ్చేదాన్ని. కానీ, యిప్పుడలా కుదరడంలేదు. పిల్లల్ని లేపి, ముఖాలు కడిగించి, స్నానాలు చేయించాలి. టిఫిను చేసి వాళ్ళకి పెట్టి, బట్టలు వేసి, స్కూలుకి పంపాలి. మరోపక్క మనకి వంటచేసి, నేను స్నానంచేసి, కేరియర్ కట్టుకుని ఆఫీసుకి బయలుదేరాలి. అప్పటికీ ఉదయం అయిదుగంటలకే లేస్తు

న్నాను.... యివన్నీ మీరు ఆలోచించరేం?''

ఇలాంటి వాదన నెలకి రెండుమూడుసార్ల యినా జరుగుతుంది. రుక్మిణి తన పరిస్థితి ఏమిటో చెప్తూనేవుంటుంది. అయినా అతను అలా అడుగుతూనే వుంటాడు. చిరాకుపడు తూంటాడు. ''నిన్ను కదిలిస్తేచాలు, కందిరీగ లాగ కఁయ్‌మంటూ రెచ్చిపోతావు'' అంటూ చిరాకుపడుతూనే బాత్‌రూమ్‌లోకి నడిచాడు.

పిల్లలు, చంద్రమౌళి టిఫిన్లు తింటుండగా రుక్మిణి కొలీగ్ భాగ్యలక్ష్మి వచ్చింది. ఆమె కూడా ఆ వీధిలోనే వుంటోంది. ప్రతిరోజూ ఆమె, రుక్మిణి కలిసే ఆఫీసుకి వెళ్తుంటారు.

''ఏమిటండీ ఇంకా తయారవలేదా?'' అంటూ వచ్చి సోఫాలో కూర్చుంది.

''అయిదు నిమిషాల్లో తయారైపోతానండి. యిదిగో అన్నం వార్చేస్తే పని అయిపోయిన ట్లే'' అంటూ రుక్మిణి హడావిడిగా వంటగదిలో కి పరుగెత్తింది. డైనింగ్‌టేబిల్‌మీద కొబ్బరి చట్నీ వున్నా చంద్రమౌళి తనంతట తానుగా వేస్కోడు, రుక్మిణియే వేయాలి. అందుకే పిలి చాడు. రుక్మిణి మళ్ళీ వంటగదిలోనుంచి హడా విడిగా వచ్చి చట్నీ వేసింది. ఆమె భయమల్లా భాగ్యలక్ష్మిముందు తననేం అనేస్తాడోననే!

అన్నం వారుస్తుండగా పిల్లల్ని తీసుకెళ్ళడా నికి రిక్షా వచ్చింది. పిల్లల్ని రిక్షా ఎక్కించింది. పిల్లలు చదివే స్కూలు చంద్రమౌళి పోలీస్ స్టేషన్‌కెళ్ళే దారిలోనే వుంది. అయినా పిల్లల్ని మోటార్ సైకిల్‌మీద తీసుకువెళ్ళడానికిష్టపడ డు. భాగ్యలక్ష్మి రుక్మిణి తీస్తున్న పరుగులు, పడుతున్న హడావిడి అంతా చాన్నాళ్ళనుంచి గమనిస్తూనే వున్నా ఏనాడూ కామెంట్ చెయ్య లేదు. ఆ రోజు ఎందుకో ఓమాట అనేసింది.

''మీకు ఈ వురుకులూ పరుగులూ ఎందుకు రుక్మిణిగారూ! మీవారు పోలీస్ ఆఫీ సరైనందుకు మీకసలు ఉద్యోగం చెయ్యాల్సిన అవసరమే లేదు. హాయిగా యింటిపట్టునే వుండి, యింటిని, పిల్లల్ని చూసుకుంటూ కాలుమీద కాలు వేసుకు బతికెయ్యొచ్చు''

చంద్రమౌళి ఆమెనోసారి చూసి అడిగాడు, ''మీరెందుకు వుద్యోగం చేస్తున్నారు?''

''మా ఆయన కేవలం ఓ గుమస్తా, ఆయన తెచ్చే ఒక్క జీతం మాకు చాలదు కాబట్టి''

''మీకు ఎంత ఆదాయం వస్తే మీరు ఉద్యోగం మానేస్తారట?''

''యిప్పుడు నాకూ మా ఆయనకీ కలిపొచ్చే **జీతం**మా ఆయన ఒక్కరికీ వస్తే నేను యిల్లే కదలను''

''అదే పొరబాటు. అప్పుడు మీకు మరో రెండు వేలు వస్తే బావుణ్ణనుకుంటారు''

''నాకేం అంత ఆశ లేదులెండి. వుదయం లేచిందగ్గర్నుంచీ మా ఆడాళ్ళకి పరుగులే. అందులోనూ యింటిపని, ఆఫీసుపనీ చూస్కు నేవాళ్ళకైతే మరీను. పిల్లలుండి, వాళ్ళని చూ స్కోడానికి పెద్దవాళ్ళు లేకపోతే మరీ నరకం. యింటిపనంతా చూస్కుని బస్సుకోసం పరుగు లు, బస్సెక్కడానికి యుద్ధం, ఎక్కేక అందులో పావుగంట ప్రయాణం, అయిదు నిమిషాలు ఆలస్యంగా వెళ్తే అక్కడ మా మేనేజరు నిప్పు లు తొక్కిన కోతిలా చిందులు వేస్తాడు. అక్కడ పనంతా చేసి, సాయంకాలం ఆరుగంటలకి యిల్లుచేరాక, మళ్ళీ యింట్లో పని... ఈ తిప్పల న్నీ ఎన్నాళ్ళు పడతాం చెప్పండి''

భాగ్యలక్ష్మి వాదనకి చంద్రమౌళి ఏం చె ప్తాడా అని వంటగదిలో వున్న రుక్మిణి ఆసక్తిగా ఎదురుచూసింది. ''ఏమైనా యీమధ్య మీ ఆడవాళ్ళకి మాటలు ఎక్కువైపోయేయిలెండి. అందులోనూ ఉద్యోగాలు చేసి, జీతాలు సంపా దించే ఆడాళ్ళైతే మరీ రెచ్చిపోతున్నారు''

చంద్రమౌళి ఆ టాపిక్కుని పెంచకుండా స్టేషన్‌కెళ్ళిపోయేడు.

భాగ్యలక్ష్మి చెప్పిందానికి చంద్రమౌళి చె ప్పింది సమాధానం అనిపించుకోదు.

మర్నాడు రుక్మిణికి జీతాలిచ్చేరు. ఆఫీసులో అందరూ వచ్చే ఆదివారం ఋషికొండకి పిక్నిక్ వేశారు. అందరూ ఫామిలీల్తోసహా రావ చ్చు. తలా ఓ యాభై రూపాయిలూ యివ్వాలి. అందరూ యిచ్చేరు. రుక్మిణి కూడా యిచ్చింది. అదో సమస్యగా మారుతుందని ఆమె అప్పుడు వూహించలేదు. కానీ, చంద్రమౌళి దాన్ని సమ స్యగా మార్చేడు. ప్రతినెలా రుక్మిణికి జీతం అందగానే దాన్ని అలా చంద్రమౌళి చేతికిచ్చె





య్యాలి. అందులోనించి నూటయిరవై రూపాయలుమాత్రం ఆమె పర్సనల్ ఖర్చులకింద యిస్తాడు. ఆ నూట యిరవైలోనే ఆమె బస్సు ఛార్జీలు, ఆఫీసులో కాఫీలు తాగినా, మరో అవసరం, మరో అవసరం వున్నా అందులోనే సరిపెట్టుకోవాలి. యింటిఖర్చులన్నింటికి, దేని కెంత అని లెక్క చూసి చూసి మరీ యిస్తాడు. యిచ్చిన ప్రతి రూపాయికీ లెక్కలు చెప్పాలి.

"జీతంలో ఓ యాభై తక్కువున్నట్టుందే" అన్నాడు డబ్బు లెక్కచూస్తూ.

"ఔనండీ! ఆఫీసువాళ్ళు పిక్నిక్కు వేశారు. యాభై రూపాయిలు యిచ్చేను" అంటూ వంటగదిలోకి వెళ్ళబోయింది. కానీ అతను వెళ్ళనివ్వకుండా మరో ప్రశ్న అడిగాడు.

"నాకు చెప్పకుండా ఎందుకిచ్చేవ్"

"అందరూ యిచ్చేరు... నేనూ యిచ్చాను"

"నేను అడిగింది వేరు, నువ్వు చెప్తున్నది వేరు! నాకు చెప్పకుండా ఎందుకిచ్చేవూ అని అడుగుతున్నాను"

"యిప్పుడు చెప్తున్నాగా"

"యిచ్చేక చెప్పడంగాదు. నాకు చెప్పి ఎందుకివ్వలేదూ? అని"

"అదికాదండీ... మా సెక్షన్ హెడ్డు అందరి దగ్గరా డబ్బు కలెక్ట్ చేస్తున్నాడు. ఫామిలీ అంతా రావచ్చంటున్నారుకదాని నేనూ యిచ్చేను... మీరూ రావచ్చు".

"నో..."

"మీరు రాకుండా నేనూ పిల్లలూ వెళ్తే ఏం బాగుంటుంది?"

"నేను అలా కూడా చెప్పలేదే" అంటూ సిగరెట్ వెలిగించాడు. "నువ్వు పిక్నిక్కి వెళ్ళ డం నాకిష్టంలేదు. రేపు ఆ యాభై రూపాయిలూ అడిగి పట్టుకొచ్చెయ్"

రుక్మిణి ఆ మాటతో చలించింది.

"అలా అడిగితే ఏమైనా బాగుంటుందా?" ఆవేశాన్ని అదుపులో పెట్టుకుంటూ అడిగింది.

"అలా అడగడం బాగులేకపోతే ఒకలా చేద్దాం" అంటూ ఆ డబ్బులోనించి ఓ డెబ్భై రూపాయిలు రుక్మిణి చేతికిచ్చేడు.

"ప్రతి నెలా నీకు నూటయిరవై చొప్పున యిస్తున్నాను కదా. యీ నెల ఆ యాభై రూపాయిలూ కట్ చేసి డెబ్భయ్యేయిస్తున్నాను. యిచ్చిన డబ్బు తిరిగి అడగడం మాత్రం నీకు బాగోదు. కానీ, నా పర్మిషన్ లేకుండా నువ్వు దుబారా చెయ్యడం మాత్రం బాగుంటుందేం?" అంటూ ఎత్తి పొడుపుగా అనేసి, బయట నిలబడ్డ కానిస్టేబుల్ పోతురాజుని పిలిచాడు.

"యస్సార్"

"యీ డెబ్భై తీసుకెళ్ళి ఓ హాఫ్ బోటిల్ విస్కీ తీస్కురా" అంటూ డెబ్భై యిచ్చి పంపించేడు.

రుక్మిణికి సహనం చచ్చిపోయింది. "మీరు ప్రతినెలా నాకిస్తున్న నూట యిరవయ్యే నా ఖర్చులకి చాలడంలేదు. యీ నెలనించీ మరో యాభయ్యో వందో పెంచమని అడుగుదామనుకుంటున్నాను. కానీ, మీరు యీ నెల నాకు డెబ్భయ్యేయిచ్చి సర్దుకోమంటే ఎలా! ఆ డబ్బు బస్ ఛార్జీలకే చాలవు. మిగతా ఖర్చులెలా భరిస్తాను"

"మీ ఆడాళ్ళకి ఖర్చులేం వుంటాయ్? మీరు మాలాగ మందు కొట్టరు, సిగరెట్లు కాల్చరు. హొటల్సుకెళ్ళరు! వ్యాపారానికి మదుపు, సంసారానికి పొదుపు చాలా అవసరం"

"పొదుపు పాటించే వాళ్ళైతే మీరు ఒక్కరోజు మందుకోసం డెబ్భై రూపాయలు ఎందుకు ఖర్చుచేస్తారు?"

"నేను మగాణ్ణి"

"నేను అడుగుతున్నది మీరు **మగాడా? ఆడ**వాళ్ళా అని కాదు. మీరు చేస్తున్న ఖర్చుల గురించి"

"మళ్ళీ అదే చెప్తున్నాను. నేను మగాణ్ణి, నాకంటూ కొన్ని ఖర్చులుంటాయ్"

"నేను మగాణ్ణి కాకపోయినా, నేనూ వుద్యోగం చేస్తున్నాను. నేనూ మీలాగే జీతం సంపాదిస్తున్నాను. రెండు వేల అయిదు వందలు జీతం సంపాదిస్తున్న నాకు, మిమ్మల్ని అడక్కుండా ఓ యాభై రూపాయలు ఖర్చుపెట్టే హక్కు లేదా? అది దుబారాయేకావచ్చు. నా సంపాదనమీద నాకా మాత్రం హక్కు లేదా?





నాకా మాత్రం స్వతంత్రం లేదా?''

రుక్మిణిలో సహనం తగ్గిపోతోంది. వ్యక్తిత్వం వుడికిపోతోంది. నేను సంపాదించే డబ్బుకి నేను యజమాన్నా? బానిసనా? అనే సందేహం ఆమె హృదయాన్ని సూదుల్తో పొడిచేస్తోంది.

''చూడు రుక్కూ! నీకున్న స్వతంత్రం నువ్వు జీతం సంపాదించడం వరకే! కానీ, నువ్వు ఖర్చుచేసే ప్రతీపైసాకి నేను పర్మిషన్ యివ్వాలి. ఎందుకంటే నేను భర్తని, నువ్వు భార్యవి కాబట్టి! నేను మగవాణ్ణి, నువ్వు ఆడదానివి కాబట్టి''

అతని ప్రతి మాటలోను, మాటలో వుండే ప్రతీ అక్షరంలోనూ పురుషాధిక్యత ధ్వనిస్తూనే వుంది.

నేను మగాణ్ణి!

నువ్వు ఆడదానివి.

''నేనూ పురుషుడితో సమానంగా జీతం సంపాదిస్తున్నానుగా!''

''అయినా సరే, నువ్వు ఆడదానివి, నేను మగాణ్ణి'' 'ఏవిటీ అహంకారం? ఏవిటీ అసమానత్వం? నెల ముప్పై రోజులూ ఆఫీసుకెళ్ళి వుద్యోగం చేసి సంపాదించే జీతంలో ఓ యాభై రూపాయలు స్వతంత్రంగా ఖర్చుచేసే అధికారం తనకి లేనప్పుడు నేను వుద్యోగం చెయ్యడమెందుకు?' అనుకున్న రుక్మిణి-

''నేను రేపట్నించి వుద్యోగం మానేస్తున్నాను'' అని తెగేసి చెప్పింది.

''కారణం?'' పోతురాజు తెచ్చిన బోటిల్ ఓపెన్ చేసి, గ్లాసులో పోసుకుంటూ చాలా యధాలాపంగా అడిగాడు.

''**మీరూ** సంపాదిస్తున్నారు, నేనూ సంపాది స్తున్నాను, అయినా సంపాదించే డబ్బు మీద మీకుండే హక్కు, స్వతంత్రం నాకు లేదంటు న్నారు. ఇదేం న్యాయమని అడిగితే నేను మగాణ్ణి, నువ్వు ఆడదానివీ అంటున్నారు. ఒకే. భర్తంటే భరించువాడూ అని కదా అర్థం. రేపట్నించి నేనూ మీమీదే ఆధారపడి బ్రతుకు తాను. నేను వుద్యోగం మానేస్తాను. మీరు నన్ను పోషించండి''

చంద్రమౌళి మాట్లాడలేదు. విస్కీ తాగ డంలోనే కాసేపు నిమగ్నమయేక, మళ్ళీ ఆ టాపిక్ ఎత్తుతూ, రుక్మిణి అంతవరకూ చె ప్పిందేదో చాలా **సింపుల్** మేటర్ అయిన ట్టుగా ఫీలయి, యధాలాపంగా అన్నాడు.

''చూడు రుక్కూ! నువ్వు వుద్యోగం చేస్తున్నా వనే నిన్ను పెళ్ళి చేసుకున్నాను. యిప్పుడు నువ్వా వుద్యోగం మానేస్తే నేను వూరుకుంటా నని ఎందుకనుకుంటున్నావు? నేను పోలీస్ ఇనస్పెక్టర్నికదా! మహామహా నేరస్థులచేత నేరాలు ఒప్పించేసాను. ఒప్పుకోకపోతే చావగొ ట్టి మరీ ఒప్పించేను. నేరం చెయ్యని వాళ్ళచే తకూడా కొన్ని సందర్భాల్లో నేరం చేసినట్టుగా ఒప్పించేశాను. అయితే అది పోలీస్ స్టేషన్లో. నేను యింట్లో పోలీసాఫీసర్ని కాదు. నీ భర్తని. నువ్వు హక్కులు, అన్యాయాలు, స్వతంత్రా లంటూ వెధవ కబుర్లు చెప్పి యింటిని పోలీస్ స్టేషన్‌గా మార్చేవనుకో, నేనూ యిక్కడ పోలీసా ఫీసర్‌గానే ప్రవర్తించాల్సివుంటుంది... కానీ, అలా చెయ్యడం నాకిష్టంలేదు. అంచేత దయ చేసి, నీ నినాదాలు, పోరాటాలు తీసి పక్కన పెట్టు. లేదనుకో... చెప్పేనుగా, నేను పోలీస్ మనిషినని...''

రుక్మిణి బెడ్‌రూమ్‌లోకెళ్ళి మంచంమీద పడుకుంది. ఎక్కడో ఏదో, తనకి ప్రీతి పాత్ర మైన వస్తువుని పోగొట్టుకున్న బాధ ఆమె కనుకొనల్లో నీళ్ళు చిప్పిల్లజేసింది. అద్దాల బీరువాలో మెరుపు తగ్గి నల్లబారుతున్న వెండి కప్పు ఆమెను చూసి పరిహాసంగా నవ్వినట్టు యింది.

అది ఇంటర్ కాలేజియేట్ డిబేట్ కాంపిటే షన్సులో తనకి ప్రథమ బహుమతిగా లభించిన బహుమతి!

''స్త్రీ జాతి ఎందుకు వెనకబడింది? ఏం చేస్తే స్త్రీజాతి ముందడుగు వేయగలుగు తుంది?''

ఈ అంశంమీద జరిపిన వక్తృత్వపు పోటీల్లో రుక్మిణి వుమెన్స్ కాలేజీ తరఫున పాల్గొంది. అప్పుడు తను ఏ పాయింట్సు మాట్లాడిందో యిప్పటికీ తనకి గుర్తే! గుర్తుండకపోడానికి, అవేవీ పుస్తకాలు చదివి, కంఠతా పెట్టిన విషయాలు కావు. తన చుట్టూ వున్న సమాజా న్ని ఆ సమాజంలో పురుషాహంకారానికి నలిగి పోతున్న ఆడవాళ్ళనీ చూసి, తనకి తానుగా ఏర్పరుచుకున్న అభిప్రాయాలు.

''భావ వ్యక్తీకరణకు భాష కూడా లేనిరోజు ల్లో, మానవుడికి, జంతువుకీ తేడా లేకుండా బ్రతుకుతున్న కాలంలో, పురుషుడు ఎక్కువ, స్త్రీ తక్కువనే భేదమే లేదు. వారికి ఆకలి, నిద్ర, భయం, కామం అనే నాలుగు అవసరా లు, అనుభూతులు మాత్రమే వుండేవి. ఆకల్ని తీర్చుకోవడం ఒక్కటే వారి దినచర్య. అందు కోసం యిద్దరూ సమానంగానే వేటాడేవారు. కానీ సృష్టి సహజంగా స్త్రీ రెండు అవరోధాలవ ల్ల పురుషుడికంటే వెనకబడింది. ఒకటి నెల వారీ వచ్చే రుతుక్రమం వచ్చినప్పుడు, గర్భవ తిగా కడుపులో బిడ్డని మోసేటప్పుడు స్త్రీ వేటలో పాల్గొనలేకపోయేది. అప్పుడు ఆడది కొండ గుహలో విశ్రాంతి తీసుకుంటే, పురుష డు బయటకెళ్ళి ఆహారం తెచ్చేవాడు. అదిగో, అప్పటినించే స్త్రీ గృహ నిర్వహణా బాధ్యతని స్వీకరించే వ్యక్తిగాను, పురుషుడు ఎర్నింగ్ పెర్సన్‌గానూ మారిపోయేడు. అప్పట్నించే, స్త్రీని యింట్లో కూర్చోబెట్టి పోషిస్తున్నాననే ధీమా పురుషుడిలో మొదలైంది. నేను పోషిస్తున్నప్పు డు నా భార్య నాకు బానిసగానే బ్రతకాలనే పురుషాహంకారం ఆరంభమయింది. ఆ తర్వా త్తర్వాత, ఆడది చిన్నతనంలో తల్లిదండ్రుల మీద, యవ్వనంలో భర్తమీద, వృద్ధాప్యంలో బిడ్డలమీద ఆధారపడి బతకాలే తప్ప, జీవితం మొత్తంమీద ఏ దశలోనూ వ్యక్తి




త్వంగల మనిషిగా బతక్కూడదనే ఓ శాసనంలాంటి సిద్ధాంతాన్ని పురుషుడు అమలులోనికి తీసుకొచ్చేడు. దీనికి తోడుగా- ఆడదానికి స్వతంత్రంగాని, చదువుగాని అక్కర్లేదంటూ నిర్ణయాలు చేశారు. అంతే ఆనాట్నించి, యీనాటి వరకు ఆ చట్రంనించి ఆడది బయటపడలేకపోయింది. వీటన్నింటి మూలంగా ఆడది చరణదాసిగా మారిపోతే, పతియే ప్రత్యక్షదైవం అని స్త్రీచేత పూజించబడేస్థాయికి పురుషుడు ఎదిగిపోయేడు. ఆ దాసికీ, యీ దైవానికి మధ్యనున్న అగాధం కాలంతోపాటు పెరిగి పోయిందే తప్ప తరగలేదు. అయితే, యీ పెరుగుటంతా విరుగటకొరకే అని మనం నిరూపించాలి. మనం చదువుకున్న చదువులు మన వ్యక్తిత్వాన్ని పెంచకపోతే, ఆత్మగౌరవాన్ని రక్షించకపోతే, మనం చదవడం వృధా! మనం సంపాదించే డిగ్రీలు కేవలం కాగితాలుగా మారిపోయి, గోడకి వేళ్ళాడే పటాలుగా మిగిలిపోతాయి.

ఆడది ఆర్థికంగా సంపాదనపరురాలు కాకపోబట్టే, పురుషుడిమీద ఆధారపడవలసివచ్చింది. ఆడది గృహ నిర్వహణకి ఎంత కష్టపడినా, అదంతా లెక్కలోకి రాకుండా, కేవలం పురుషుడిమీద ఆధారపడి బ్రతుకుతోందన్న ఒకే ఒక్క కారణంగా, ఆడది వెనకబడింది. అందుకే మనమూ వుద్యోగాలు చెయ్యాలి. మనమూ సంపాదనాపరులంకావాలి. అప్పుడు ఒకరు ఎక్కువ ఒకరు తక్కువనే భేదంలేకుండా, వ్యాపారంలో యిద్దరు భాగస్థుల్లా సమానహోదాల్లోను, యిద్దరు స్నేహితుల్లా సఖ్యంగానూ వుండే అవకాశం కలుగుతుంది...''

ఇలా సాగిన రుక్మిణి వాదన అందర్నీ ఆకట్టుకుంది. బహుమతికి యోగ్యం చేసింది. ప్రశంసలకి పాత్రం చేసింది. డిగ్రీ పూర్తయేక కావాలనే వుద్యోగంలో జాయినయింది. ఆ తర్వాత పెళ్ళి...

''రుక్కూ'' అంటూ పిడుగులా వినిపించిన పిలుపుకి రుక్మిణి అదిరిపడి లేచింది. ఎదురుగా మందుగ్లాసు పట్టుకున్న చంద్రమౌళి రౌద్రవదనంతో ఆమెనే చూస్తున్నాడు.

''పావుగంటనించి ఐస్‌వాటర్ కావాలని అరుస్తుంటే వినిపించడంలేదా?''

రుక్మిణి గబగబా వెళ్ళి ఫ్రిజ్‌లోనించి వాటర్ బోటిల్ తీసిచ్చింది.

''ఏవిటాలోచిస్తున్నావ్?''

''ఏం లేదు'' అంటూ వంటగదిలోకి వెళ్ళబోయింది.

''ఏమీలేకపోతే, నా పిలుపు కూడా విననంతగా మైమర్చిపోయి ఎందుకాలోచిస్తావు? యిందాక నాతో ఆర్గ్యూ చేశావు. ఆ తర్వాత దీర్ఘాలోచనలో పడ్డావంటే, నువ్వు ఖచ్చితంగా నా గురించే ఆలోచిస్తున్నావు. ఔనా? కాదా?''

''ఏవిటండీ యీ ఇంట్రాగేషన్'' అంటూ మనసులోనే గొణుక్కుని అక్కడనించి వెళ్ళబోయింది.

''నాకు జవాబు కావాలి''

''మీ గురించి కాదు, ఏవో కాలేజీడేస్ గుర్తొచ్చి...''

''కాలేజీడేస్ గుర్తు రావడం అంటే, అప్పట్లో వుండే ఎవరైనా బోయ్ ఫ్రెండు గుర్తొచ్చేడా?'' అంటూ వెకిలిగా నవ్వేడు చంద్రమౌళి.

అతన్నోసారి చిరాగ్గా చూసి రుక్మిణి చరచర వంటగదిలోకి వెళ్ళిపోయింది.



ఆరోజు తర్వాత రుక్మిణి ఆఫీసునించి యింటికి రావడం లేటే అవుతోంది. ఆ విషయం చంద్రమౌళి గమనించలేదు. ఓరోజు సాయంత్రం ఆరుగంటలకే మౌళి యింటికొచ్చేశాడు. పిల్లలు స్కూలునించి వచ్చేసినా రుక్మిణి యింకా రాలేదు. తల భారంగా వుంది.

వేడివేడి కాఫీ తాగి రుక్మిణి చేత నుదుట అమృతాంజనం రాయించుకుందామనుకున్నాడు. కానీ ఆమె యింకా రాలేదు. అయిదు గంటలకి ఆఫీసు అయిపోతుంది. అయినా యింకా రాలేదేవిటని పిల్లలమీద చిర్రుబుర్రులాడుతుండగా రుక్మిణి వచ్చింది.

ఆమె యింకా హాల్లోకి రాకముందే "ఇంత లేట్ అయిందేం?" అంటూ కసురుకున్నట్టుగా అడిగాడు.

"రోజూ లేట్‌గానే వస్తున్నాను. కాకపోతే యివాళ ట్రాఫిక్ జామ్ అవడంవల్ల బస్సు మరో పావుగంట లేటుగా వచ్చింది" రుక్మిణి తన గదిలోకి వెళ్తూనే జవాబు చెప్పింది. గదిలో తన హేండ్‌బేగ్, కళ్ళద్దాలు పెట్టేసి, కిచెన్‌లోకొచ్చింది. స్టవ్ వెలిగిస్తుంటే, మౌళి అక్కడకొచ్చేడు.

"రోజూ ఎందుకు లేట్ అవుతోంది?"

"నేను మర్రిపాలెం జంక్షన్‌లోనే బస్సు దిగిపోయి, అక్కడనించి నడుచుకొస్తున్నాను"

"ఎందుకలా చేస్తున్నావ్?"

"చెయ్యకేం చెయ్యమంటారు? ఆ జంక్షన్ దాటితే టిక్కెట్ మరో అర్ధరూపాయి పెరుగుతుంది. గోపాలపట్నం జంక్షన్‌వరకూ అదేరేటు. ముందుస్టాప్‌లో దిగిపోవడంవల్ల అర్ధరూపాయి మిగుల్తుంది. అంటే నెలకి పదిహేను రూపాయిలు ఆదా అవుతుంది. ఆఫీసులో కూడా ఒక్కపూటే కాఫీ తాగుతున్నాను. మీరీ నెల నాకు యాభైరూపాయిలు తగ్గించేరుగా! రేపట్నించీ యింకా లేట్ అవుతుంది"

"రేపట్నుంచీ యింకో స్టాప్ ముందు దిగిపోతావా?" వ్యంగ్యంగా అడిగాడు మౌళి.

"దిగిపోయినా అదే ఛార్జి తీసుకుంటారు. రేపట్నించి ఆఫీసులో ఓ నెలరోజులపాటు ఓవర్‌టైమ్ పని చెయ్యాలి. అంటే రాత్రి ఏడువరకూ పనిచెయ్యాలి. యింటికొచ్చేసరికి ఎనిమిదవుతుంది"

కాఫీ కలుపుతూ అతనివైపు చూడకుండానే మాట్లాడుతోందామె.

"మరీ అంత లేట్ అయితే ఎలా? నువ్వు ఓవర్‌టైమ్ చెయ్యనని చెప్పేయ్" ఏదో ఆర్డరు వేస్తున్నట్టుగా చెప్పేడు.

"నాకిష్టం లేకపోతే చెయ్యక్కర్లేదు. కానీ, కావాలని నేనే ఒప్పుకున్నాను. నెలంతా పనిచేస్తే ఓ మూడువందల యాభై అదనంగా వస్తాయి. అందులో మీరో రెండువందలు లాక్కున్నా నాకు నూటయాభై అయినా దక్కుతాయన్న కక్కుర్తితో ఒప్పుకున్నాను" ఆమె గొంతులో ధ్వనిస్తున్న ఆత్మనిందకంటే, ఎత్తిపొడుపే ఎక్కువగా వుంది.

చంద్రమౌళి యింకా టాపిక్‌ని కొనసాగనివ్వకుండా ఆమె యిచ్చిన కాఫీ పట్టుకుని తన గదిలోకి వెళ్ళిపోయేడు. ఇప్పుడు జరిగిన వాదనలో **రుక్మిణి** పడుతున్న బాధని ఆయన పట్టించుకోలేదు. ఈ నెల మరో రెండువందలు అదనంగా వస్తుంది. ఆఫీసునించి ఎంత లేటుగా వచ్చినా వంటచేసే డ్యూటీ రుక్మిణిదే కాబట్టి, యిలాంటి ఓవర్‌టైమ్ ప్రతినెలా వుంటే బావుణ్ణనుకున్నాడు.

★ ★ ★

మర్నాడు డ్యూటీకి వెళ్తూ చంద్రమౌళి బాలన్ ఇంటిముందు మోటార్‌సైకిల్ ఆపి హారన్ మోగించాడు. బాలన్ తెలుగుదేశంలో స్థిరపడ్డ తమిళుడు. ఎల్.ఐ.సి. ఏజెంటుగా పనిచేస్తున్నాడు. తన సైకిల్ పోయిందని రెండు సంవత్సరాలకిందట కంప్లయింట్ యిచ్చేడు. ఏడాదిన్నరపాటు పోలీస్‌స్టేషన్ చుట్టూ తిరిగినా, అతీగతీ లేకపోయేసరికి సైకిల్ మీద ఆశ వదులుకున్నాడు. నిన్ననే ఆ సైకిల్ దొరికింది. వీధిలోని మనిషికదాని, వెళ్తూవెళ్తూ ఆ విషయం చెప్పడానికి ఆగేడు. రెండుమూడుసార్లు హార్న్ కొట్టేక బాలన్ బయటికొచ్చి యూనీఫాంలోవున్న చంద్రమౌళిని చూసి కంగారుపడ్డాడు.

"నిన్ను పిలవడానికి యిన్నిసార్లు హారన్ కొట్టాలా?" పోలీస్ ఫోర్స్ ప్రదర్శిస్తూ అడిగాడు.

"సారీసర్! హార్న్ మోగుతుంటే వీధిలో మోగుతుందని తలుస్తానుగాని, ఓ పోలీస్ ఆఫీసరు నా యింటిముందుకొచ్చి హార్న్ కొడతారని నేనెందుకు తలుస్తాను సార్! అందుకే వంటగదిలోనించి రాలేదు" అన్నాడు బాలన్ వినయంగా.




''వంటగదిలో ఏం చేస్తున్నావ్?''

''వంటగదిలో ఏంచేస్తారు సార్? వంటచేస్తారు''

''నువ్వు వంట చేస్తున్నావా? మీ ఆవిడేం చేస్తోంది?''

''పడుకుంది సార్''

''మీ ఆవిణ్ణి పడుకోబెట్టి నువ్వు వంట చేస్తున్నావా? సిగ్గులేదూ?''

''సిగ్గెందుకు సార్? మా ఆవిడకి జ్వరం సార్''

''అయితేమాత్రం?''

''అదేమిటిసార్! ఎప్పుడూ ఆవిడే వంట చేస్తుంది. నేను తింటుంటాను కానీ యిప్పుడా విడకి జ్వరం వచ్చినప్పుడు, నాకు వంట చెయ్యడం వచ్చినప్పుడు, నేనెందుకు చెయ్యకూడదు సార్? వంటేకాదుసార్! ఆవిడకి తడి గుడ్డతో ఒళ్ళంతా శుభ్రంచేసి, మందులు వేసేది కూడా నేనే సార్! నాకు ఒంట్లో బాగులేనప్పుడు ఆవిడ రాత్రింబవళ్ళు సపర్యలు చేసినప్పుడు, నేనెందుకు చెయ్యకూడదు సార్? మాటవరసకి ఈ మోటార్ సైకిల్ మీకు రోజూ ఉపయోగపడుతోంది. కానీ దీనికి రిపేర్ వచ్చినప్పుడు దీన్ని బాగుచేయిస్తున్నారా? లేదా? ఓ బండిమీదే మీరంత శ్రద్ధ చూపించినప్పుడు భార్యమీద చూపిస్తే తప్పా సార్?''

బాలన్ అడుగుతున్న ప్రశ్నలన్నింటికీ చంద్రమౌళి తన మనసులో చెప్పుకున్న సమాధానం ఒక్కటే! వీడో ఆడంగి వెధవ!

''యింతకీ తమరెందుకు దయచేసినట్టు సార్.'' అన్నాడు బాలన్ టాపిక్ మారుస్తూ.

''నీ సైకిల్ దొరికింది. స్టేషన్‌కొచ్చి తీసుకెళ్ళు'' అంటూ మౌళి మోటార్‌సైకిల్ స్టార్ట్‌చేసుకుని వెళ్ళిపోయేడు.

★ ★ ★

ప్రభాకర్‌కి ఇంకా పెళ్ళికాలేదు. అంటే, అతను బ్రహ్మచారనికాదు. కేవలం అవివాహితుడు మాత్రమే! అందంగా, ఆకర్షణీయంగా కనిపిస్తూ, ఓ కంపెనీలో స్టెనోగ్రాఫర్ వుద్యోగం చేస్తున్న ప్రభాకర్‌కి తమ కూతుర్నిచ్చి పెళ్ళిచేస్తే బావుణ్ణని కొంతమంది ఆడపిల్లల తండ్రులు కాస్త వుత్సాహం చూపించేరు. కానీ, ప్రభాకర్ తండ్రి మట్టయ్య వారిపట్ల ఆసక్తి కనబరచలేదు. అందుక్కారణం అవతలవాళ్ళు పెద్దగా ఆస్తిపరులు కాకపోవడమే!

మట్టయ్య తనకితానుగా నాలుగైదు సంబంధాలమీద కన్నువేశాడు. కానీ అవతలవాళ్ళు యితన్ని కన్నెత్తి చూడలేదు. అందుక్కారణం మట్టయ్య మనస్తత్వం మంచిది కాకపోవడమే! ఇంటిని చూసి యిల్లాల్ని చూడాలని కొంతమంది అంటారు. ''అబ్బెబ్బే, అదేం అక్కర్లేదండి. ఇల్లాల్ని చూస్తే ఆ యింటి పరిస్థితిని అంచనా వేసెయ్యొచ్చ''ని మరికొంతమంది చెప్తుంటారు. మట్టయ్య యింటి పరిస్థితి విషయంలో రెండవదే కరెక్టవుతుంది. ఆ యింట్లో మట్టయ్య భార్య అన్నపూర్ణ పరిస్థితి ఏవిటో ఒకసారి చూసేక, ఏ ఆడపిల్ల తండ్రీ తన కూతుర్ని ఆ యింటికి కోడలిగా పంపించడు.

మట్టయ్య వృత్త అనుమానం మనిషి. విశాఖపట్నం కార్పొరేషన్‌గా మారకుండా, యింకా మున్సిపాల్టీగానే బతుకుతున్నప్పుడు, అతను కౌన్సిలర్‌గిరీ వెలగబెట్టేడు. అప్పుడు గూడా మున్సిపాల్టీని ఎంతవరకూ తినెయ్యొచ్చనే ఆలోచించేడుతప్ప, ఆ పని చేస్కోడంలో ఏ ఒక్కర్నీ నమ్మలేదు. అతని భార్య అన్నపూర్ణకి గడుసుతనం లేదు. ఆ ఇంట్లో తిరిగే కోళ్ళు, కుక్కలు, గోడమీదనుండే బల్లులు, మంచానికి పట్టేసిన నల్లులు, ఫామిలీ మెంబర్సులా చనువుగా తిరిగేసే బొద్దింకలయినా అప్పుడప్పుడు బయటకొచ్చి వీధిముఖం చూస్తాయిగాని, ఆ యింటి యిల్లాలు అన్నపూర్ణమాత్రం వీధి ముఖం చూడదు.

ఓసారెప్పుడో ఆ వీధిలోవాళ్ళు అన్నపూర్ణని పేరంటానికి పిలుస్తూ, ''ఏంటి వదినగారూ! సమాధిలో కూర్చున్న బాలయోగి అయినా సంవత్సరానికోసారి బైటకొచ్చి ప్రజల ముఖం చూస్తాడుగాని, మీరు ఏనాడూ వీధిలోకి రావడం మేం చూళ్ళేదు. ఎంచేతంటారు? మేవంతా దుష్టులమనా?'' అన్నారు నవ్వుతూ.

అన్నపూర్ణ ఏం సమాధానం చెప్పేదోగాని, గభీమని మట్టయ్యే వచ్చి తనే జవాబు చెప్పేడు.

"మా ఆవిడ అసలు వీధిలోకి ఎందుకు రావాలమ్మా?"

"వస్తే తప్పేం వుందండి?" ఒకామె అడిగింది.

"తప్పా, ఒప్పా అని కాదమ్మా, ఎందుకు రావాలీ అని అడుగుతున్నాను. మార్కెట్‌నించి సామాన్లూగట్రా తేడానికి యింట్లో పనిపిల్లని పెట్టేను. మిగతా ఎవ్వారాలు చూస్కోడానికి జెండాకొయ్యంత మనిషిని నేనున్నాను. రేసుగుర్రంలాంటి మనిషి మా అబ్బాయి వున్నాడు. యింక, మా ఆవిడ ఎందుకు వీధిలోకొచ్చి మీ యిళ్ళచుట్టూ తిరగాలీ అని అడుగుతున్నాను"

"మా ఇళ్ళచుట్టూ తిరగమని మేం అనడంలేదండి. ఓ సినిమాకైనా ఎప్పుడూ వెళ్ళడం చూళ్లేదుకదాని..."

"మునుపంటే సినిమాహాలుకెళ్తేనే సినిమా కనిపించేది. యిప్పుడు టీ.వీ.లొచ్చేశాయికదమ్మా! యింట్లో టీవీ వుంది. శనివారంనాడు ఓ హిందీ సినిమా **వేస్తున్నారు.** ఆదివారంనాడు తెలుగుసినిమా **వేస్తున్నారు.** కాణీ ఖర్చు లేకుండా, చేటలో బియ్యం ఏరుకుంటూనో కూరగాయలు తరుక్కుంటూనో, లేకపోతే నా కాళ్ళు నొక్కుతూనో ఆ సినిమాలు చూడొచ్చుగదా! నెలకి రెండు సినిమాలు చాలవా? నేను అడుగుతున్నది సంసారపక్షమైన ఆడవాళ్ళ మాటనుమండీ!"

ఆడాళ్ళందరికీ మట్టయ్య మాటలు చిరాకు కలిగించాయి. వాళ్ళంతా నెలకి నాలుగైదు సినిమాలు చూడ్డంతోపాటు, కేబుల్ టీవీ కూడా పెట్టించుకున్నవాళ్ళే! అందుచేత మేం సంసారపక్షం ఆడవాళ్ళంకాక వ్యభిచారపక్షం ఆడవాళ్ళమా? అని ప్రశ్నించుకుంటూ, అదే ప్రశ్న ఒకామె అడిగింది.

మరొకామె, "వూరికే తిని తొంగుంటే మనిషికీ గొడ్డుకీ తేడా ఏం వుంటాదని ఒక సినిమాలో చెప్పనే చెప్పేరు. మనిషన్నాక ఓ సరదా, సంతోషం వుండాలిగదండి" అంది.

"మా ఆయనగారు ఎక్కడ ఏ ఫంక్షన్‌కెళ్ళినా, సినిమాకెళ్ళినా నన్ను తీస్కునే వెళ్తారు" అంటూ ఒకామె.

"మీ ఆయనే కాదండి. ఏ మగాడైనా భార్యని ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడకో ఓచోటకి తీసుకెళ్తాడు" అంటూ మరొకామె అంటుంటే, అందరి మాటలూ తాపీగా విన్నాక "దయచేసి కూర్చోండమ్మా" అంటూ అందర్నీ కూర్చోబెట్టేడు.

"నేనో ముఖ్యమైన విషయం చెప్పాలనుకుంటున్నాను. నిజానికి ఈ మాట మీతోకాదు, మీ మగవాళ్ళతో చెప్పాలనుకోండి. అయినా మీరు కదలేశారుకాబట్టి చెప్పకుండా వుండలేకపోతున్నాను" అన్నాడు.

"చెప్పండి!"

"మీరంతా స్నానాలు చేసే వచ్చారా?"

ఒకామె ఛర్రుమంటూ లేచి "స్నానం చెయ్యకుండా పేరంటానికి పిలవడానికొస్తారా?" అంది.

"కోప్పడకండమ్మా, నా పాయింటు అదికాదు. మీరు సబ్బుతోనే కదా స్నానం చేశారు?"

"సబ్బుతోకాకపోతే ఇటుకబెడ్డతో ఒళ్ళు రుద్దుకుంటారా?"

"ఏదమ్మా, మీరు ఒళ్ళు తోముకున్న ఆ సబ్బు ఏది? ఓసారి చూపించండి"

"చూపించడానికాసబ్బు యిక్కడెందుకుంటుంది? మా బాత్‌రూమ్‌లో వుంటుంది"

"అయ్యయ్యో! మీ ఒంటినున్న మురికంతా కడిగి, మీకెంతో సువాసన కలిగించిన సబ్బుని బాత్‌రూమ్‌లో ఎందుకు ఒదిలేశారమ్మా?"

"యిది మరీ బాగుందండి. ఒళ్ళు శుభ్రంచేస్తేమాత్రం సబ్బుని ఎక్కడుంచాలో అక్కడే వుంచుతాంగాని, నెత్తిమీదెట్టుకు తిరుగుతామా?"। మట్టయ్య పగలబడి నవ్వేడు. అతనెందుకు నవ్వేడో ఎవరికీ అర్థంకాలేదు.

"చూడండి తల్లుల్లారా. నాదృష్టిలో పెళ్ళాం కూడా మగాడికి పనికొచ్చే సజీవమైన వస్తువులాంటిది. మనం ఒళ్ళు రుద్దుకునే సబ్బుని అవసరమైనప్పుడు వాడుకుంటాం. మళ్ళీ




దాన్ని బాత్‌రూమ్‌లో పెట్టేస్తాం తప్ప, అయ్యో యిది నాకెంతో వుపయోగపడిందే అని నెత్తి మీద పెట్టుకు తిరగం. కాబట్టి, పెళ్ళాం కూడా సబ్బులాంటిదే! ఇప్పుడా చీపురుంది. సబ్బు ఒంటిని శుభ్రంచేసినట్టు, ఆ చీపురు యింటిని శుభ్రంచేస్తుంది. పని అయిపోగానే దాన్నీ మూల పెట్టేస్తాం. మళ్ళీ దాని అవసరం వచ్చినప్పుడే దాని జోలికి వెళ్తాంతప్ప దాన్నే పార్టీజెండాలాగ చేత్తో పట్టుకు తిరగంగదా! పెళ్ళాం కూడా ఆ చీపురుకట్టలాంటిదే!

మీరేదో యింటిపనులు చేసేసి అలిసిపోతున్నాం కాబట్టి మీకూ సరదాలూ సంతోషాలూ వుండాలని చెప్పకండి. ఆడోళ్ళు ఏవేం పనులు చెయ్యాలో, ఏవేం పనులు చెయ్యకూడదో, నేను ఏడోతరగతిలో వున్నప్పుడే, మా లెక్కల మేష్టర్ని అడిగి తెలిసేసుకున్నాను. ఆడది-శయనేషు రంభలాగుండాలి, అంటే పడుకునేటప్పుడు కాస్త పాడ్రూగాట్రా రాసుకున్నా తప్పు లేదూ అని! కార్యేషు దాసీ అన్నాడు, అంటే, యింటిపనులు చేసేటప్పుడు దాసీదాని కంటే ఎక్కువ శ్రమపడి చెయ్యాలీ అని. యింక, కరణేషు మంత్రీ అన్నారుగాని, ఆ మాట నేను చచ్చినా ఒప్పుకోను, ఎంచేతంటే, ఆడదాని సలహా విని బాగుపడ్డ మగోడెవడూ యీ భూప్రపంచికంమీద లేడని నాకు తెల్సు! అన్నింటికంటే ముఖ్యమైంది, క్షమయాధరిత్రీ అనేది, అంటే ఆడదానికి భూదేవంత ఓర్పుండాలి, ఎంచేతంటే మొగుడికి కాస్త కోపం వచ్చి నాలుగు దెబ్బలు కొట్టినప్పుడు, కయ్‌కుయ్‌లాడకుండా ఆ బాధ భరించెయ్యాలే తప్ప, కొరడారాణీలాగ రెచ్చిపోయి మొగుణ్ణి తన్నెయ్యకూడదు. ఇవన్నీ నాకు తెల్సు కాబట్టీ, నేనేం చేసానో తెలుసా? టైలర్‌కి కొలతలిచ్చి నా చొక్కాలు కుట్టించుకున్నట్టు, నా పెళ్ళాం ఏయే లక్షణాల్తో వుండాలో అవన్నీ మా ఆవిడకి చెప్పి, దాన్ని నాకు కావల్సిన విధంగా తయారు చేసుకున్నాను. ఇప్పుడు మీరొచ్చి మాలాగే మీరూ వుండండి అన్నపూర్ణగారూ అని దానికి ప్రైవేట్ క్లాసులు పెట్టకండి...''

అతని మాటలు విని ఆడవాళ్ళంతా లేచి నిలబడ్డారు. అందరూ కలిసి త్ఫూ అంటూ అతని ముఖంమీద వుమ్మలేదు తప్ప, దాదాపుగా ఆ పనే చేస్తున్నట్టుగా మట్టయ్యని చూసి, బయటకి వెళ్ళిపోయేరు. ''మళ్ళీ మీ యింటికెప్పుడైనా వచ్చి పెళ్ళిళ్ళకీ పేరంటాలకీ మీ ఆవిణ్ణి పిలిస్తే మమ్మల్ని చెప్పుచ్చుక్కొట్టండీ'' అంటూ ఒకామె అనేసింది కూడా! అంతే, ఆరోజునించి ఆ యింట్లోకి, ఆ వీధిలో వుండే ఆడవాళ్ళు కాదుగదా, వీధిలో తిరిగే ఆడకుక్క కూడా దూరలేదు. అంతేకాకుండా, ఆ వీధిలోని ఆడవాళ్ళు తమ భర్తలు మట్టయ్యతో స్నేహం చెయ్యకుండా జాగ్రత్తపడ్డారు. ఒకవేళ స్నేహం చేస్తే మట్టయ్యగాడి భావాలు తమ భర్తలకీ వస్తాయని వాళ్ళ భయం!

మట్టయ్య ప్రతిరోజూ గవర్నమెంటు డ్యూటీకి వెళ్ళేవాడిలా తొమ్మిది గంటలకల్లా ఠంచన్గా, ఆ వీధిలో వున్న లక్కీస్టార్ క్లబ్‌కి వెళ్ళిపోతాడు. వుదయంనించి రాత్రి పన్నెండు వరకూ శ్రద్ధగా, దీక్షగా పేకాట ఆడతాడు. మధ్యలో ఓ గంట, యింటికొచ్చి భోంచేసి వెళ్ళడానికి కేటాయిస్తాడు. ఒకరోజు పేకాటకి వెళ్ళేముందు, అన్నపూర్ణని పిలిచేడు, ఆమె వంటగదిలో కనిపించలేదు, పడగ్గదిలో కనిపించలేదు. కంగారుపడి డాబామీదకెళ్ళేడు, అక్కడామె బట్టలు ఆరబెడుతోంది. ఆరోజు ఆమె తలంటుస్నానంచేసి రోజూకంటే కాస్త నీటుగా కనబడుతోంది. అతనిగుండెల్లో అనుమానపు గంట గణగణమని మోగింది. పక్క డాబాలవైపు అనుమానంగా చూశాడు. పక్క డాబామీద, ఓ యిరవైరెండేళ్ళ కుర్రాడు ఒంటిమీద షర్టులేకుండా వ్యాయామం చేస్తూ కనిపించాడు. వెంటనే పిట్టగోడ దగ్గరకెళ్ళి ఆ అబ్బాయిమీద కేకలు వేశాడు.

''ఏరా జులాయ్‌వెధవా, యిక్కడ ఆడవాళ్ళు తిరుగుతుంటే అక్కడ నువ్వు ఒంటిమీద గుడ్డలేకుండా నిలబడి, నీకండలు చూపిస్తూ పోజులు కొడతావా? ఛో... లోపలకి'' అంటూ కసిరేడు.

''అంత ముసల్దానికి ఫోజులుకొట్టే ఖర్మ నాకేంట్రా? నీ కూతురుంటే చూపించు, దానికి ఫోజులిస్తాను'' అంటూ ఆ అబ్బాయి కేర్లెస్‌గా అరిచాడు. మట్టయ్య యీ డాబామీదనించి, ఆ

డాబామీదకి గెంతి ఆ అబ్బాయి దవడ పళ్ళు రాలగొడదామనుకున్నాడుగాని, కండలు తిరిగిన అతని శరీరం, చేతిలో రుబ్బురాయి పొత్రాల్లా కనిపిస్తున్న డంబెల్స్ చూసి, ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

"ఆ అబ్బాయి నాకు కొడుకులాంటివాడు. అతన్తో అనుమానం కడతారేంటండీ" అంది అన్నపూర్ణ కాస్త బాధగా.

"నోరుముయ్... సారంగధరుడు కూడా చిత్రాంగికి కొడుకులాంటివాడే అవుతాడు. అయినా సరే, అతగాడికి లైన్ వెయ్యలేదా?"

"ఛిఛి... నన్ను చిత్రాంగితో పోలుస్తారేవిటండి?" అంది చిరాగ్గా.

"తొండ ముదిరితే వూసరవిల్లి అవుద్ది. చిత్రాంగికి సీనియార్టీ వస్తే చింతామణి అవుద్ది. అయితే నిన్ను చింతామణితో పోల్చాలంటావా?" అంటూ పెద్ద గొంతుపెట్టి అరుస్తుంటే అన్నపూర్ణ సిగ్గుతో చచ్చిపోయింది. డాబామీద అబ్బాయి యీ మాటల్ని చాలా ఆసక్తిగా వింటున్నాడు.

"నేనేమిటి? నా వయసేవిటి? యిప్పుడు నా మీద అనుమానాలేవిటండీ" అని అడిగినందుకు రెండు చెంపదెబ్బలు బహుమానంగా ఒందింది. ఆరోజునించి మట్టయ్య యింట్లో వున్నప్పుడు డాబామీదకి రావడం మానేసింది.

కొన్ని యిళ్ళని దెయ్యాల కొంపలు అంటుంటారు. ఆ యిళ్ళ గురించి బోలెడంత ప్రచారమూ జరుగుతుంది. ఆ కొంపలో వుండే దెయ్యాలకి జడిసి జనం ఆ యింటి పరిసరాలకి రావడం మానేస్తారు. మట్టయ్య యింటి గురించి కూడా దాదాపు అలాంటి ప్రచారమే జరిగింది. అయితే ఆ యింట్లో బతికున్న దెయ్యాలున్నాయని, ఆ దెయ్యాలరాజు మట్టయ్యేనని ఆ వీధిలో అందరకీ తెలుసు. అటువంటి దెయ్యాల కొంపకి తన కూతుర్ని కోడలిగా పంపడానికి ఏ ఆడపిల్లతండ్రీ ఒప్పుకోలేదు. పెళ్ళి విషయంలో ఆడపిల్లతండ్రి పెళ్ళికొడుకు మంచి చెడ్డల గురించే కాదు, అత్తమామల ప్రవర్తన గురించి కూడా ఆలోచిస్తాడు. వాళ్ళు రాక్షసంగా ప్రవర్తిస్తారని తెలిసినప్పుడు, వాళ్ళని ఎదిరించి వాళ్ళబ్బాయి తన భార్యకి రక్షణ కల్పించగలడనే నమ్మకం లేనప్పుడు, ఆ యింటితో సంబంధం కలుపుకోడానికి ఏ ఆడపిల్లవాళ్ళూ సిద్ధపడరు. ప్రభాకర్‌ని చూసి, మట్టయ్య గురించి విని, ఓ పొరుగూరు సంబంధం వాళ్ళు "పెళ్ళికి మేం ఒప్పుకుంటాం. కానీ పెళ్ళవగానే అబ్బాయి వేరుటి కాపురం పెట్టాలని" షరతు పెడితే మట్టయ్య ఒప్పుకోకపోగా వాళ్ళని కొట్టినంత పనిచేశాడు. ప్రభాకర్ గూడా తండ్రినే సమర్థించేసరికి వాళ్ళకి విషయమంతా అర్థమైపోయింది. మట్టయ్యకి జేబులో సిగరెట్ పేకెట్, అగ్గిపెట్టిలతో పాటు ప్రభాకర్ కూడా వున్నాడని, సినిమాలో భాషరానివాడికి, వచ్చిన వాడు డబ్బింగ్ చెప్పినట్టు, ప్రభాకర్ నోటిలోనించి వినబడుతున్నది మట్టయ్య మాటలే తప్ప, ప్రభాకర్‌వి కాదూ అని అర్థంచేసుకున్నాక, ఆ యింటికో దండం పెట్టేసి వెళ్ళిపోయేరు. వేరుటి కాపురం పెట్టమని అడిగే బదులు ఓ కోటీశ్వరుడు యిల్లరికం అడిగుంటే, వెనకా ముందూ చూడకుండా తన కొడుకుని పంపించెయ్యడానికి మట్టయ్య సిద్ధంగానే వున్నాడు. అలాంటి గొప్పింటివాడెవడూ ఆమాట అడగలేదు. కనీసం అలా అడిగినట్టు ఓ కల కూడా ఏనాడూ రాలేదు.

వున్నంతలో మంచి డబ్బున్న సంబంధాలుంటే తీసుకురమ్మని పెళ్ళిళ్ళ బ్రోకర్లకి చెప్పేడు. కమీషను ఘనంగానే యిస్తామని ఆశ చూపించేడు. యీ వూళ్ళోని సంబంధాలయితే మట్టయ్య చరిత్ర సులభంగా తెలిసిపోతుందని బయట వూరి సంబంధాలు తేవడానికి ఆ పెళ్ళిళ్ళ బ్రోకర్లు ప్రయత్నిస్తున్నారుగాని, అవి యింకా ప్రయత్నాలుగానే వున్నాయి. ఈలోగా ఖాళీ వున్నప్పుడల్లా తండ్రీ కొడుకులిద్దరూ కాగితాలు, కలాలు తీస్కుని లెక్కలు వేయనారంభించారు.

"ఒకేసారి రెండు లక్షల కట్నం తీసుకొస్తే లాభమా? లేక నెలానెలా జీతం తెచ్చే కోడలయితే లాభమా? జీతం తెచ్చే అమ్మాయి అయితే వుద్యోగం చెయ్యడానికి బయటకెళ్ళి నలుగుర్లోనూ తిరగాలి. అలా తిరిగే ఆడదాన్ని నమ్మలేం" అన్నాడు మట్టయ్య ఓరోజు.




''ఎంచేతనమ్మలేం?''

''వీర్రాజు అని నాకు తెల్సిన స్నేహితుడొక డున్నాళ్ళే. వాడు తన కొడుక్కి వుద్యోగం చేసే అమ్మాయినిచ్చి పెళ్ళిచేశాడు. అంతే... ఓ ఏడాది తర్వాత మొగుడికి విడాకులిచ్చేసి అదే ఆఫీసులో పనిచేసే మరొకణ్ణి ఎళ్ళాడింది. అదీ నా భయం''

ప్రభాకర్ పకపకమని నవ్వేడు. ''అయితే నేనూ ఓ వుదాహరణ చెప్తాను విను. మా ఫ్రెండుకి ఓ ఫ్రెండున్నాడు. పెళ్ళాన్ని గూటిలో గువ్వపిట్టని దాచినట్టు దాచేడు. వీధిముఖం కూడా చూడకుండా కట్టుదిట్టంచేశాడు. కానీ రెండేళ్ళు గడవకముందే ఆ యింటి బట్టలు తికే చాకలాడితో లేచిపోయింది. దాని సంగతే టంటావ్? అంచేత రౌతుని బట్టే గుర్రం, మొగుణ్ణి బట్టే పెళ్ళామూ నడుస్తుంది. నన్ను అడిగితే జీతం తెచ్చే అమ్మాయి అయితే బెటరుగా వుంటుంది. నెలనెలా ఎంతో కొంతవస్తే రెండు జీతాల్తో హాయిగా బతకొచ్చుగదా''

మట్టయ్య ఆ అభిప్రాయంతో ఏకీభవించలేదు. ''ఒకేసారి రెండు లక్షలు తెచ్చే అమ్మాయిని చేసుకుంటే, ఆ రెండు లక్షల్తో నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్ కొనేస్కోవచ్చు. ఆ రెండు లక్షలు అయిదు సంవత్సరాలకి నాలుగు లక్షలవుతుంది. పదేళ్ళకి ఎనిమిది లక్షలవుతుంది. పదిహేనేళ్ళకి పదహారు లక్షలవుతుంది. యిరవై ఏళ్ళకి ముప్పై రెండు లక్షలవుతుంది 'కదా. ముప్పై రెండు లక్షలంటే మాటలూ మజాకా కాదు. దాంతో వ్యాపారం చెయ్యొచ్చు సినిమా తియ్యొచ్చు. ఓట్లు కొనేసి ఎమ్మెల్యే అయిపోవచ్చు. మినిస్ట్రీ కొనొచ్చు'' అంటూ కాగితంమీద లెక్కలు వేసి చూపించాడు.

ప్రభాకర్ ఒప్పుకోలేదు, ''ఎప్పుడో యిరవైఏళ్ళ తర్వాత ముప్పై రెండు లక్షలయే మాట నిజమేగాని, అంతవరకూ మనం యిదే బ్రతుకు బతకాలి. నా ఒక్కడి జీతంతోనే బతకాలి. పైగా యిప్పుడు నా వయసు యిరవై ఎనిమిది. యివరయ్యేళ్ళ తర్వాత, అంటే అప్పటికి నాకు నలభైఎనిమిది వచ్చేస్తుంది. ఇప్పుడున్న వాతావరణంబట్టి అప్పటి విషయం ఆలోచించు, ఆ వయసులో నాకు తింటే అరగదు. మందు తాగితే యిమడదు. రాత్రిపూట చపాతీ తినమంటారు డాక్టర్లు. బీ.పీ. వస్తే వుప్పులేని చప్పిడి కూడు తినమంటారు. షుగర్ వస్తే స్వీట్లు, అయిసుక్రీములు తినొద్దంటారు. అలాంటి స్థితిలో లక్షలు వుండి ఏం ప్రయోజనం? ఆ బదులు, శుభ్రంగా, తినీ, తాగగలిగేవయసులో రెండు జీతాలు అందితే చాలా బెటరని నా అభిప్రాయం! ఆలోచించు నాన్నా''

కొడుకు కేలుక్లేషన్ అప్పటికీ మట్టయ్యకి నచ్చలేదు. యింకా యిరవై ఏళ్ళ తర్వాత ముప్పైరెండులక్షల మాటమీదే నిలబడ్డాడు. చివరకి ప్రభాకరానికి చిరాకొచ్చి అనేశాడు గవర్నమెంటు అయిదేళ్ళ పథకాలు పెట్టినట్టు నువ్వు యిరవై ఏళ్ళ పొదుపు పథకం పెట్టినా, నీమాట కాదనలేక నేను ఒప్పుకున్నా యిరవై ఏళ్ళ తర్వాత నువ్వు బతికుంటావన్న గ్యారంటీ ఏవిటి? యిప్పుడు, నీ వయసు యాభైఅయిదు. మరో యిరవై ఏళ్ళు బతుకుతావనే నమ్మకం నీకుందా? పోనీ, పాపీ చిరాయువు అన్నట్టుగా నువ్వు బతికేవే అనుకో! అప్పుడు నువ్వు గాంధీగారి శిష్యుళ్ళా మేకపాలు తాగడానికి పనికొస్తావుగాని మెక్డోవెల్స్ బ్రాందీ తాగడానికి పనికిరావు. పనీ పాటాలేకుండా, మందూ సిందూ తాగకుండా, ప్రశాంతంగా పేకాట ఆడుకుని బతికెయ్యొచ్చంటావా? నేనొప్పుకోను. యిరవై ఏళ్ళపాటు చెరువు దగ్గర కొంగలా కాపలా కాచి, ఆ డబ్బు కాస్తా నువ్వు పేకాటలో తగలేస్తే నేనూరుకోను. ఒకవేళ నేనూరుకున్నా అప్పటికి నా పిల్లలు పెరిగి పెద్దవాళ్ళవుతారు కాబట్టి, వాళ్ళూరు కుంటారా?''

ఇలా తండ్రీకొడుకులు తర్జన భర్జనలు చేసుకున్నాక, వుద్యోగం చేసే అమ్మాయి అయితేనే నయంగా వుంటుందనే నిర్ణయానికొచ్చేశారు. అలాంటి అమ్మాయినే చూడమని పెళ్ళిళ్ళ బ్రోకరుకి చెప్పేరు. కానీ, అతను ఆ మాటలు విని పకపకమంటూ నవ్వేశాడు. ''మీ ఆలోచన బాగానే వుందండీ. కానీ, వుద్యోగం చేసే అమ్మాయి మీ వాడికి దొరకొద్దూ. మీరు పోయాకైతే, ఎవరైనా తెగించి, అమ్మాయినిచ్చి పెళ్ళి చేస్తారేమోగాని, మీరు బ్రతికుండగా మాత్రం అది జరిగే పనికాదు''

పెళ్ళిళ్ళ బ్రోకరుని గొడుగు కర్రతో కుక్కని కొట్టి తగిలేసినట్టు తగిలేశాడు. మనిషిని దూరంగా తరిమేసినా, అతను వెల్లడించిన నిజాన్ని మాత్రం దూరంగా తగిలేయలేకపోయేరు. ఓ గంట గడిచాక మట్టయ్యే అన్నాడు, "నీకు నా పోలికలు రాలేదు కాబట్టి, నీ ఫేసు, పెర్సనాల్టీ బాగానే వున్నాయి. ఎవరైనా వుద్యోగంచేసే అమ్మాయిని మెల్లగా లైన్లో పెట్టి, పెళ్ళిదాకా ఈడ్చుకురావడం ఒకటే మార్గం"

తండ్రి మాట కాదనలేని తనయుడు "జో అజ్ఞ పితాశ్రీ" అనేసి ఆరోజునించి ప్రేమించడానికో వుద్యోగస్థురాలు కావాలంటూ ఆమెను వెదకనారంభించాడు.

★ ★ ★

భానుమూర్తి హైదరాబాద్‌నించి వచ్చేసాడు.

అప్పుడప్పుడు అతని యింట్లోనే తన మిత్రులతో పార్టీకి కుర్చోవడం అతనికి అలవాటే!

సుజాత అతని దూరపు బంధువైన ఒకానొక మావయ్య కూతురు. పెద్ద అందగత్తె కాకపోయానా, ఆమె వెనకనున్న కాస్త ఆస్తిని చూసి, ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడా దంపతులకో బిడ్డ. ఫస్ట్‌స్టాండర్టు చదువుతున్నాడు. ఏడాది క్రితం సుజాత తండ్రి మరణించడంతో ఆమెకు యీలోకంలో భర్త, కొడుకూ తప్ప మరెవరూ లేకుండా పోయేరు. పెళ్ళయ్యేక ఆమె ప్రైవేటుగా చదువుతానంది. అక్కర్లేదని ఆమె అభిప్రాయాన్ని కొట్టిపారేశాడు. పురాణాల్లోని చాలామంది దుర్మార్గులకి పతివ్రతల వైపు పెళ్ళాలే దొరికేరు. భర్త చేసే దుర్మార్గాల్ని అప్పుడప్పుడు ఆపుచెయ్యాలని ప్రయత్నించడం, అలా చేసినప్పుడల్లా భర్తల చేత లెంపకాయలు తినడం తప్ప, వాళ్ళు మరో ప్రయోజనమేదీ సాధించలేదు. సాధించనందుకు లోలోపల బాధ పడ్డారే తప్ప, భర్తల్ని మరొకరి దగ్గర తిట్టలేదు. ఆ భర్తలకి విడాకుల నోటీసులు పంపించి, మరో పెళ్ళికి ఏర్పాటు చేస్కోలేదు. ఈ ఒక్క గొప్పతనమే కాదు, నోబుల్ ప్రైజుయివ్వదగ్గ మరో గొప్పతనం కూడా వాళ్ళలో వుంది. అదేవిటంటే, సదరు దుర్మార్గులైన రాక్షసుల్ని ఏదేవుడో దిగొచ్చి, వాళ్ల చీటీలు చింపేయబోయినప్పుడు, యీ పతివ్రతల వైపు లేడీసు, యింట్లో కూర్చుని ఏ టీ.వీ. సీరియల్లో చూస్తూ గడిపేయకుండా తమ ఆరాధ్యదైవమయిన ఏ అమ్మగారి విగ్రహంముందో కూర్చుని, ఆమె హృదయం కరిగిపోయేలా ఓ భక్తి పాటపాడి, ఆవిణ్ణి ప్రత్యక్షంచేయించుకుని, మా ఆయన చీటీని మీ ఆయన చింపేయకుండా ఏ తాయెత్తో, విభూదో ప్రసాదించు తల్లీ అని వరం కోరుకునేవాళ్ళు. అమ్మవారు పెళ్ళాంగారికిచ్చిన తాయెత్తు కట్టుకుని, ఆ దుర్మార్గులు సిక్స్‌టీన్ యమ్.యమ్.లో వున్న తమ రాక్షసత్వాన్ని సెవెంటీ యమ్.యమ్. లెవెల్‌కి పెంచేసుకున్నారు.

ఇలాంటి కథల్ని భానుమూర్తి చదవడమే కాకుండా సుజాత చేత చదివించేడు. భార్యంటే, సంతకం చేసేసిన బేంక్ చెక్కులా వుండాలి. భార్యంటే, నేపాళ మాంత్రికుడి దగ్గర కాపాలి శిష్యుడిలా వుండాలి. అంటూ భార్య ఎలా వుండాలో, ఎలా వుండకూడదో చెప్పేడు. మెడలు వంచేశాడు. పెళ్లైన మొదట్లో సుజాత కొన్ని విషయాలకి ఒప్పుకోకుండా, తల ఎత్తి జవాబు చెప్పబోయింది. అందువల్ల ఆమె ఆ యింట్లో స్థానం పోగొట్టుకుని, వీధినపడాల్సిన పరిస్థితి ఏర్పడబోయింది. తనకంటూ యిప్పుడీ ప్రపంచంలో ఎవరూ లేరు. తనతోపాటు కొడుకుని కూడా పంపించేస్తానని బెదిరించాడు భానుమూర్తి. అదే ఆమెను ఆలోచింపజేసింది. తను ఒక్కతే అయితే యీ లోకంనించి దాటిపోడానికి ఏ అడ్డూ వుండదు. కానీ, తనతో పాటు, పసిబిడ్డకూడా వుంటే? వాడిని యీ లోకంలో అనాథగా వదిలేయలేదు! అలాగని తనతోపాటు వాడిని చంపనూలేదు. కాబట్టి- భానుమూర్తి చెప్పినట్టే తను నడుచుకుంటే మంచిదనే నిర్ణయాని కొచ్చి, ఆ రోజునించి ఆమె యంత్రంగా మారిపోయింది.

ఇప్పుడు భానుమూర్తి ఇంట్లో కాలక్షేపానికి కలర్ టీ.వి. వుంది. నీటిని, పదార్థాల్ని చల్లగా వుంచడానికి ఫ్రిజ్ వుంది. భానుమూర్తి సుఖంగా జీవించడానికి చాలా వస్తువులున్నట్టే అతనికివండీ, వార్చడానికి, బయట ఎవరూ అమ్మాయిలు దొరకనప్పుడు అతని ఒంట్లోని వేడిని చల్లార్చడానికి సుజాత అనబడే ఓ భార్య వుంది.




భానుమూర్తి ఇంటికి ఆరోజు ఆరుగురు మిత్రులు వచ్చేరు. అందులో చంద్రమౌళి, ప్రభాకర్‌లు కూడా వున్నారు. ఆరోజు ఉదయంనించి సుజాతకి జ్వరంగానే వుంది. మధ్యాహ్నం భోజనం కూడా చెయ్యలేదు. తనకి ఒంట్లో బాగులేదన్న విషయం భానుమూర్తికి చెప్పలేదు. చెప్పినా ప్రయోజనంలేదని ఆమెకు తెల్సుకాబట్టే చెప్పలేదు. మిత్రుల్ని తీసుకొచ్చేసరికి రాత్రి తొమ్మిది దాటింది. అంతకో పావుగంటముందే పనిమనిషి నీలవేణి ఇంటికి వెళ్లిపోయింది. అందరూ హాల్లో కూర్చున్నారు.

"**నీలవేణీ**! ఏడు గ్లాసులూ, ఐస్‌వాటర్ పట్రా" అంటూ కేకవేశాడు. నీలవేణి రాలేదు. భానుమూర్తి బీరువాలోనించి ఓ ఫుల్‌బోటిల్ విస్కీతీసి టీపాయ్‌మీద పెట్టేడు.

"మా పనిమనిషి ఇంటికి చెక్కేసినట్టుంది" అనుకుంటూ లోపల గదిలోకి వెళ్లబోతుంటే ప్రభాకర్ అన్నాడు.

"రేయ్ బ్రదరూ, వదినగారు జీడిపప్పుపకోడి చేసివుంటే కాస్త పంపించరా, మీ ఇంట్లో జీడిపప్పు పకోడి సూపర్బ్‌గా వుంటుంది"

"చేసివుంటే పంపించడమేట్రా ఇడియట్, ఇప్పుడు చేయిస్తాను "

మరొకాయన నోరుచప్పరిస్తూ "ఇప్పుడు లేట్ అయిపోయిందిగాని లేకపోతే మీ ఇంట్లో వెజిటబుల్ బిర్యానీ కూడా సూపర్బ్‌గానే వుంటుంది" అన్నాడు.

"లేట్ అయితే మాత్రం ఏమైంది! మనకి ఎప్పుడు ఏం కావాలో అవి వండి పెట్టకపోతే, మనకీ పెళ్లాలెందుకండీ బాబూ. అందులోనూ అతిథిదేవుళ్లని సంతృప్తిపరచకపోతే నేనెందుకు? నా స్టేటస్సెందుకు?" అంటూ భానుమూర్తి బెడ్‌రూమ్‌లోకి నడిచాడు. సుజాత పడుకుంది. అతను తలుపుమూసి ఆమె వీపుమీద ఒక్క చరుపు చరిచేసరికి ఆమె లేచికూర్చుంది.

"గొడ్డులా ఆ నిద్రేమిటే? లేలే. మా ఫ్రెండ్సు వచ్చేరు. జీడిపప్పుపకోడి, వెజిటబుల్ బిర్యానీ అర్జంటుగా తయారుచెయ్యాలి క్విక్"

"నాకు ఉదయంనించి జ్వరంగా వుందండి..." మెల్లగా గొణిగింది.

"వుండదామరి, వూరికే తినికూర్చుంటే ఒంట్లో ఎందుకు బాగుంటుంది? అవతలంతా వెయిటింగులో వున్నారు. గబగబా తయారుచెయ్యాలి" అంటూ వెళ్లబోయాడు.

"ఇంట్లో జీడిపప్పు **లేదండీ**. మామూలు పకోడీ చేస్తాను"

అతను ఛర్రుమంటూ వెనక్కి తిరిగి చూశాడు. "పళ్లురాలిపోతాయ్. ప్రభాకర్‌గాడు పర్టిక్యులర్‌గా జీడిపప్పుపకోడి కావాలన్నాడు. అవి తయారుచెయ్యడం నీ డ్యూటీ! ఇంక జీడిపప్పు వుందా, లేదా అన్నది నాకు అనవసరం..."

"అది కాదండి... నీలవేణి కూడా వెళ్లిపోయింది"

"అంటే పనిమనిషి లేదు కాబట్టి, నువ్వేమీ చెయ్యనంటావ్! దాన్ని నీకు సాయంగా పెట్టేనుగాని, అదిలేదన్న సాకుతో నిన్ను పనులు ఎగ్గొట్టమని కాదు. నువ్వేం చేస్తావో నాకు అనవసరం. పావుగంటలో పకోడీ తయారుకావాలి. అరగంటలో బిర్యానీ తయారుకావాలి... దట్సాల్"

భానుమూర్తి వెళ్లిపోయాడు. సుజాత టైము చూసింది. తొమ్మిదిన్నర దాటేసింది. వీధి చివర ఓ కిరాణాదుకాణం రాత్రి పదివరకూ వుంటుందిగాని, ఎవర్ని పంపించి జీడిపప్పు తెప్పించడం? అనుకుంటూనే పకోడీలకి పిండి కలిపేపని ఆరంభించింది. సుజాత, భానుమూర్తి మాట్లాడుతుండగానే వాళ్ల బాబు, మధు ఆ సంభాషణ విన్నాడు. వాడికి అర్థమైంది ఒక్కటే. ఇంట్లో జీడిపప్పులేదు, దాన్ని తేవాలి. వీధి చివర కిరాణాషాపులో సుజాత అప్పుడప్పుడు సామాన్లు కొనడం వాడికి తెలుసు. తల్లిదండ్రుల మధ్య మాటలు జరుగుతుండగానే మధు తన మూడు చక్రాలసైకిల్ తొక్కుకుంటూ బయలుదేరాడు.

షాపులో జీడిపప్పు కొనేసి, పొట్లం పట్టుకుని తిరిగివస్తుండగా, ఎదుట్నించి స్పీడుగా వస్తున్న స్కూటర్ మూడు చక్రాల సైకిల్‌ని డేష్ కొట్టబోయి ఆగింది. స్కూటర్ తగలకపోయినా, మధూ ఆ షాక్‌కి తట్టుకోలేక బేర్‌మంటూ ఏడుపు ఆరంభించేడు. స్కూటర్ వ్యక్తి మధుని

ఎత్తుకున్నా వాడు ఏడుపు ఆపలేదు. అంత ఏడుపులోనూ జీడిపప్పు పొట్లం మాత్రం వదల్లే దు. మధు ఇల్లెక్కడో అడిగి, ఇంటికి తీసుకొచ్చే డు.

"నా అదృష్టం, మీ అదృష్టం బాగుంది, ఇద్దరమూ క్షేమంగా వున్నాం. అయినా, ఇంత రాత్రిపూట రోడ్డుమీదకి పంపించడం ఏవి టండి?" అంటూ మధుని అప్పగించి వెళ్లిపో యాడు. మధూకేం దెబ్బలు తగల్లేదు. భాను మూర్తి కొడుకుని తీసుకుని వంటగదిలో కెళ్లా డు. "వీణ్ణి ఎందుకే పంపించేవ్? రోజురోజుకీ నీకు భయమూ భక్తీపోయి ఒళ్లు కొవ్వెక్కు తోందే" అంటూ సుజాత చెంపలు వాయించే డు.

"వీణ్ణి నేను పంపించలేదండి" అంటున్నా అతను వినిపించుకోలేదు.

"నోరు మూసుకుని పనిచెయ్. నీ బతుక్కి నాకు ఎదురు సమాధానాలు చెప్పడం ఒకటా? నాకు తిక్కరేగి, నిన్ను జుట్టుపట్టుకుని బయట కీడ్చేశానంటే, నువ్వు పిచ్చికుక్కలా వీధులంట తిరగాల్సిందే తప్ప, బ్రోతల్‌హౌస్‌లో చేరడాని క్కూడా పనికిరావని తెల్సుకో"

భానుమూర్తి అరుపులు హాల్లోకి వినిపిస్తు న్నాయి. స్నేహితులముందు సుజాతని అవ మానించడం అతనికి కొత్తకాదు.

భానుమూర్తి హాల్లోకొచ్చి కూర్చుని, "సారీ ఫ్రెండ్స్... ఏదో చిన్న పిడకలవేట" అంటూ తన గ్లాసు అందుకున్నాడు.

"మేమే మీకు సారీ చెప్పాలి మూర్తిగారు" అన్నాడు సూర్యారావనే లాయర్.

"దేనికీ సారీ?"

"మేం లేట్‌అవర్స్‌లో రావడం బట్టే, మీ భార్యాభర్తల మధ్య..."

"నో నో నో... అలాంటి ఫీలింగ్సేం పెట్టుకో కండి. అప్పుడప్పుడు పెళ్ళాంకామాత్రం డోస్ ఇస్తుంటే తప్ప వాళ్ళ పొజిషన్ ఏవిటో వాళ్ళకి అర్థంకాదు. చెప్పులోని మేకు బయటకొచ్చి కాలికి గుచ్చుకుంటే ఏం చేస్తున్నామండి? సు త్తితో ఒక్కదెబ్బవేసి దాన్ని చెప్పులో పాతేస్తు

న్నాం. ఈ పెళ్లాలూ అంతేనండి" భానుమూర్తి చెప్పిన సంజాయిషీని ఏదో జోక్‌లా ఫీలయి ఫక్కుమంటూ నవ్వింది ఇద్దరే. ఒకరు చంద్ర మౌళి! రెండవవారు ప్రభాకర్!



**సిం**ధుజకి ఆరోజు హెర్క్యులస్ టైర్స్ ఫ్యాక్ట రీనుంచి ఓ కవరు వచ్చింది. "మీ గుంటూరు ఎడ్రస్‌నించి రీడైరెక్ట్ అయివచ్చింది" అంటూ ప్యూన్ ఆ కవర్ని అందించాడు.

కవరు విప్పి చూసింది. ఆరునెలల క్రితం టైర్స్ కంపెనీవాళ్లు పేపర్లో స్టెనోగ్రాఫర్స్ పోస్టు లకోసం ఓ ఎడ్వర్‌టైజ్‌మెంటు వేశారు. ఇప్పు డు ఏపాయింట్‌మెంట్ ఆర్డర్సు పంపించారు. పోస్టింగ్ ఈ వూళ్లో వున్న హెడ్డాఫీసులోనే! సింధుజ ముఖంలో మెరుస్తున్న ఆనందాన్ని చూసి ప్యూన్ సందేహంగా అడిగాడు.

"అయితే... మీరిక్కడ ఉద్యోగం మానేసి, ఆ కంపెనీలో కెళ్లిపోతారా?"

"ఇక్కడకంటే అక్కడ నెలకి అయిదువంద లు ఎక్కువొస్తుంది. పైగా, ఫ్యూచర్‌లో అక్కడ ప్రమోషన్లు వచ్చే అవకాశం కూడా ఎక్కువ. అలాంటప్పుడు దాన్ని ఎందుకు వదులుకో వాలి?"

ప్యూన్ సింధుజ చెప్పిన జవాబుని అలాగే అరచేతిలో పెట్టుకెళ్లి భానుమూర్తి చెవిలో పోసే శాడు.

భానుమూర్తిలో కంగారు పుట్టింది. చేతి కందినది నోటికి అందకుండాపోతోంది. సింధుజ ఆఫీసులో ఉద్యోగం మానేస్తే, ఆ తర్వాత తను ట్రై చేసినా ఫలితం వుండదు.




ఏదోవిధంగా ఆపుచెయ్యాలి. అతని దృష్టిలో డబ్బు అనే అయస్కాంతానికి ఆడదనే ఇనప ముక్క అంటుకుపోక తప్పదు.

సింధుజని రూమ్‌లోకి పిలిచాడు. అప్పటికే సింధుజ తన రిజిగ్నేషన్ లెటరు టైపుచేసి రెడీగా వుంచింది. ప్యూన్ వచ్చి కబురు చెప్పగానే ఆ లెటర్‌మీద సంతకంచేసి చేతిలో పెట్టుకుని, స్టెనో నోట్‌బుక్ పట్టుకుని మూర్తి దగ్గరకెళ్లింది.

"కూర్చో... ఏవిటీ... ఉద్యోగం మానేస్తున్నావట"

"ఔనండి"

"ఇక్కడ నీకు లేనిదేవిటి? అక్కడున్నదేవిటి?" సిగరెట్ వెలిగించి పొగవదుల్తూ అడిగాడు. ప్యూన్ కాఫీ రెండు కప్పుల్లో ఇచ్చి బయటకి వెళ్లాడు.

"ఇక్కడికంటే అక్కడ అయిదువందలు ఎక్కువొస్తుందండి. నాలాంటి ఉద్యోగస్తులకి నెలకి అయిదువందలు ఎక్కువ వస్తున్నప్పుడు, ఆశపడ్డంలో తప్పులేదుకదండి"

మూర్తి లేచి నిలబడి అటూ ఇటూ తిరుగుతూ చెప్పసాగాడు..

"తప్పులేదు సింధూ! మొత్తం మానవజాతినే డబ్బు శాసిస్తున్నప్పుడు, జీతం తప్ప మరో ఆధారంలేని నీబోటివాళ్లని, ఓ అయిదు వందల రూపాయలు ఆకర్షించడంలో తప్పేంవుంది? కానీ, ఓ సంవత్సరం తర్వాత నిన్ను ప్రమోట్ చెయ్యడానికి నా యధాశక్తి ప్రయత్నిస్తాను. అప్పుడు నీకు మరో వెయ్యి అదనంగా వస్తుంది. అఫ్‌కోర్స్ ఏడాది తర్వాత నించి వచ్చే వెయ్యికోసం ఈ ఏడాదంతా ఇదే జీతం తీసుకుంటూ ఆరువేలు నేనెందుకు నష్టపోవాలీ అని నువ్వు అడగొచ్చు. కానీ, నీకు ఆ నష్టం రానివ్వను, సరిగదా, ఈ ఏడాది మొత్తంమీద నీకు పద్దెనిమిదివేలు లాభం కలిగే ఏర్పాటుచేస్తాను"

సింధుజకేం అర్థంకాలేదు. "పద్దెనిమిది వేల బెనిఫిట్... ఎలా కలిగిస్తారు?" ఆసక్తిగానే అడిగింది.

మూర్తి ఆమె కుర్చీ దగ్గరకొచ్చి, కుర్చీమీద ఓ చెయ్యివేసి కాస్త ముందుకు ఒంగి-

"నేనెప్పుడైనా బార్‌కెళ్లి మందు తాగితే, బేరర్‌కి ఇరవైకి తక్కువ కాకుండా టిప్ ఇస్తుంటాను. ఆ బేరర్ చేసే డ్యూటీకి బార్ ప్రొప్రయిటర్ జీతం ఇస్తాడని నాకు తెలుసు. టిప్పు ఇవ్వడం కేవలం ఓ కర్టసీయే తప్ప, కస్టమర్‌కది డ్యూటీ కాదనీ తెలుసు. కేవలం ఓ రూపాయి టిప్ ఇచ్చినా, వాడు సంతోషిస్తాడనీ తెల్సు. అయినా ఇరవై, పాతికా ఎందుకిస్తున్నాను? నాకు సర్వీస్ చేసినవాణ్ణి వీలున్నంత ఎక్కువగా సంతోషపెట్టాలన్నది నా ధ్యేయం! నువ్వు నా దగ్గర పనిచేస్తున్నావు. అంటే, నా మనిషివి! నీ సంతోషమే నా సంతోషం! అందుకోసం నేను నీకు నెలకో పదిహేనువందలు ఇవ్వడం తప్పుకాదు. రోజుకి ఎనిమిదిగంటల చొప్పున నువ్వు నెలంతా కష్టపడితే నీకు లభించేది పదిహేనువందలు. కానీ నాకు నువ్వు నెలకి ఒకటి రెండుసార్లు సుఖాన్నివ్వగలిగితే నీకు సుఖమూ దక్కుతుంది. దాంతోపాటు పదిహేనువందలూ దక్కుతాయి..."

సింధుజ మెల్లగా లేచి నిలబడింది.

ఆమెలో ఆవేశం కనబడుతుందేమోనని భానుమూర్తి ఆమె ముఖాన్ని ఆసక్తిగా చూశాడు. అటువంటిదేమీ కనిపించలేదు. ఆలోచనలో పడిందనుకున్నాడు. ఆడదాన్ని ఖరీదుకట్టి లొంగదీసుకోవడంలో తన అనుభవం ఇప్పుడూ ఫలించిందని సంతోషించాడు. కాకపోతే మరో అయిదువందలు ఎక్కువ అడుగుతుందేమో! అడిగినా ఇవ్వొచ్చు.

"నువ్వు ఏవిటాలోచిస్తున్నావో నాకు తెలుసు. డబ్బు విలువ ఏవిటో నాకంటే నీకే బాగా తెలుసు. డబ్బు అవసరం నాకంటే నీకే ఎక్కువుందని నాకు తెలుసు. అయినా నీలాంటి అమ్మాయిలు ఒక్క విషయం గురించి ఆలోచిస్తారు. నువ్వు పెళ్లి కావలసిన అమ్మాయివి. కాబట్టి మన మధ్యనున్న సంబంధం విషయం బయటపడితే, రేపు నీకు పెళ్లి కావడం కష్టం. కాబట్టి నువ్వు అలాంటి భయాలేం పెట్టుకోనక్కర్లేదు. మనకి కావల్సి వచ్చినప్పుడల్లా భీమిలీలో వున్న గెస్ట్‌హౌస్‌కి వెళ్లిపోదాం. అక్కడ నీకు తెలిసినవాళ్లెవరూ వుండరు. ఒకవేళ

అక్కడకి రావడానికి నీ కిష్టం లేకపోతే చెప్పు. మా ఇంటికే వెళ్లిపోదాం. ఇంట్లో మా ఆవిడే మనకన్ని సపర్యలూ చేస్తుంది. మొదట్నించీ మా ఆవిడని అటువంటి కట్టుదిట్టాల్లో వుంచా న్లే! వచ్చే సంవత్సరం నీకు తప్పకుండా ప్రమో షన్ ఇప్పిస్తాన్లే. అదే మరో కొత్త కేండేటుకివ్వా లంటే నేను పాతికవేలు తీసుకుంటాను. కానీ, నువ్వీ ఏడాది అంతా నన్ను సుఖపెడితే, అదే నువ్వు నాకిచ్చే పారితోషికం అనుకుంటాను. ఏం ఒప్పుకున్నట్టేనా? అహ్హహ్హా... ఒప్పుకోకేం చేస్తావులే! పైసా పెట్టుబడి లేకుండా ప్రమోష నూ కొట్టేస్తావు, నెలకి పదిహేనువందలు ఫీజూ కొట్టేస్తావ్...''

'ఛన్'మంటూ వినిపించిన శబ్దానికి ఆఫీసు హాల్లో పనిచేస్తున్న వాళ్లంతా అదిరిపడి మేనే జర్ రూమ్‌వైపు చూశారు.

సింధుజ ఎప్పుడు ఆ రూమ్ తలుపులు తెరిచిందో భానుమూర్తి చూడలేదు. కానీ ఆమె తన కాలిచెప్పుతీసి ముఖంమీద బలంగా కొట్టి అతన్ని బైటికి తన్నడం, అతను హాల్లో కొచ్చిప డ్డం **ఒకేసారి** జరిగాయి.

అనూహ్యమైన ఈ పరిణామానికి అతను చలించిపోయాడు. హాల్లోని అందరూ కంగారు పడుతూ దగ్గరకొచ్చేరు.

''ఎవరూ రాకండి''

సింధుజ వేసిన కేకకి అందరూ ఆగిపోయే రు.

లేచి తన గదిలోకి పారిపోబోతున్న భాను మూర్తిని కాలర్ పట్టుకుని ఆపి, మళ్ళీ చెప్పుతో ఫెడీ ఫెడీమంటూ కొట్టింది. ప్యూన్ వచ్చి ఆపబోయేడు కానీ, ఆమె అతనివైపు చూసిన చూపుకి ఠక్కుమని ఆగిపోయాడు.

''అందరూ వినండి. ఈ బాస్టర్డ్‌గాడు నన్ను నెలకి పదిహేనువందలిచ్చి వుంచుకుంటా డట. దానికి నేను ఒప్పుకుంటే, వచ్చే సంవ త్సరం నాకు ప్రమోషన్ ఇప్పిస్తాడట'' సింధుజ అందరికీ వినిపించేలా బిగ్గరగా అరుస్తోంది.

''షటప్, నేనలా అనలేదు'' మూర్తి కూడా అరిచాడు.

''అబద్ధాలాడితే చంపేస్తాను. డబ్బుకోసం ఉద్యోగానికొచ్చే ఆడది, ఆ డబ్బుకోసం ఏ పనైనా చేస్తుందని నీ నమ్మకం. ప్రమోషన్ కోసం మేం ఆఫీసర్ల మంచాలమీదకి రావడం ఒక్కటే మార్గమైతే, సోప్ ఫ్యాక్టరీలో సెక్షన్ ఆఫీసర్‌గా పనిచేస్తున్న నీ చెల్లెల్ని ఎంత మంది దగ్గరపడుకోబెట్టి ఆ ప్రమోషన్ ఇప్పించేవురా బాస్టర్డ్. మేం ఉద్యోగాల్లో కొ చ్చింది మా అర్హతల్ని నమ్ముకునిగాని, ఆత్మగౌ రవాన్ని అమ్ముకుని కాదురా స్కౌండ్రల్! ఉద్యో గానికొచ్చే ఆడవాళ్లని వ్యక్తిత్వం లేని వ్యభిచా రులుగా భావించే నీలాంటి నీచుల దగ్గర పనిచేయడంకంటే, వీధిలో ముష్టెత్తుకు బతక డమే నయం...'' అంటూ **చేతిలోని** రిజిగ్నేషన్ లెటర్‌ని తీసి అతని ముఖంమీద కొట్టి చరచర వెళ్లిపోయింది.

మూర్తి తన గదిలోకి వెళ్లిపోయి, తలుపులు మూసుకున్నాడు. సాయంత్రం స్టాఫంతా వెళ్లేవ రకూ తలుపులు తీయలేదు. ఎవర్నీ లోపలకి పిలవలేదు. ఫోన్స్ రాకుండా రిసీవర్‌తీసి పక్కన పెట్టేశాడు.

ఆడదాని చేతిలో అవమానం పొందడం తన జీవితంలో ఇదే మొదటిసారి. అది కూడా తన ఆజ్ఞలకి లోబడి పనిచేసే అందరిముందు తనని కడిగేసి, చెప్పుతో కొట్టి... ఛ... అనుకుని సిగరెట్‌మీద సిగరెట్ కాలుస్తూ రాత్రి ఎనిమిది గంటలవరకూ ఆఫీసులోనే వుండిపోయేడు.

ఈ అవమానం ఎవరైనా స్నేహితులకి చె ప్పుకుంటే, వాళ్ళకి అలుసైపోవడం తప్ప మరో ప్రయోజనం వుండదనిపించింది. రాత్రి ఇంటి కెళ్లేక రోజూకంటే ఎక్కువతాగి, ఏదో నెపంపెట్టి సుజాతని చితకబాది సింధుజమీదనున్న కో పాన్నంతా సుజాతమీద తీర్చుకుని నిద్రపో యాడు.

★ ★ ★

సింధుజ ఆఫీసు మధ్యలో వచ్చేయడం అనసూయమ్మకి ఆశ్చర్యం కలిగింది. సింధు జని ''ఏం అప్పుడే వచ్చేసావని'' అడిగిందాని కి, ''ఏంలేదు'' అనే ముక్తసరి సమాధానమే లభించింది. సింధు తన గదిలోకి వెళ్లి తలుపు గడియపెట్టి మంచంమీద వాలింది. సాయంత్రం అయిదుగంటల వేళప్పుడు




మళ్ళీ తలుపు తెరిచింది.

డ్రాయింగ్‌రూమ్‌లో అనసూయ, ఆదినారాయణ ఆమె కోసమే ఎదురుచూస్తున్నట్టుగా కూర్చున్నారు.

"ఉద్యోగం మానేశావట?"

అనసూయ అడిగింది. వాళ్ళకెలా తెలిసిందని సింధుజ ఆశ్చర్యపోలేదు.

"వూఁ" అంది.

"ఆఫీసులో పనిచెయ్యడానికి ఆడది వెళ్ళకే పోవాలి. వెళ్లేక ఆఫీసర్లు ఓ మాటంటే ఓర్చుకోవాలి" అనసూయ నిష్ఠూరంగా అంది.

"వాడేం అన్నాడో తెలుసా?"

"ఏదో అన్నాడటలే..."

"ఏదో అన్నాడట కాదు పిన్నీ, ఏం అన్నాడో తెలుసా! అని అడుగుతున్నాను. నీకు తెలియదు" అంటూ సింధుజ జరిగిన విషయాన్ని క్లుప్తంగా చెప్పింది.

"అలాంటప్పుడు పెద్ద ఆఫీసర్లకి రిపోర్టు చెయ్యాలిగాని, ఏకంగా ఉద్యోగం మానేసి వస్తే ఇల్లెలా గడుస్తుందనుకుంటున్నావ్?" సింధుజ అనసూయ వైపు చూసి శుష్కమందహాసం చేసింది. "నీ బాధంతా నాకు అవమానం జరిగిందని కాదు... ఉద్యోగం పోయిందని. సరే, మీకు నేను ఉద్యోగం మానేశాననే తెలుసుగాని, రేపటినుంచి నేను మరో కొత్త ఉద్యోగంలో జాయినవుతున్నానని తెలియదు. ఇప్పటి కంటే అక్కడ మరో అయిదువందలు ఎక్కువ కూడా వస్తుంది. ఒకవేళ నాకీ ఉద్యోగం రాకపోయినా ఆ భానుమూర్తిగాడి కంపెనీలో పనిచేసే దాన్ని కాదు అంటూ మళ్లీ గదిలోకి వెళ్లి తలుపులు మూసుకుంది.

ఆదినారాయణ ఆ సన్నివేశాన్ని కేవలం ఓ ప్రేక్షకుడిలా చూసి వూరుకున్నాడు తప్ప జరిగిందాన్ని గురించి నా అభిప్రాయం ఇదీ అంటూ ఒక్కముక్క కూడా మాట్లాడలేదు.

అనసూయకిప్పుడు గుర్తున్నది, ఆలోచిస్తున్నదీ ఒక్క విషయం గురించే!

వచ్చే నెలనించి సింధుజకి ఇప్పటికంటే మరో అయిదువందలు ఎక్కువ వస్తుంది.

★ ★ ★

ప్రభాకర్ పనిచేస్తున్నది హెర్క్యులస్ టైర్స్ కంపెనీలోనే! సింధుజ స్టెనోగా జాయినయిందీ ఆ కంపెనీలోనే, ప్రభాకర్ వుంటున్న సెక్షన్‌లోనే.

ప్రభాకర్ తండ్రి మట్టయ్యా, టైర్స్ ఫ్యాక్టరీ ప్రొప్రయిటర్ రఘుపతి స్నేహితులని చెప్పలేంగాని, బాగా పరిచితులే! చిన్నతనంలో ఇద్దరదీ ఒకటే వూరు కావడంతో వున్న కాస్త పరిచయాన్ని వినియోగించుకుంటూ మట్టయ్య తన కొడుక్కి ఉద్యోగం కావాలని అభ్యర్థించాడు. రఘుపతి అనుగ్రహించాడు. ఆ విధంగా ప్రభాకర్ ఆ కంపెనీలో స్టెనోగ్రాఫర్‌గా జాయినై, ఇప్పుడు సీనియర్ స్టెనోగా టేబిల్ మీద బోర్డు పెట్టుకున్నాడు.

సింధుజని సూపర్నెంట్ తీసుకొచ్చి ప్రభాకర్‌కి పరిచయంచేసి వెళ్లిపోయాడు. సింధుజని చూడగానే అతని గుండె లైపుమెషిన్లా టకటక కొట్టుకుంది. ఒకసారి చూస్తే మళ్లీ మళ్లీ చూడాలనిపించే అందం ఆమెది. ఆమె తనకి అసిస్టెంటు! సింధుజకి ఆమె చెయ్యాల్సిన పనులేవిటో చెప్తూ మధ్య మధ్యలో ఆమె పెర్సనల్ వివరాలు కూడా అడిగాడు. ఆమె ముక్తసరిగా జవాబులు చెప్పింది.

శంకర్రావు ప్రభాకర్‌కి స్నేహితుడు! సింధుజ వచ్చిందగ్గర్నించి ప్రభాకర్ కావాలనే ఎక్కువగా మాట్లాడ్డానికి ప్రయత్నించడం, అంతా గమనించేడు. మధ్యాహ్నం రెండున్నర తర్వాత "రారా కాఫీ తాగుదాం" అంటూ ప్రభాకర్‌ని కేంటీన్‌కి తీసుకువెళ్ళాడు.

కేంటీన్లో కాఫీ తాగుతూ, సింధుజ మీద నీ అభిప్రాయం ఏవిటని అడిగాడు శంకర్రావు. సింధుజ అందం గురించి చాలా గొప్పగా చెప్పాడు.

"ఆ విషయం గురించి కాదు, ఆ అమ్మాయి ఎవరో, ఎలాంటి మనిషో నీకు తెలుసా?"

"తెలియదు... నీకు తెలుసా?" ఆసక్తిగా అడిగాడు ప్రభాకర్.

"తెలుసు... నిన్న మీ ఫ్రెండ్ భానుమూర్తిని ఒకమ్మాయి చెప్పుతో కొట్టింది తెలుసా?"

"తెలియదే... వాడు కూడా నాకు ఫోన్‌చేసి

ఆ విషయం చెప్పలేదు''

''అలాంటి విషయాలు ఎవరైనా ఫోనులు చేసి చెప్పుకుంటారా? మీవాడు ఆ అమ్మాయిని ఎక్కడికో రమ్మని, నెలకి పదిహేనువందల చొప్పున ఇస్తానని చెప్తే, అతన్ని చొక్కాపట్టుకుని హాల్లోకి ఈడ్చుకొచ్చి 'మరీ చెప్పుతో అందరి ముందు చావగొట్టేసిందట. మా తమ్ముడు కూడా ఆ ఆఫీసులో పనిచేస్తుండడంవల్ల నాకీ విషయం తెలిసింది''

ప్రభాకర్ ఊపిరి పీల్చడం మానేసి మరీ వింటున్నాడు...

''నువ్వు చూస్తే ఆడవాళ్ల విషయంలో ఎప్పుడూ సీరియస్‌గా ఆలోచించవుగాబట్టి, నీ ఫ్రెండుగా చెప్తున్నాను. సింధుజ ఎలాంటి ఆత్మాభిమానంగల మనిషో ఈ ఒక్క సంఘటనతోనూ అర్థమవుతోందిగదా! అంచేత ఆవిణ్ణి బంతిని చేసి ఆడుకుని, దూరంగా తన్నేయాలని ఆలోచించకుండా, ఆవిడ ప్రేమని పొందడానికి ప్రయత్నించు. మీ నాన్న మనస్తత్వాన్ని అనుసరిస్తూ నువ్వు చెడు భావాలు పెంచుకున్నావు తప్ప, నా ఉద్దేశ్యంలో నువ్వు స్వతహాగా మంచివాడివనే నా నమ్మకం. అంచేత, నువ్వు సింధుజలాంటి అమ్మాయిని పెళ్లిచేసుకుంటే, నీ జీవితంలో నువ్వో మంచి పని చేసినవాడివవుతావు...''

శంకర్రావు చెప్పిన వాఖ్యాల్లో అతను మెంటల్‌గా నోట్ చేసుకున్నవి రెండు విషయాలు.

ఒకటి... సింధుజ విషయంలో తేడాగా ప్రవర్తిస్తే, నలుగుర్లో నిలబెట్టి చెప్పుతో చావగొట్టేస్తుంది.

రెండు... సింధుజని పెళ్లిచేసుకుంటే, ఆ తర్వాత ఆవిడ ప్రవర్తన గురించి మరోవిధంగా ఆలోచించే అవసరమే వుండదు.

కేంటీన్‌నించి వెళ్లేముందు శంకర్రావు మరో మాట చెప్పాడు.

''ఆ భానుమూర్తి నీ ఫ్రెండని తెలిస్తే సింధుజకి నీమీద మంచి అభిప్రాయం కలగదు కాబట్టి, ఆమెతో అతని విషయం ఎప్పుడూ ప్రస్తావించొద్దు. అలాగే, నువ్వు సింధుజ విషయం ఎప్పుడూ ఆ భానుమూర్తి దగ్గర ప్రస్తావించొద్దు'' ప్రభాకర్‌కి ఈ సలహా చాలా బాగా నచ్చింది.

మర్నాడు ప్రభాకర్ తన తండ్రి మట్టయ్యతో సింధుజ విషయం ప్రస్తావించేడు. ''ఆ అమ్మాయి చాలా అందంగా వుంటుంది కాబట్టి ఆ విషయాన్ని నాకు వదిలెయ్. ఆ అమ్మాయి, చెడుగా మాట్లాడిన వాడినెవడినైనాసరే, నిర్భయంగా చెప్పుతో కొడుతుంది కాబట్టి, నీ ఇంటి కోడలిగా రావడానికి నూటికినూరు మార్కులు కొట్టేసిన కేండేటుకిందే లెక్క. ఇది కేవలం నీ పాయింటు. ఇంక మనిద్దరికీ సంబంధించిన పాయింట్ ఏవిటంటే, ఆ అమ్మాయి గుంటూరునించి ఈ వూరు ఈమధ్యనే వచ్చింది కాబట్టి, మన ఫ్యామిలీకుండే బ్యాడ్‌నేమ్ గురించి తెలిసే అవకాశమేలేదు''

మట్టయ్య బీడీ కాలుస్తూ ఆలోచించాడు. రెండు నిమిషాల తర్వాత ''నీ పాయింట్లన్నీ బాగానే వున్నాయి. మరి ఆ పిల్లవల్ల మనకొచ్చే రాబడి ఎంత? ఖర్చెంత? ఆ సంగతులన్నీ కాగితంమీద లెక్కవేసియ్... అప్పుడు ఆలోచిస్తాను'' అన్నాడు. ప్రభాకర్ జేబులోనించి ఓ కాగితంతీసి, అందులో వేసిన లెక్కలు వివరించేడు.

''నేనా లెక్కలూ, డొక్కలూ అన్నీ రాసేవుంచేను. ఇప్పుడా అమ్మాయి వయసు ఇరవైరెండు. యాభైఎనిమిదేళ్లవరకూ ఉద్యోగం చేస్తుంది కాబట్టి, మనం రాగల ముప్పయ్యారు సంవత్సరాలకే లెక్కవేద్దాం. ఇప్పుడొచ్చే జీతం, నెలకి పదిహేనువందలు. క్రమంగా అది పెరుగుతుందే తప్ప తరగదు. కాబట్టి, ఈ పదిహేను వందలతోనే లెక్కవేశాను. ముప్పయ్యారు సంవత్సరాలకీ కలిపి ఆరులక్షల, నలభైఎనిమిదివేలు''

మట్టయ్య మంచంమీదనించి లేచి కూర్చున్నాడు. ఆ ఫిగరు ఎంతా? అని మరోసారి అడిగాడు. ప్రభాకర్ మళ్ళీ చెప్పాడు. విన్నాక,

''ఆదాయం సరే... ఓ మోస్తరుగా వుంది. మరా అమ్మాయికి నెలవారీ ఖర్చులు కూడా ఎంతవుతాయో లెక్కచూసి, నికరంగా మనకి ఎంత లాభమో ఆ సంగతి చెప్పు'' అన్నాడు మట్టయ్య.




"అదీ లెక్కలేసేనుగా, సింధుజకి రోజుకి నాలుగు రూపాయిల చొప్పున ఇచ్చినా నెలకి నూట ఇరవై అవుతుంది. సంవత్సరానికి పధ్నాలుగు వందల నలభై వేశాను. మనం వేసే లెక్క అమ్మాయి రిటైరయ్యే వరకే కాబట్టి, ముప్ఫయ్యారు సంవత్సరాలకి యాభై ఒక్క వెయ్యి, ఎనిమిది వందల నలభై రూపాయిల వుతుంది నాన్నా" అంటూ కాగితం మీద ఎడమవక్క వేసిన అంకెలు చూపించాడు.

"రోజు రోజుకీ అన్ని వస్తువుల ధరలూ పెరిగి పోతున్నాయి కాబట్టి, నెలకి నూట ఇరవై చాలదు, ఓ రెండు వందలో, మూడు వందలో ఇమ్మంటే?" మట్టయ్యా తన అనుమానాన్ని వినిపించి మళ్లీ పడుకున్నాడు.

"అలా అడిగినా మనకి నష్టం వుండదు నాన్నా! ఎందుకంటే ప్రతి ఏటా ఆవిడ జీతం పెరుగుతుందే గానీ తరగదుకదా! ఆ పెరుగుదలకి యీ పెరుగుదల సరిపోతుంది. అంచేత, ఆ ఖర్చులు తీసేసినా, నిఖరంగా మనకి అయిదు లక్షల తొంభై ఆరువేల, నూట అరవై రూపాయిలు మిగులుతుంది, నాదీ గ్యారంటీ"

"ఏటా గ్యారంటీ, ఆ పిల్ల తిండికి, టిఫిన్లకి, బట్టలకి, యీ ముప్పై ఆరు సంవత్సరాలకీ ఎంతవుతుందనుకున్నావు? ఎంత నీరసంగా చూసినా లక్షన్నరపైన, రెండు లక్షలలోపూ అవుద్ది. దాన్ని కూడా నికరాదాయంలోనించి కొట్టేసి, ఆ మిగిలింది చెప్పు"

"ఆ ఖర్చులు గురించి నువ్వు ఆలోచించ క్కర్లేదు నాన్నా! సింధుజ రిటైరయేక వచ్చే ప్రావిడెంటు ఫండు, గ్రేట్యూటీ కలిపితే అది కూడా లక్షన్నర, రెండు లక్షల మధ్యే వుంటుంది. కాబట్టి మన నికరాదాయానికి పెరుగుదలే తప్ప తరుగుదల వుండదు"

మట్టయ్యా ఆ రాత్రంతా ఆ కాగితం పట్టుకుని బాగా ఆలోచించేక, మర్నాడు వుదయం కొడుక్కి గ్రీన్‌సిగ్నల్ ఇస్తూ "మనకి తెలియని దేవతకంటే, తెలిసిన దెయ్యమే బెటరనే సామెతని ఆడెవడో ఇంగ్లీషోడు చెప్పేడటకదా! అంచేత ఆ ఇంగ్లీషోణ్నే ఫాలో అయిపోదాం. ఇంక నువ్వు ఆ పని మీదుండు" అన్నాడు.

★ ★ ★

'నిప్పుల్లో కాలిస్తే మెత్తబడని వస్తువులేదు. పొగడ్తల్లో ముంచితే లొంగని మనిషి వుండడు' అని అనుభవజ్ఞులు అంటుంటారు. మనుమలే కాదు, మానవుడిగా అవతరించిన విష్ణుమూర్తి కూడా పొగడ్తలకి లొంగక తప్పదనడానికి ఓ వుదాహరణ వుంది.

రాముడు పట్టాభిషిక్తుడయేక, తన గూఢచారులద్వారా తన రాజ్యపరిస్థితిని క్షుణ్ణంగా తెల్సుకునే వాడట. అతని పాలనలో దేశం సుభిక్షంగా వుండేదని ఇప్పటికీ చెప్పుకుంటున్నాం కదా. ఓ సారి రాముడు తన గూఢచారుల్నందర్నీ పిలిచి "ప్రస్తుతం మనదేశ పొజీషన్ ఎలావుంది? ప్రజలంతా నా పరిపాలన గురించి ఏం అనుకుంటున్నారు? ఈ రెండు విషయాలూ చెప్పండి, వాళ్లంతా నన్ను పొగుడుతున్నారన్న విషయం మాత్రం చెప్పకండి, ఎందుకంటే నాకు పొగడ్తలంటే పరమ అసహ్యం" అన్నాడు.

సీ.ఐ.డీలందరూ ఇబ్బందిలో పడ్డారు. ఎందుకంటే ప్రజలంతా రాముణ్ణి పొగుడుతూనే వున్నారు. అలా అని చెప్తే ఆయన తమకి బహుమానాలు ఇవ్వడు. మాంచి ఛేన్స్ మిస్ అయిపోతున్నామే అని నులుచుకుపోయేరు. కానీ అందులో ఒక గూఢచారి డిప్లమో ఇన్ ఏక్టింగ్, డిగ్రీ ఇన్ కాకాయిజమ్ పాసైన వాడట. వాడు మాత్రం ధైర్యంగా ముందుకొచ్చి

"జో మహరాజ్! నేను అన్నం తప్ప గడ్డి తినని మనిషిని కాబట్టి, నేను నిజం తప్ప అబద్ధం చెప్పను. ప్రజల్లో చాలామంది మీ గురించి దారుణంగా మాట్లాడుకుంటున్నారని నా ఎంక్వయిరీలో తేలింది" అన్నాడు.

రాముడికి గుండె గుబగుబలాడింది. తన పరిపాలన నీళ్లు కలవని పాలంత స్వచ్ఛమైందని మురిసిపోతుంటే, ఇదెక్కడి గొడవా అంటూ ఆశ్చర్యపోయి "ఎందుకలా అనుకుంటున్నారు? నేనేం దారుణం చేసేను?" అని అడిగాడు.

"వాళ్లేం అనుకుంటున్నారంటే, రాముడుగారు రాజ్యానికి రాకుండా ఫారెస్టులో వున్నప్పుడు రాజ్యంలో బోలెడంత మంది ముష్టివాళ్లు

వుండేవారు. వాళ్లకి మేం అన్నదానం చేసో, వస్త్రదానం చేసో బోలెడంత పుణ్యం సంపాదించుకునే వాళ్లం. మా వాళ్లు ఇలా చనిపోగానే అలా పుష్పక విమానం ఇంటిముందుకొచ్చి, వాళ్లని తీసుకుపోయి, ఎలక్షన్లో గెల్చిన ఎమ్మెల్యేని ఎసెంబ్లీలో కూర్చోబెట్టినట్టు, పుణ్యం మూట కట్టుకున్న పెద్దల్ని తీసుకెళ్లి స్వర్గంలో కూర్చోబెట్టి దాహం తీరడానికి అమృతం, మోహం తీరడానికి దేవనర్తకీమణుల్నీ అప్పజెప్పేవారు. కానీ ఈ రాముడుగారు రూలింగ్‌లో కొచ్చేక, దేశం మొత్తం మీద ఒక్క ముష్టివాడూ కనబడ్డం లేదు. అందరూ గొప్పగానే బతికేస్తున్నారు. అంచేత మేం దానాలు ఇద్దామన్నా పుచ్చుకునే వాడేలేడు. ఈ రాముడొచ్చి మేం పుణ్యం సంపాదించుకునే ఛేన్స్ లేకుండా చేశాడు, అని వాళ్లు కామెంట్ చేస్తున్నారు మహాప్రభో' అన్నాడు ఆ డిప్లమో ఇన్ ఏక్టింగ్ పేసైన గూఢచారి.

రాముడంతటి దేవుడే ఆ విమర్శలాంటి పొగడ్తకి పొంగిపోయి, లొంగిపోక తప్పలేదు. అలాంటిది మానవ మాత్రురాలైన సింధుజ ఎంత పాటిది? పొగడ్తనేది, మండుటెండలో మాడిపోతున్నవాణ్ణి, ఎయిర్ కండీషన్డ్ గదిలోకి విసిరేసినంత హాయిగా వుండాలి తప్ప, శీతాకాలంలో ఓ మనిషికి బట్టలు విప్పేసి పూటీలో విదిలేసినంత దారుణంగా వుండకూడదు. ఈ విషయం ప్రభాకర్‌కి తెలునుకాబట్టే సింధుజ నమ్మే విధంగా కొన్ని విషయాలు చెప్పేడు. నవ్వే విధంగా కొన్ని జోకులు పేల్చేడు సీరియస్‌గా వుండేవాడికంటే, నవ్వించే వాడు నలుగురికీ ఇష్టుడవుతాడు. ఆవిధంగా తక్కువ టైములోనే సింధుజ ఆలోచించే వ్యక్తుల్లో ఒకడిగా మారాడు.

ఆ రోజు సింధుజ ఆఫీసుకో అరగంట లేటుగా వచ్చింది. ఆమె సీట్లో కూర్చోగానే ప్రభాకర్ ఆమె దగ్గరకొచ్చి "నా వాచీకి బేట్రీ వీక్ అయిపోయినట్టుందండి. ఈ రోజు అరగంట ఫాస్ట్ తిరిగేస్తోంది. ఇప్పుడు కరక్టుగా పది అయితే, పదిన్నర చూపిస్తోంది" అంటూ తన చేతి వాచీని చూపించాడు.

సింధుజ నవ్వింది... "ఇప్పుడు కరక్టుగా పదే అయిందని మీకెవరు చెప్పేరు?"

"మీరు ఠంగుమని పదికొట్టేసరికల్లా సీట్లో వుంటారుగదా. ఇవాళ మీరు ఇప్పుడే వచ్చేరు కాబట్టి, ఇప్పుడు పది అయినట్టేకదా"

సింధుజ మళ్లీ నవ్వింది. "లేదులెండి. ఇప్పుడు పదిన్నరే అయింది. నేనివాళ హాఫెన వరు లేటుగా వచ్చేను"

"ఆ మాటనలేకే ఇలా వాచీమీద పెట్టి అడిగాను"

"ఏం లేదండి, ఇవాళ నా బర్త్‌డే..."

ప్రభాకర్ ఆఫీసని కూడా చూడకుండా "ఆ మాట చెప్పరేం. విష్‌యూ మెనీ మెనీ హేపీరిటర్న్స్ ఆఫ్ ద డే" అంటూ షేక్‌హేండ్ కోసం చెయ్యి చాపేడుగాని ఆమె చెయ్యి అందించలేదు. అంతలోనే చెయ్యి వెనక్కి లాక్కుని "సారీ... అయితే మీరు మీ జన్మ దిన శుభ సందర్భాన గుడికెళ్లి దేవుణ్ణి ఏమని ప్రార్థించేరు?" అన్నాడు తన సీట్లో కూర్చుంటూ.

"నేను దేవాలయానికెళ్లేనని మీకెవరు చెప్పేరు?"

"సాధారణంగా చాలామంది పుట్టిన రోజునాడు దేవాలయానికి వెళ్తుంటారుగదండి"

"నేనలా వెళ్లనులెండి. ఈ వూళ్లో వున్న ప్రేమ సమాజానికి వెళ్లి అనాథ పిల్లలకి ఓ వంద రూపాయిల స్వీట్సు కొనిచ్చేను"

ప్రభాకర్ తల తిప్పి ఆమెవైపు నిశితంగా చూసి 'మీకు అనాథ పిల్లలంటే అంత అభిమానమా?" అన్నాడు.

"అభిమానం వున్నా వాళ్లని వుద్ధరించడానికి నా బోటి వాళ్లేం చెయ్యగలరు చెప్పండి? కనీసం నా పుట్టినరోజు నాడైనా వాళ్ల నోళ్లు తీపి చెయ్యగలిగితే కొంత తృప్తి కలుగుతుందని అలా చేయడం అలవాటు చేసుకున్నాను. దట్సాల్"

సింధుజ అభిమానం సంపాదించడానికి ఓ అడ్డదారి దొరికినట్టయింది.

నాలుగు రోజుల తర్వాత ప్రభాకర్ ఆఫీసులోకి వస్తూ వరండాలో ఆగి, ఎవరూ చూడకుండా షర్టుకి పెట్టుకున్న గుండుసూది తీసి, కుడి మోచేయి లోపల భాగానికి గుచ్చేడు.




కొద్దిగా రక్తం వచ్చింది. జేబులో రెడీగా వుంచుకున్న దూది తీసి రక్తం వచ్చే చోట పెట్టి, చేతిని మడిచి పెట్టుకుని, అలాగే తన సెక్షన్‌లోకి వెళ్లేడు. సింధుజ చూసేలా చేతిని కాస్త ముందుకు పెట్టి ఆమెకు గుడ్ మోర్నింగ్ చెప్పాడు.

"గుడ్‌మోర్నింగ్" అంటూ సింధుజ తల ఎత్తి చూసింది. "ఏమిటీ బ్లడ్ టెస్టు చేయించుకున్నారా?" అంది.

"లేదండి... ఇవాళ నా బర్త్‌డే కదాని గవర్నమెంట్ హాస్పటల్‌కెళ్లి కాస్త రక్తదానం చేసొచ్చేనండి" అంటూ ఆమె తన మాటల్ని నమ్మిందో లేదోనని ఆమెను ఓరకంట గమనించాడు.

ఆమె నమ్మినట్టే కనిపించింది. "చాలా మంచి పని చేశారండి" అంది ప్రసన్నంగా నవ్వుతూ.

"మంచి పననే ఇక మీదట నా ప్రతీ బర్త్‌డేకి రక్తదానం చెయ్యాలని నిర్ణయించుకున్నాను. 'పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట' అని పోతనామాత్యుడు రాసిన విషయం మీకు తెలిసే వుంటుంది. అంటే, ఈ భాగవతం రాయడంలో నా ప్రయోజకత్వం ఏమీ లేదు, అంతా ఆ శ్రీరామచంద్రుడి ప్రేరణే అని ఆయన అభిప్రాయం. అలాగే, నేనిప్పుడు చేసిన రక్తదానం కూడా నా గొప్పతనమేం కాదండి... అంతా మీ ఇన్స్పిరేషన్' ఆఖరి వాక్యాన్ని కాస్త ఒత్తి పలుకుతూ అన్నాడు.

"నా ఇన్స్పిరేషనా? నేనేం మిమ్మల్ని రక్తదానం చెయ్యమని చెప్పలేదే" అంది సింధుజ ఫైలు చేస్తూనే.

"ప్రత్యేకించి నోటితో చెప్పాలటండి. ఆచరించకుండా చెప్పే లక్ష ఆశయాలకంటే, ఆచరించి చూపిన ఒక్క ఆశయమైనా ప్రశంసించదగిందే అని గాంధీగారో, నెహ్రూగారో చెప్పినట్టు గుర్తు. మీరు మీ పుట్టినరోజు నాడు అనాథ పిల్లలకి స్వీట్సు పంచేరు. ఆ పని చెయ్యమని మీకెవరు చెప్పారు? సహజంగా మీరు మంచివారు, భూతదయ గలిగినవారూ కాబట్టి అలా చేశారు. మిమ్మల్ని చూసేను. మీరు చేసిన పని మంచిదనిపించింది. మీలాగే నేను కూడా ఎందుకు చేయకూడదనిపించింది... చేశాను. వివేకానందుడు గొప్పవాడు కావడానికి రామకృష్ణ పరమహంస ఓ ప్రేరణంటారు. శివాజీ అంత గొప్పవాడు కావడానికి అతని తల్లి జిజియాబాయి ఓ ప్రేరణంటారు. అలాగే నా విషయంలో మీరు నాకు ప్రేరణనుకుంటున్నాను. ఒక దీపంతో మరో దీపం వెలుగుతుందిక దండి!"

ఇంటి దగ్గర్నించి రిహార్సల్స్ చేసుకుంటూ వచ్చినందుకు ఈ మాటల్ని మంచి మాడ్యులేషన్‌తోనే చెప్పగలిగేనని తృప్తిపడ్డాడు ప్రభాకర్. లంచాలు, బహుమానాలూ ఇచ్చి కొంత మందిని లొంగదీసుకోవచ్చు. పూలదండలు వేసి, పాదాభివందనాలు చేసి మరి కొంత మందిని లొంగదీసుకోవచ్చు. కానీ చమత్కారంగా పొగిడి చాలామందిని లొంగదీసుకోవచ్చనే నగ్నసత్యం సర్వే సర్వత్రా కనిపిస్తూనే వుంటుంది. సింధుజ ఎంత ఆత్మాభిమానం గల అమ్మాయి అయినా, ఈ విషయంలో మినహాయింపుకాదు. ప్రభాకర్ బుద్ధి ఎలాంటిదైనా చాలా ఆకర్షణీయమయిన మనిషే! స్టైలోగా వుద్యోగం చేస్తున్నాడు. సరస సంభాషణా చతురుడు. ఓ అమ్మాయి హృదయ కవాటాలు తెరిచి, అందులో తన రూపాన్ని ప్రవేశపెట్టడానికి ఇంతకంటే అర్హతలేం కావాలి? సింధుజ, ప్రభాకర్‌ల పరిచయం స్నేహంగానూ, స్నేహం ప్రేమగానూ మారి, ప్రేమలేఖలు నడిచి, సముద్రతీరాన, పూలతోటల్లో ఫొటోలు తీయించుకోవడం వరకూ వచ్చింది.

ఈ రెండు మూడు నెలల కాలంలోనూ ప్రభాకర్, చంద్రమౌళిని, భానుమూర్తిని ఒకటి, రెండుసార్లే కలిశాడు. అప్పుడు కూడా అతను సింధుజ ప్రస్తావన తీసుకు రాలేదు. ఓ మంచి రోజున సింధుజ ప్రభాకర్‌ని ఇంటికి తీసుకొచ్చి తండ్రికి, పినతల్లికి పరిచయం చేసింది. ఈడూ జోడూ బాగుందనుకున్నాడు ఆదినారాయణ. ఈ అబ్బాయి పెళ్లైంతర్వాత సింధుజ సంపాదించే జీతంలో సగమైనా మాకు ఇవ్వనిస్తాడో, ఇవ్వనివ్వడో అనుకుంది అనసూయ.

ముహూర్తాలు పెట్టడమే తరువాయి అనుకుంటున్న తరుణంలో భగవంతుడు సింధుజ జీవిత నాటకంలో మరో కొత్త అంకాన్ని

ఆరంభించాడు.

★ ★ ★

హెర్క్యులస్ టైర్స్ కంపెనీ ప్రొప్రయిటర్ రఘుపతి స్వతహాగా మంచివాడు, ఆత్మగౌరవం కలిగిన మనిషే! అయితే, మంచివాళ్ల జీవితంలో గొడవలు, అల్లర్లు జరగవనే గ్యారంటీ లేదు. గత పది సంవత్సరాలుగా అతన్తో భాగస్థుడిగా వుంటున్న వరహాల్రాజుతో ఓ ఆరు నెల్లగా సాగుతున్న గొడవ ఇప్పుడు పక్వానికొచ్చింది. మాటామాటా పెరిగింది. భాగస్థులు విడిపోయేరు.

అంతవరకూ బాగానే వుంది, కానీ వాళ్లిద్దరూ సఖ్యతగా వున్నప్పుడు రఘుపతి కూతురు రూపాదేవిని వరహాల్రాజు కొడుక్కిచ్చి చెయ్యాలని ఇద్దరూ అనుకున్నారు.

వ్యాపార విషయంలో ఘర్షణ చెలరేగినప్పుడు రఘుపతి, అవసరమైన దానికంటే కొన్త ఎక్కువగానే రెచ్చిపోయి, ఆవేశం ప్రకటించాడు.



"ఆడపిల్లనిచ్చుకునేవాడు కాస్త అణిగి వుండాలిగాని, అలా రెచ్చిపోకూడదన్నాడు వర హాల్రాజు. ఆ మాటతో మరింతరెచ్చిపోయేడు. "ఆడపిల్లనిచ్చుకుంటే, మగ పెళ్లి వారికాలి కింద చెప్పులా బతకాలా? అలా నేను చచ్చినా బతకను. అసలు, అలాంటి ఆలోచనవున్న వాళ్లయింటికి నా కూతుర్నే పంపను. నీతో వ్యాపారమే వద్దనుకుంటున్నప్పుడు, నీతో సంబంధం మాత్రం ఎందుకు పెట్టుకుంటాను? నా చెప్పుచేతల్లో వుండేవాణ్నే అల్లుడిగా చేసుకుంటాను. తాడూ బొంగరంలేని ఓ బుద్ధిమంతుణ్ణి తీసుకొచ్చి, వాడికి తాడూ బొంగరం నేనే అవుతాను" అంటూ అప్పటికప్పుడు ఓ నిర్ణయానికొచ్చేశాడు. అలాంటి వాడెవరైనాతన ఎరుకబాట్లో వున్నారా అని ఆలోచిస్తే మట్టయ్యా కొడుకు ప్రభాకర్ అతని దృష్టిలోకొచ్చేడు. అబ్బాయి బాగానే వుంటాడు. ఇల్లరికం వుండమని అడిగితే ఎందుకొప్పుకోడు? ఇల్లరికం వున్నప్పుడు అతన్ని తన అభిప్రాయాలకి అనుగుణంగా తిప్పుకోవచ్చు. ఆ రోజు సాయంత్రమే మట్టయ్యాని పిలిచి, తన అభిప్రాయాన్ని వెల్లడించాడు.

సడన్‌గా నెత్తి మీద బలమైన దెబ్బ తగిల్తే కొన్ని క్షణాలపాటు కళ్లు బైర్లు కమ్మినట్టుగా రఘుపతి చెప్పింది వినగానే మట్టయ్యాకీ బైర్లు కమ్మేయి. ఇది కలా? నిజమా? అనుకుంటూ ఓసారి గిల్లుకుని చూసేడు. నెప్పి పుట్టింది కాబట్టి నిజమేనని నమ్మక తప్పలేదు. తనో వెధవనన్న సంగతి మరొకరు చెప్పనవసరం లేకుండా తనకే తెల్సు. అలాంటి తనకి ఇంత అదృష్టమా? ఒకప్పుడు మా అబ్బాయికి వుద్యోగం ఇప్పించండి మహాప్రభో! అని తను అడిగాడు. ఇప్పుడు మీ అబ్బాయికి మా అమ్మాయిని చేస్కో! అని రఘుపతి అడుగుతున్నాడు. దేవుడు మంచివాళ్లకే కాకుండా కొంత మంది రాక్షసులక్కూడా వరాలిచ్చినట్టుగా పురాణాల్లో రాసేరు. అలాంటి పనులు ఆ భగవంతుడు ఇప్పుడు కూడా చేస్తున్నాడన్న మాట! లేకపోతే తనేమిటి? కోటీశ్వరుడితో వియ్యమందడం ఏమిటి?

రఘుపతికి కరెక్టుగా ఎన్నికోట్ల ఆస్తి వుందో తనకి తెలీదుగాని, వున్న అన్ని కోట్లుకి వారసురాలు ఒక్కతే! ఆ ఒక్క వారసురాలికీ తన కొడుకు మొగుడు కాబోతున్నాడు. మట్టయ్యా ఆశల ఆకాశంలో కాకిలా ఎగురుతుండగా, రఘుపతి ఓ ప్రశ్న వేస్తే నింగినించి నేలమీదకి దిగాడు.

"మీవాడిని అడిగి నాకు జవాబు చెప్పు. ఎందుకు అడిగి చెప్పమంటున్నానంటే, మీవాడు ఏ అమ్మాయికైనా మనసిచ్చేడేమోనని! మా అమ్మాయిని పెళ్ళిచేస్కోడానికి మీవాడు మరో అమ్మాయికి అన్యాయం చెయ్యడం నాకిష్టం వుండదు"

మట్టయ్యా ఠపీమని అతని పాదాలదగ్గర కూర్చుండిపోయి, "మీ పాదాలసాక్షిగా చెప్తున్నాను. మావాడు ఎవర్నీ ప్రేమించలేదని నేను మీకు కాగితం రాసివ్వగలను. అయితే చాలా మంది మనుషుల్తో, అంటే ఆడామగా అనే భేదం లేకుండా అందర్తోనూ నవ్వుతూ మాట్లాడతాడు. దాన్ని సరిగా అర్థంచేస్కోకుండా, వాడు ఏ అమ్మాయినైనా ప్రేమించేడని ఎవరైనా అనుకుంటే, అది వాళ్ళ పొరపాటేగాని, మావాడి పొరపాటు కాదు. ఒకవేళ, అలాంటి విషయాన్ని ఎవరైనా మీ చెవులదగ్గరకి తీసుకొస్తే వాళ్ళని చెప్పుతో కొట్టండిగాని, వాళ్ళు చెప్పిందిమాత్రం వినకండి. మావాడికి యిప్పటివరకూ నేనే దగ్గరుండి క్షవరం చేయించాలి తప్ప, వాడు స్వతంత్రించి ఏనాడూ చేయించుకోలేదండి. అంటే, వాణ్ణి అంత డిసిప్లిన్‌తో పెంచేనని మనవి చేసుకుంటున్నాను"

రఘుపతి మట్టయ్యా మాటల్ని నమ్మేడు. మట్టయ్యా, అతని కొడుకు యిప్పటివరకూ ఎలాంటివారైనా, పెళ్ళయ్యేక ప్రభాకర్‌కి తను పునర్జన్మనిచ్చిన విధాత అవుతాడు కాబట్టి, ఆ తర్వాత జీవితం ఎలా వుండాలో తనే రాస్తాడు. ఇంక ఆలోచించడానికేం లేదని ముహూర్తాలు నిర్ణయించే పనిలో పడ్డాడు.

★ ★ ★

మట్టయ్యా చెప్పింది వినగానే ప్రభాకర్‌కి మూర్ఛవచ్చినంత పనైంది. రఘుపతి అడిగిన ప్రేమవిషయం మట్టయ్యా ప్రస్తావించగానే వస్తున్న మూర్ఛని బలవంతాన ఆపుకున్నాడు.




ఇంత గొప్ప అదృష్టం కలుగుతుందని తెలియక, తను సింధుజని తొందరపడి ప్రేమించాడు! యిప్పుడా అమ్మాయికి ఏమని చెప్పడం? చెప్తే తన దారినించి తప్పుకోడానికి ఒప్పుకుంటుందా? ఒప్పుకోదు. భానుమూర్తిగాడు ఏదో నోటిదురుసుకొద్దీ ఒక్క తప్పుడుమాటంటేనే ఆఫీసులో అందరిముందూ చెప్పుతో చావగొట్టింది. అలాంటిది, యిప్పుడు నాదారి నేను చూసుకుంటున్నాననిచెప్తే, నన్ను చొక్కా పట్టుకుని ఈడ్చుకెళ్ళి రఘుపతిగారి సమక్షంలోనే చావగొడుతుంది. పైగా సింధుజ దగ్గర తను రాసిన లవ్‌లెటర్సు, యిద్దరూ కలిసి తీయించుకున్న ఫొటోలూ వున్నాయి. వాటిని చూపిస్తే, సింధుజకి శ్రమ లేకుండా రఘుపతిగారే తుపాకితో నన్ను కాల్చిపారేస్తారు. లేదా, చీటింగ్ కేసుకింద జైల్లో పెట్టిస్తారు. ఇప్పుడెలా? ఎలా?

కొడుకుని వణికిస్తున్న ప్రశ్నల్ని, సందేహాల్ని మట్టయ్య అడిగి తెలుసుకున్నాడు. వాడి సందేహాల్ని సులభంగా తీసిపారేయవలసినవి కావు! బంగారం కొండమీదకి బురదకాళ్ళతో ఎక్కకూడదు. చెప్పులో రాయి వుంటే నడక సరిగా సాగదు. సింధుజ యిప్పుడు చెప్పులోని రాయి! ఆమెదగ్గరున్న లవ్‌లెటర్సు, ఫొటోలు చూపించి అల్లరిచేసినా చేస్తుంది. నా కూతురికోసం, మరో అమ్మాయికి అన్యాయం చెయ్యడం నాకిష్టంలేదూ అని రఘుపతి అండర్‌లైన్ చేసిమరీ చెప్పేడు. చిన్న పాము నయినా పెద్దకర్రతోనే కొట్టాలి.

అప్పటికప్పుడు ఓ హాఫ్‌బోటిల్ బ్రాందీ తెప్పించి, నీళ్ళు కలపకుండా ఓ రెండు పెగ్గులు తాగి, మస్తిష్కానికి పనిచెప్పేడు. అతనేదైనా దుర్మార్గపుని చేయాలనుకున్నప్పుడు భారతం, రామాయణం, భాగవతంలాంటి పురాణకథల్ని రిఫర్‌చేస్కోడం అలవాటు. అందులో వున్న ఎత్తులు, పైఎత్తులు, లౌక్యాలు, లాజిక్కులు మరెందులోనూ వుండవు. ఆ కవులంతా మహానుభావులు, ముందుతరాల దుర్మార్గులకి, ఏ సమయంలో ఏ నక్కజిత్తులు పనికొస్తాయో ఆనాడే రాసిపెట్టేశారని ఎన్నోసార్లు ఆ కవులకి సెల్యూట్ చేశాడు మట్టయ్య. అలా ఆలోచించగా ఆలోచించగా, మూడో పెగ్గులో ఎందుకో కర్ణుడు అతని స్మృతిపథంలో మెదిలాడు.

కర్ణుడు మహావీరుడే! ఎన్నో దివ్యాస్త్రాలు అతనిదగ్గరా స్టాకున్నాయి. అయితే ఏం లాభం? శాపగ్రస్థుడవడంవల్ల ఆ దివ్యాస్త్రాలేవీ టైముకి పనికిరాకుండా పోయేయి. ఇప్పుడు సింధుజని కూడా కర్ణుడిలా శాపగ్రస్థురాలిగా మార్చేస్తే! అప్పుడా అమ్మాయి చేతిలో ప్రభాకర్ రాసిన లవ్‌లెటర్సున్నా ఫర్వాలేదు. ఫొటోలున్నా ఫర్వాలేదు. అయిడియా దొరికింది కాబట్టి, యింక స్కీమ్ గురించి ఆలోచించాలి. సీసా ఖాళీ అవుతుండగా, అదే బుర్రలోకొచ్చేసింది.

"ఏదైనా దారి దొరికిందా నాన్నా?" అన్నాడు ప్రభాకర్ దగ్గరకొచ్చి.

"దొరక్కేటవుతుందిరా? మంచి పనులకైతే దారులు తక్కువ వుంటాయిగాని, దుర్మార్గానికన్నీ దారులే" అంటూ తన పథకాన్ని వివరించేడు.

వినగానే ప్రభాకర్ కంగారుపడ్డాడు. భయపడ్డాడు. మట్టయ్య కొడుక్కి ధైర్యంచెప్పేడు.

"జీవహింస తప్పనుకుంటే మన కంచంలోకి కోడికూర రాదునాయినా. మహాభారతంలో కౌరవులూ తప్పులు చేశారు, పాండవులూ తప్పులు చేశారు. గదాయుద్ధం రూల్సుప్రకారం దుర్యోధనుడి తొడలమీద భీముడు కొట్టకూడదు. కానీ కొట్టేడు, కొట్టకపోతే వాడు చావడు. ఇది తప్పన్నాడు బలరాముడు. ఏం, మొన్న అభిమన్యుడిని, రూల్సుకి విరుద్ధంగా లేపెయ్యలేదా? అది తప్పుకానప్పుడు యిదిమాత్రం తప్పు ఎట్టా అవుతుందీ? అని శ్రీకృష్ణుడు వాదించాడు. శ్రీకృష్ణుడంటే ఎవరు. సాక్షాత్తు దేవుడేకదా! మరలాంటి దేవుడే తప్పుడుపనులు చేయించి, వాళ్ళ రాజ్యాన్ని వాళ్ళకిప్పించేడు. మనవనగా ఎంత? ఈ ప్లాన్‌లో దింపవలసినవాళ్ళందర్నీ దింపుతాను. నువ్వు చెయ్యాల్సిందల్లా ఒక్కటే! ఓ నాలుగురోజులపాటు నువ్వు ఆఫీసుకెళ్ళకుండా యింట్లోనే కూర్చో. సింధుజ ఫోన్‌చేసినా మాట్లాడకు" అంటూ మట్టయ్య మనసులోనే వ్యూహారచన

ఆరంభించాడు.

★ ★ ★

ఆరోజు సింధుజ ఆఫీసుకొచ్చి తన పని చేసుకుంటోంది. ప్రభాకర్ ఆఫీసుకి రాలేదు. పదిన్నరకి సింధుజకి కాఫీ తెచ్చిన ప్యూన్, ప్రభాకర్‌గారు శెలవు పెట్టేరండీ అని చెప్పేడు. పదకొండు గంటలు దాటుతుందనగా సూపర్నెంటు హనుమంతరావు సింధుజని తన సీటుదగ్గరకి పిలిచాడు.

"చూడమ్మా! మన కంపెనీ లా ఆఫీసరుగారు హైదరాబాద్‌నించి వచ్చి, అప్సరా హొటల్, రూమ్‌నెంబరు నాలుగువందల పన్నెండులో దిగేరు. ఆయన రెండుమూడు లెటర్సు డిక్టేట్ చేస్తారట. ఎవరైనా స్టెనోని పంపించమని ఫోన్‌చేశారు. ప్రభాకర్ వుంటే అతన్నే పంపించేవాణ్ణి. కానీ ఆయన శెలవు పెట్టేరుగదా! అంచేత దయచేసి నువ్వు వెళ్తావా?" అన్నాడు ఎంతో అనునయంగా.

"ఎందుకు వెళ్ళనండీ! ఇదీ ఆఫీసు డ్యూటీయేగా!" అంది సింధుజ నవ్వుతూ.

"కాంపౌండ్‌లో మన కంపెనీ కారుంది. డ్రైవర్‌కి నేను ఫోన్‌చేసి చెప్తాను. నువ్వా కారులో వెళ్ళిరా" అంటూ హనుమంతరావు ఫోన్ అందుకున్నాడు.



సింధుజ అప్సరా హొటల్ కాంపౌండ్‌లో కారు దిగి లోపలకి నడిచింది. లిఫ్ట్ అవుటాఫ్ ఆర్డర్ అంటూ లిఫ్టుదగ్గరున్న బోర్డు చూసి, చిన్నగా నిట్టూర్చి మెట్లు ఎక్కింది.

రూమ్ నెంబర్ 412. కాలింగ్‌బెల్ నొక్కగానే రూమ్ తలుపు తెరుచుకుంది. ఎదురుగా ఓ పదిహేనేళ్ళ అబ్బాయి కనపించాడు.

"ఎవరండీ?"

"నాపేరు సింధుజ. టైర్స్ కంపెనీనించి వచ్చేను. లా ఆఫీసర్‌గారున్నారా?"

"రండీ... మీకోసమే వెయిట్ చేస్తున్నారు" అన్నాడా అబ్బాయి ఎంతో సౌమ్యంగా. సింధుజ లోపలకి నడిచింది. అది ఎయిర్ కండీషన్డ్ సూట్.

"లోపలున్నారు వెళ్ళండి" అంటూ ఆ అబ్బాయి బైటకెళ్ళిపోయాడు.

సింధుజ ఆ రూమ్ తలుపు తెరిచి లోపలకెళ్ళింది. ఫైలు చూస్తున్న వ్యక్తి ఫైలు కిందకి దించేడు.

సింధుజ తలమీద పిడుగుపడినట్టుగా అదిరిపడింది.

ఆ వ్యక్తి... భానుమూర్తి!

తనతో చెప్పుదెబ్బలు తిన్న ఛిట్‌ఫండ్ కంపెనీ మేనేజర్. మూర్తి చిన్నగా నవ్వేడు. "ఏవిటీ... దేవుడిగుళ్ళో దెయ్యం వుందేమిటా అని అదిరిపడ్డావా?"

"షటప్... యిక్కడ నువ్వెందుకున్నావ్?"

"నీకోసమే వున్నాను. ఆరోజు నేనో మాట అన్నందుకే నువ్వు అంత శిక్ష విధించేవు. మరా శిక్షకి నేను కక్షతీర్చుకోవద్దూ! నీ ఒంటిమీద చెయ్యి వెయ్యకుండానే, నిన్ను ఈ వూరంతా అసహ్యించుకునేలా వ్యభిచారిని చేస్తాను" అంటూ ముందుకు రాబోయేడు.

సింధుజకి ఏం చెయ్యాలో అర్థంకాలేదు. వస్తున్న మూర్తిని ఒక్క వూపున మంచంమీదికి తోసి, బయటకి పరుగెత్తాలనుకుంది. అలాగే చేసింది. కానీ మూర్తి ఆమెను బలంగా పట్టుకోవడంతో అతన్తోపాటు మంచంమీద పడింది. అక్కడనించి లేవబోతుండగా, వెనకనించి, "హలో" అనే గొంతు వినిపించి అటుచూసింది.

తలుపుదగ్గర ఇనస్పెక్టర్ చంద్రమౌళి, యిద్దరు కానిస్టేబుళ్ళు కనిపించారు.

వాళ్ళెందుకొచ్చారో సింధుజకి అర్థంకాలేదు.




కానీ వాళ్ళవల్ల తనకి రక్షణ కలుగుతుందని ఆశపడింది.

''సార్! ఈ రాస్కెల్ నన్ను బలవంతం చేస్తున్నాడు సార్'' అంది చంద్రమౌళి దగ్గరగా వచ్చి.

''లేదు ఇనస్పెక్టర్, మిమ్మల్ని చూసి భయపడి, అలా అంటోంది. షీ ఈజ్ మై గర్ల్ ఫ్రెండ్'' అన్నాడు మూర్తి తప్పుచేసివాడిలా తల దించుకుని.

''నో... నేను వాడి గర్ల్‌ఫ్రెండ్‌ని కాదు సార్...'' అంటూ సింధుజ ఏదో చెప్పబోతుంటే చంద్రమౌళి ఆమెను ఆపుచేశాడు.

''మీ పేరేంటి?''

''సింధుజ''

''యిక్కడ వ్యభిచారం జరుగుతోందని మా స్టేషన్‌కి కంప్లయింట్ వచ్చింది''

''నో సార్... ఎవరో మీకు రాంగ్ ఇన్ఫర్మేషన్ యిచ్చేరు'' సింధుజ గొంతులో కంగారు, ఆవేశం కలగలుపుగా ధ్వనించాయి. మూర్తి జోక్యం చేస్కుంటూ, ''ఔను ఇనస్పెక్టరుగారూ. మీకెవరో రాంగ్ ఇన్ఫర్మేషన్ యిచ్చేరు. మేమిద్దరం ఎన్నోసార్లు ఈ హొటల్‌కొచ్చేం'' అతని మాట పూర్తికాకుండానే సింధుజ ఫట్‌మంటూ చెంపదెబ్బ కొట్టింది. దానికి మూర్తి ఏమీ స్పందించకుండా మళ్ళీ మామూలుగానే చంద్రమౌళితో చెప్పేడు.

''చూసేరా, మీరంటే ఎంత భయపడిపోతోందే! చాలా సాంప్రదాయమైన కుటుంబంనించి వచ్చింది సార్. దయచేసి ఈ రెండు వేలూ తీస్కుని, మమ్మల్ని వదిలెయ్యండి. అల్లరైతే నా పరువూ పోతుంది. ఈ అమ్మాయి పరువూ పోతుంది''

''యూ డర్టీ రాస్కెల్... ఏవిట్రా నాటకం'' అంటూ మూర్తిని మళ్ళీ కొట్టబోతే చంద్రమౌళి ఆమె చెయ్యి పట్టుకుని ఆపేడు.

''ఈ నాటకం ఏమిటో నేను తేల్చేస్తాను. సాధారణంగా మేం రైడ్ చేసినప్పుడు, సంసారపక్షమైన అమ్మాయిలయితే, మా కాళ్ళమీదపడిపోయి, క్షమించమని అడుగుతారు. బ్రోతల్స్ అయితే మమ్మల్ని తిట్టుకుంటూ వేన్ ఎక్కేస్తారు. కానీ, నువ్వు ఆ రెండు పద్ధతులకీ విరుద్ధంగా మమ్మల్ని చూడగానే నీ లవర్‌ని లెంపకాయలు కొట్టేస్తున్నావ్...''

''నో, వీడు నా లవర్ కాదు'' సింధుజ ఆవేశంగా అరిచింది.

''అంటే యితనెవరో నీకు తెలియదన్న మాట?'' ఆమె ముఖంలోకి సూటిగా చూస్తూ చంద్రమౌళి అడిగాడు.

''వీడి ఆఫీసులో కొన్ని రోజులు పనిచేశాను. వీడు నన్ను అవమానకరంగా మాట్లాడితే చెప్పుతో కొట్టి బుద్ధిచెప్పేను''

''అంటే, యితన్తో నీకు పరిచయం వుందన్నమాట... నువ్వు యితన్తో రాలేదంటున్నావు. మరి నువ్వీ హొటల్‌కి ఎందుకొచ్చినట్టు?'' చంద్రమౌళి వ్యంగ్యంగా అడిగాడు.

''ఈ హొటల్లో మా కంపెనీ లా ఆఫీసర్‌గారున్నారు. ఆయనేదో లెటర్స్ డిక్టేట్ చేస్తారని మా సూపర్నెంటుగారు పంపించేరు''

''ఆ లా ఆఫీసర్‌గారి పేరేమిటి?''

సింధుజ ఖంగుతిన్నది. అతని పేరేమిటో సూపర్నెంటు చెప్పనూలేదు. తను అడగనూలేదు. కేవలం హొటల్‌పేరు, రూమ్ నెంబరు మాత్రమే విని వచ్చేసింది. ఆ విషయమే చెప్పింది. చంద్రమౌళి పగలబడి నవ్వాడు.

''ఎందుకు సార్ నవ్వుతారు? నేను అబద్ధం చెప్పలేదు. కావాలంటే, మా సూపర్నెంటు హనుమంతరావుగారితో మీకా విషయం చెప్పిస్తాను''

''ఒకే, చెప్పించు''

సింధుజ ఫోన్ అందుకుని తన ఆఫీసు నెంబరు చెప్పింది. ఆమె చూడకుండా చంద్రమౌళి, భానుమూర్తి చిన్నగా నవ్వుకుని, షేక్ హేండ్ యిచ్చుకున్నారు.

సింధుజ చేసిన ఫోన్‌ని ప్యూన్ అప్పారావు అందుకున్నాడు. హనుమంతరావుగారు జ్వరం వచ్చిందని యిప్పుడే శెలవుపెట్టి యింటికి వెళ్ళిపోయేరని చెప్పి, ఫోన్ పెట్టేశాడు.

చంద్రమౌళి సింధుజ చెప్పింది విని చిన్నగా నవ్వాడు. ''నిన్నో అరగంట క్రితం



యిక్కడికి పంపించిన మీ సూపర్నెంటుగారికి యింతలోనే జ్వరం వచ్చి యింటికి వెళ్ళిపోయేరా?''

సింధుజకి ఈ వలయంనించి ఎలా బైటపడాలో అర్థంకాలేదు. ''నా మాటలు నమ్మకపోతే, కింద కాంపౌండ్‌లో మా కంపెనీ కారుంది. అందులోనే వచ్చేను. మా డ్రైవర్ని పిల్చి అడగండి''

చంద్రమౌళి ఫోన్ ఎత్తి రిసెప్షన్‌కి కనెక్ట్ చెయ్యమన్నాడు. భానుమూర్తి అతని **చేతులు** పట్టుకుని ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు, ''ఈ వెరిఫికేషన్లన్నీ ఎందుకు సార్? మా సింధు చాలా టెన్షన్లో వుంది. అందుకే ఏం మాట్లాడుతోందో ఆమెకే తెలియడంలేదు. మీకెంత కావాలో చెప్పండి''

సింధుజ ఏదో అనబోతే చంద్రమౌళి ఆమెను ఆగమన్నట్టుగా చేత్తో సౌంజ్ఞచేశాడు.

''చూడండి మిస్టర్! మీరేమో యిలా రిక్వెస్టు చేస్తున్నారు. ఆ అమ్మాయేమో అలా ఆర్గ్యూ చేస్తోంది. యిందులో ఏది నిజమో నేను తెల్సుకోవాలిగా. ఒకవేళ ఆ అమ్మాయిని ఏదోవిధంగా అల్లరిచెయ్యాలని మీరే అబద్ధమాడుతున్నారేమో! ఆవిడ నిజంగా అమాయకురాలైతే, ఆవిణ్ణి రక్షించాల్సిన బాధ్యత మాకుంది గదండి''

చంద్రమౌళి మాటల్తో, సింధుజ గుండెల్లో గుబగుబలాడుతున్న భయం కాస్త తగ్గింది. ఈ వుచ్చునించి అతను తనని బయట పడేస్తాడన్న నమ్మకాన్ని ఏర్పరచుకుందిగాని, ద్రౌపది వస్త్రాపహరణంలో ఒక దుర్యోధనుడు, ఒక దుశ్శాసనుడు ఎలాగో, ఈ నాటకంలో ఒకడు దుర్యోధనుడుకాగా, రెండవవాడు దుశ్శాసనుడన్న సంగతి ఆమెకు తెలియదు.

చంద్రమౌళి రిసెప్షనిస్ట్‌ని అడిగితే, ''ప్రస్తుతం కాంపౌండ్‌లో వైట్ కలర్ ఎంబాసిడర్ లేదు'' అని చెప్పేడు. సింధుజ మళ్ళీ కలవరపడింది. ''అసలీ రూమ్ ఎవరిపేర్న బుక్ అయిందో చెప్పండి'' అన్నాడు.

''రూము కె.భానుమూర్తి పేర్న బుక్ అయింది సార్'' సమాధానం విని చంద్రమౌళి ఫోన్ పెట్టేశాడు. సింధుజ చెప్పిందంతా అబద్ధమని తేల్చేశాడు. సింధుజ ఏడుస్తూ సోఫాలో కూలబడిపోయింది. కనీసం ఆమెనైనా వదిలేయమని భానుమూర్తి అన్నాడు.

''అయామ్ సారీ! యిప్పటికే మా పోలీస్ డిపార్ట్‌మెంట్‌మీద చాలా బేడ్‌నేమ్ వుంది. అలాంటప్పుడు రెడ్‌హాండెడ్‌గా దొరికిన నేరస్థుల్ని వదిలేసి, ఆ బేడ్‌నేమ్‌ని మరింత పెంచలేను'' అంటూ ఎంతో సిన్సియర్ పోలీస్ అధికారిలా ఫోజుపెట్టి చెప్పేడు చంద్రమౌళి.

★ ★ ★

సింధుజని సెల్‌లో పెట్టేరు.

ఆమెకి జరిగిందంతా ఓ మాయాజాలంలా అనిపించింది. తనమీద ఎవరో కుట్రపన్నే యిదంతా జరిపించారు. అందులో భానుమూర్తి ఒక ముఖ్యపాత్ర ధరించాడు. అయితే, ఈ నాటకాన్ని ఎవరు నడిపించినట్టు? ఈ విషయం ప్రభాకర్‌కి తెలిస్తే, అతను తప్పకుండా తనను రక్షించి ఆ బాస్టర్డ్ అంతు తేలుస్తాడు. చంద్రమౌళిని రిక్వెస్ట్‌చేసి, ప్రభాకర్‌కి ఫోన్ చెయ్యడానికి అనుమతి సంపాదించి, ఫోన్ చేసింది.

ప్రభాకర్ ఫోన్ అందుకోబోతే మట్టయ్య వారిస్తూ ''నాలుగురోజులుపాటు నిన్ను ఫోన్ ముట్టుకోవద్దన్నానా?'' అంటూ తనే ఫోన్ అందుకున్నాడు. అతనూహించినట్టుగా ఆ ఫోన్ సింధుజనుంచే.

''హలో... ప్రభాకర్‌గారున్నారాండీ'' ఎంతో ఆతృతగా అడిగింది సింధుజ.

''లేరమ్మా, హైదరాబాద్ వెళ్ళేరు. నాలుగురోజులదాకా రారు. అక్కడ ఏ హొటల్లో దిగేడో, లేక వాడి స్నేహితుల యింట్లో దిగేడో మాకు తెలీదు. నేను వాళ్ళింట్లో పనివాణ్ణమ్మా. పెద్దయ్యగారు కూడా వూళ్ళో లేరు'' అంటూ ఠక్కుమని ఫోన్ పెట్టేశాడు.

''నేను యింట్లో వున్నానని తెలిస్తే బెయిలు యివ్వడానికి నన్ను రమ్మంటారేమోనని అట్టా చెప్పేశాను'' అంటూ మట్టయ్య ఏదో విజయం సాధించినట్టుగా నవ్వేడు. అంతలా కాకపోయినా, ప్రభాకర్ కూడా ఓమాదిరిగా నవ్వి వూరుకున్నాడు.

★ ★ ★





సింధుజ బయటపడ్డానికున్న ఆఖరి అస్త్రం కూడా చెయ్యిజారిపోయినట్టయింది. తను సుడిగుండంలో చిక్కుకుని, గిలగిల్లాడుతున్న సమయంలోనే ప్రభాకర్ వూళ్ళో లేకుండా పోవాలా? భగవంతుడు యింత అగ్నిపరీక్ష ఎందుకు పెట్టేడు? పోలీసులు, పోలీస్ స్టేషన్లు, కోర్టుల గురించి తను వార్తల్లో చదవడం, సినిమాల్లో చూడ్డమేతప్ప, వాటితో తనకి స్వానుభవం లేదు. అటువంటి అవసరాలు వస్తాయని, ఆ అనుభవాలు కలుగుతాయని తానెన్నడూ ఊహించలేదు. లాకప్ డెత్‌లు, పోలీస్ స్టేషన్లో మానభంగాలు యింకెన్నో పోలీసు అత్యాచారాలు... యివన్నీ గుర్తొచ్చి ఆమెలో కంపనం ఆరంభమయింది. ఆమె క్షణక్షణానికీ చలించడం, చంద్రమౌళి గమనిస్తూ చాటుగా నవ్వుకున్నా ఆమెముందు జాలి, సానుభూతే ప్రదర్శిస్తూ మాట్లాడాడు. కూల్ డ్రింకు తెప్పించాడు. మధ్యాహ్నం బిర్యానీ పొట్లం తెప్పించేడు. సింధుజకి అప్పుడు గుర్తొచ్చింది. తను యిలా అరెస్టయిన విషయం తన తండ్రికి తెలిస్తే ఎవరిచేతయినా బెయిల్ యిప్పించి విడుదల చేయిస్తాడేమో! తన తండ్రి అవిటివాడు, పైగా ఈ ఊరికి కొత్త! అతనికి ఎవరూ తెలియదు. అలాంటప్పుడు ఎవర్ని అడుగుతాడు? అడిగినా ఎవరు సాయంచేస్తారు? అనే ఆలోచన మళ్ళీ వచ్చింది. ఏమో తన అదృష్టం బాగుండి ఎవరైనా సాయం చేస్తారేమో...

చంద్రమౌళిని రిక్వెస్ట్ చేసింది, రిక్వెస్టంతా విన్నాక అతను చాలా సిన్సియర్‌గా ముఖంపెట్టి, "స్త్రీజాతి ఆత్మగౌరవాన్ని కాపాడ్డానికి నేనెప్పుడూ సిద్ధమే. నువ్వింతగా బాధపడుతున్నావంటే నేను జాలితో కరిగిపోతున్నాను. కానీ నేను కర్తవ్యబద్ధుణ్ణి కావడంవల్ల నేనేమీ చెయ్యలేకపోతున్నాను. మీ యింటి ఫోన్‌నెంబరు చెప్పు" అంటూ ఫోన్ అందుకున్నాడు.

"మాకు ఫోన్ లేదండి"

"చూసేవామరి... యింత అందమైన అమ్మాయికి సొంతంగా ఓ ఫోన్ లేదు. సరే! మా రూల్సుకి విరుద్ధమైనా ఓ చిన్న సాయం చేస్తాను. మీ యింటి ఎడ్రస్ చెప్పు. మా కానిస్టేబుల్ని పంపించి, మీ నాన్నగార్ని పిలిపిస్తాను" అంటూ ఓ కానిస్టేబుల్ని పిలిచేడు.

సింధుజ ఎడ్రస్ చెప్పింది. "వెంటనే వెళ్ళి ఆయన్ని ఆటోలో తీస్కురా" అంటూనే చంద్రమౌళి సింధుజ చూడకుండా కానిస్టేబుల్‌కి కన్నుకొట్టేడు.

ఓ అరగంట తర్వాత కానిస్టేబులు వచ్చేడు. చెమటల్ని రుమాలుతో తుడుచుకుంటూ, "ఆ యింటికి తాళం వేసుందండి. పొరుగింటి వాళ్ళని అడిగాను. అందరూ కలిసి ఎక్కడికో వెళ్ళేరట. కానీ, ఎక్కడికి వెళ్ళేరో తెలియదన్నారు. ఎప్పుడొస్తారో తెలియదన్నారు" అన్నాడు.

సింధుజ ఆశ్చర్యపోయింది. "మా యింట్లో వాళ్ళందరూ కలిసి ఒకేసారి ఎక్కడకీ వెళ్ళరండి" అంది.

"అంటే నేను అబద్ధమాడుతున్నానా?" కానిస్టేబులు చిరాగ్గా అన్నాడు.

"కాదుసార్... ఒకవేళ మీరు రాంగ్ ఎడ్రస్‌కెళ్ళేరేమోనని..." కానిస్టేబుల్ యిందాక ఆమె చెప్పిన ఎడ్రస్‌నే మరోసారి చెప్పి "యిదేకదా మీరు చెప్పిన ఎడ్రస్. అక్కడికే వెళ్ళేను"

కానిస్టేబుల్‌ని పంపించేసి చంద్రమౌళి సెల్‌దగ్గరకొచ్చి, వీలున్నంతగా జాలి నటిస్తూ, "సారీ సింధుజా, యింతకంటే నేనేమీ చెయ్యలేను" అన్నాడు.

సింధుజ సెల్‌లోనే కూలబడిపోయి ఏడ్చింది. కానిస్టేబుల్ అబద్ధం చెప్తున్నాడో, లేక, ఎన్నడూలేనివిధంగా తన యింట్లోనివాళ్ళంతా ఎక్కడికైనా వెళ్ళేరో! ఎవరికీ ఎప్పుడూ ఏ అన్యాయం చెయ్యని తనకెందుకింత దారుణం జరిగింది? తనని ఎవరూ రక్షించరా. రేపేం జరుగుతుంది? కోర్టులో తనకి జరిమానా విధిస్తారా? లేక, జైలుశిక్ష విధిస్తారా? ఏ నేరానికి ఏ శిక్ష విధిస్తారో తనకి తెలియదు. ఒకవేళ జైలుశిక్ష విధిస్తే, సినిమాల్లో జైళ్ళని, అక్కడున్న ఖైదీల దయనీయ పరిస్థితుల్ని చూసింది. రేపట్నించి తన బ్రతుకూ అలాగే వుంటుందా? అసలు నన్ను యిలా వ్యభిచారిగా ముద్రవేయాలనే, నీచ నికృష్టపు ఆలోచన ఎవరికొచ్చింది? నన్ను హోటల్‌కెళ్ళమని చెప్పిన హనుమంతరావు అంతలోనే శెలవు పెట్టి ఎందుకు వెళ్ళిపోయినట్టు? వాడూ, భానుమూ

ర్తిగాడూ స్నేహితులా? వాడి సాయంతో మూర్తి నన్ను హొటల్‌కి రప్పించాలని ప్లాన్ వేశాడా? అదే నిజమైవుంటుంది. అయితే గుడ్డిలో మెల్ల లాగ, అదే టైముకి పోలీసులు రైడ్‌చేసి భాను మూర్తివల్ల అత్యాచారం జరక్కుండా ఆపుచేశారు. ఔనూ... అసలు, పోలీసులకి ఎవరు ఫోన్‌చేసినట్టు?... అన్నీ ప్రశ్నలేతప్ప ఏ ఒక్కదానికీ సమాధానం దొరకడంలేదు. ప్రభాకర్ హైదరాబాద్‌నించి వచ్చేక జరిగిందంతా విని, నేను నిర్దోషినని నమ్ముతాడా నమ్మడా? 'నమ్ముతాడు, అతను చాలా మంచి మనిషి' అంటూ తనే సమాధానం చెప్పుకుంది.

ఇనస్పెక్టర్ చంద్రమౌళికి ప్రస్తుతం ఆడుతున్న నాటకం సంతోషంగా, సరదాగానే వుంది. అతనుఎంతోమంది నేరస్థులతో డీల్‌చేశాడుగాని, అందులో ఏ ఒక్కడిమీదా జాలి చూపించలేదు, కనీసం జాలి నటించలేదు.

ఇప్పుడు సింధుజమీద తను జాలి నటించడం, దాన్ని ఆ అమ్మాయి అమాయకంగా నమ్మడం... తమాషాగానే వుంది. కాకపోతే అతనికి చిరాకు కలిగించిన విషయం ఒకటుంది. సింధుజలాంటి అందమైన అమ్మాయిలు నీతులు, నియమాలంటూ మడికట్టుక్కూర్చోడంకంటే, ఆ అందాల్ని ఏదో ఓ రేటుకి అద్దెకిస్తే, తనలాంటి ఎంతోమంది రసికులకి ఆనందం కలుగుతుంది. ఆ అందగత్తెలకీ చాలా డబ్బు వస్తుంది. కానీ సింధుజ మరీ మడిగట్టుకున్న మంచి మనిషి కావడమే అతనికి చిరాకు కలిగించింది. పోలీస్‌స్టేషన్లో తనేం చేసినా తనకి ఎదురులేదు. సింధుజని ఆ వెనక రూమ్‌లోకి తీసుకెళ్లి రేప్‌చేయ్యొచ్చుగాని... ప్రభాకరూ, వాడి తండ్రీ సింధుజని అరెస్టుచేసి, కోర్టుకి తీసుకెళ్ళడం వరకే రిక్వెష్టు చేశారు. తను అంతకు మించి ప్రొసీడ్ అయితే వాళ్ళూ బాధ పడొచ్చు. కేసుగనక అల్లరైతే కొత్తగా వచ్చిన యస్పీ ఉషారాణి తనమీద ఏక్షన్ తీసుకున్నా తీస్కోవచ్చు. ఆవిడ ఆడదన్నమాటేగాని, అన్యాయం జరిగినప్పుడు ఆటంబాంబులా పేలుతుంది. సింధుజ విషయం కోర్టుకేసు ముగిసిపోయి, కాస్త చల్లబడ్డాక డీల్ చెయ్యాలని నిర్ణయించుకున్నాడు.

★ ★ ★

ప్రతిరోజూ అయిదున్నర, ఆరు గంటలమధ్య ఆఫీసునించి యింటికొచ్చే సింధుజ ఆరోజు ఏడుగంటలు దాటుతున్నా రాకపోయేసరికి ఆదినారాయణలో ఆందోళన మొదలయింది. బస్సులు దొరక్క లేట్ అయిందేమోనని కాస్సేపు అనుకున్నాడు. కానీ, ఏడున్నర దాటేక అలా సరిపెట్టుకోలేకపోయేడు. ఎనిమిదీ, ఎనిమిదిన్నర దాటేసింది. అనసూయమ్మ అంతవరకు ఏవేవో స్వగతాలు పలుక్కున్నా యిప్పుడు తన అనుమానాన్ని బయటపడేసింది.

"ఆరోజేమో నాకూ పెళ్ళి కావాలి, నాకు మాత్రం మొగుడొద్దని మన ముఖమ్మీదే చెప్పింది. తర్వాతో కుర్రాణ్ణి తీసుకొచ్చి, యిదిగో యితన్నే నేను ప్రేమించేను, యితన్నే నేను పెళ్ళాడతాను, మీ చావు మీరు చావండీ అని చెప్పుతో కొట్టినంత ఖచ్చితంగా చెప్పింది. యిప్పుడా కుర్రాడితో ఏ లాడ్జీలోనో దుకాణం పెట్టేసింది"

ఆదినారాయణ ఛర్రుమంటూ లేవబోయినా, లేవలేక పోయేడు. "నోరుముయ్... నా కూతురు అలాంటిది కాదు" అంటూ అరిచాడు.

"మీ కూతురేంటి నా కూతురేంటి? పెద్దలంటే భయమూ భక్తీ లేనివాళ్లు ఎంతకైనా తెగిస్తారు. నాకు కాబోయే మొగుడు యిదిగో అంటూ చూపించినప్పుడు మీరేం చెయ్యగలిగారు? యిప్పుడు నేను నా కాబోయే మొగుడితో సరదాగా లాడ్జీలో గడిపొచ్చేనంటే ఏం చెయ్యగలరు?"

ఆవిడ నోరునొక్కడం సాధ్యం కాదని, సింధుజని వెదకడానికి రెండు కర్రలూ చంకలో పెట్టుకుని వీధిలోకి నడిచాడు ఆదినారాయణ. సింధుజ పనిచేసే ఆఫీసూ తెలియదు, అక్కడ పనిచేసేవాళ్ళతో పరిచయాలూ లేవు. ఎవర్నని అడగడం? ఓ రెండు గంటలసేపు పిచ్చిగా తిరిగి, యింటికి చేరుకున్నాడు. సింధుజ అప్పటికీ రాలేదు. అనసూయ సణుగుడు మరింత ఎక్కువయింది.

★ ★ ★





మర్నాడు వుదయం సింధుజని కోర్టుకి తీసుకెళ్ళేముందు చంద్రమౌళికి డౌట్ వచ్చి, ''జరిమానా కట్టడానికి నీ దగ్గర డబ్బుందా? సాధారణంగా మూడు వందల్నించి, అయిదు వందలదాకా వేస్తుంటారు'' అన్నాడు. సింధుజ దగ్గర నలభై రూపాయిలున్నాయి. మా యింటికి కబురుచేస్తే మా నాన్న తీసుకొస్తాడని చెప్పింది. చంద్రమౌళి యీసారి కానిస్టేబుల్‌ని నిజంగానే సింధుజ యింటికి వెళ్ళి రమ్మన్నాడు. తర్వాత సింధుజకి, ఓ కాఫీ తెప్పించి, యిచ్చి, ఆమెకేదో హితవు చెప్తున్నట్టుగా అన్నాడు- ''చూడు సింధూ, నీ హితవు కోరి చెప్తున్నాను. నువ్వేమో, యీ గొడవేం నాకు తెలీదు, నేను అమాయికురాలినీ అంటున్నావు. మేమేమో, మా రైడింగులో రెడ్ హేండెడ్‌గా దొరికావని ఛార్జ్‌షీటు రాశాం. నువ్వు కోర్టులో తప్పుచేశానని ఒప్పేసుకుంటే, ఏదో కాస్త జరీమానా వేసి వదిలేస్తారు. అలా కాకుండా నువ్వు నీ కథంతా కోర్టులో చెప్పేవనుకో, అది వేరే కేసుకింద టేకప్ చేస్తారు. ఆ తర్వాత లాయర్ని పెట్టి వాదించడాలు, సాక్ష్యాలు, వాయిదాలు, యివన్నీ మొదలై, నీ కేసు ఏ సంవత్సరమో, సంవత్సరన్నరో లాగేస్తుంది. ఇప్పుడు నీ విషయం కొంతమందికే తెల్సింది. కానీ ఆ కేసు మొదలయ్యేక వూరంతా తెల్సిపోతుంది. అంచేత ఏది మంచిదో నువ్వే ఆలోచించుకో''

సింధుజ భోరుమని ఏడవబోయింది గాని ఏడుపు రాలేదు. నిన్న వుదయం పదకొండు గంటల్నించి ఏడుస్తూనే వుండడంవల్ల రాత్రంతా నిద్ర లేకుండా మేల్కొనే వుండడంవల్ల కళ్ళలో నీళ్ళు యింకిపోయి, ఏడుపు రావడంలేదు. చెయ్యని నేరాన్ని ఒప్పుకోడానికి అంతరాత్మ అంగీకరించడంలేదు. ఒప్పుకోకపోతే కేసు నడుస్తుంది. మరింత అల్లరవుతుంది. అప్పుడు కూడా తన నిర్దోషిత్వం నిరూపణవుతుందనే నమ్మకంలేదు.

కోర్టుకి ఆదినారాయణ వచ్చేడు. కూతుర్ని మిగతా బ్రోతల్ అమ్మాయిల్తో కలిపి తీసుకురావడంచూసి, కోర్టువరండాలోనే భోరుమంటూ ఏడ్చేసాడు. నిన్న యింటికి వెళ్ళిపోయిన భానుమూర్తి కూడా కోర్టుకి హాజరయేడు. నిన్న రాత్రి రైడింగులో దొరికిన అమ్మాయిల్తోనే సింధుజని కూడా నిలబెట్టేరు. వాళ్ళ పేర్లు పిలిచారు. నేరం చేశావా? అని జడ్జిగారు అడిగారు. ఈ ప్రశ్న వేయడం కొత్త కాదు కాబట్టి చాలా యధాలాపంగానే అడిగారు. అలవాటు పడిపోయిన మనుషులు కాబట్టి చేశామండి అనేస్తున్నారు. సింధుజనీ అలాగే అడిగారు. అంతరాత్మ ఆవేశపడుతున్నా, దాన్ని అదుపులో పెట్టుకుంటూ ''చేశానండి'' అనేసింది. నాలుగు వందలు జరిమానా విధించేరు. ఆదినారాయణ జరిమానా చెల్లించి, రశీదు తీసుకోడానికి వెళ్ళేడు. సింధుజ కోర్టు వరండాలో నిలబడింది. భానుమూర్తి సిగరెట్ కాలుస్తూ అక్కడ కొచ్చేడు. ఆమెవైపు గర్వంగా, వెటకారంగా చూస్తూ సిగరెట్ పొగని ఆమె ముఖంమీదకి వదిలేడు.

''చూసేవా ఆడదీ, మగాడూ పోటీ పడితే, గెలుపు ఎప్పుడూ మగాడిదే అవుతుందని మరోసారి నేను నిరూపించాను. ఆనాడు నేను చెప్పినట్టు నువ్వు వినుంటే యీపాటికి నీకు చాలా డబ్బూ దక్కేది, ఆ రహస్యం మన యిద్దరి మధ్యనే వుండేది. కానీ, అప్పుడు పెద్ద పతివ్రతలా పోజు కొట్టేవు. నన్ను చెప్పుతో కొట్టి, అదేదో పెద్ద ఘనకార్యంలా ఫీలయ్యేవు. కానీ యిప్పుడేం అయింది? ఒంటిమీద పడ్డ దెబ్బ ఓర్చుకుంటే పోతుంది. కానీ, నేను నీ జీవితంమీద కొట్టిన దెబ్బ నువ్వు చచ్చేదాకా మచ్చగానే మిగిలిపోతుంది. ఇదంతా జస్ట్ డ్రామా, నిన్ను వ్యభిచారిగా ముద్రవేసి, వదిలెయ్యడానికి ఆడిన నాటకంలో నన్ను ప్రధాన పాత్ర వెయ్యమన్నప్పుడు, నేను సంతోషంగా ఒప్పుకున్నాను. ఎందుకో తెలుసా? నన్ను తిరస్కరించిన ఆడది ఎలా రెక్కలు తెగిన పక్షిలా నేలకూలుతుందో నిరూపించే అవకాశం దొరుకుతోందన్న సంతోషంతో ఒప్పుకున్నాను. ఇదంతా నాటకమని నేను కోర్టువరండాలో నిలబడి చెప్తున్నాను. అయినా నువ్వు నన్నేం చెయ్యలేవు. ఈ సంగతి ఆ ఇనస్పెక్టరు చంద్రమౌళికి చెప్పి నన్నేమైనా చెయ్యగలవా? ఏమీ చెయ్యలేవు. ఎందుకంటే వాడూ నేనూ ఫ్రెండ్సుం. ఈ నాటకంలో వాడూ భాగస్థుడే! అందుకే వాడు నిన్ను మాత్రం అరెష్టుచేసి,

నన్ను వదిలేసాడు. ఛార్జ్‌షీట్లో వాడు నిన్ను అప్సరా హెూటల్లో నాతో వుంటుండగా అరెస్టు చేశానని రాయలేదు. మస్తాన్‌గాడి బ్రోతల్ హౌస్‌లో దొరికేవనిరాశాడు. అదంతా నా సేఫ్టీ కోసం! కోర్టులో నేరస్థురాలినని నువ్వే ఒప్పుకుని జరిమానా కట్టేవు కాబట్టి నిన్ను వుద్యోగంలో నించి డిస్మిస్‌చేస్తారు. నీలాంటి బ్రోతల్‌ని ఏ వెధవా పెళ్ళి చేస్కోడానికి ముందుకిరాడు. యిప్పుడు నువ్వు డబ్బు సంపాదించాలంటే, నువ్వు మాంచి యిల్లు అద్దెకు తీస్కుని ప్రైవేట్ ప్రేక్టీసు పెట్టుకోవడం తప్ప మరో మార్గంలేదు. అలాంటి ప్రేక్టీసు పెడితే చెప్పు, నీ మీదింకా మోజు తగ్గలేదు కాబట్టి, మొదటి బోణీ నేనే చేస్తాను'' అంటూ నవ్వుకుంటూ వెళ్ళిపోయేడు.

సింధుజ యీ వెటకారాన్ని అతన్నించి వూహించిందే! కాకపోతే యీ నాటకంలో ఇన్‌స్పెక్టరు చంద్రమౌళి కూడా ఓ భాగస్థుడేనన్న విషయమే ఆమెకిప్పుడు కొత్తగా తెలిసింది. పైగా, వీళ్ళిద్దరి చేతా మరెవరో యీ నాటకం ఆడించేరన్నది స్పష్టంగా తెలుస్తోంది. కానీ, ఆ వ్యక్తి ఎవరో ఆమె ఆలోచనకి అందడంలేదు. ఆదినారాయణ జరిమానా కట్టేసి వచ్చేడు. కూతుర్ని తీస్కుని ఆటోరిక్షాలో యింటికి బయలుదేరాడు.

★ ★ ★

ఆటో సింధుజ యింటిముందు ఆగింది. ఆమెను పోలీసులు అరెస్టుచేసి, కోర్టుకి తీసుకెళ్ళారన్న వార్త వుదయం కానిస్టేబులు మోసుకొచ్చినప్పుడే, ఆ విషయం ఆ వీధి అంతా ప్రాకిపోయింది. అందుకే సింధుజ ఆటో దిగేసరికి చాలామంది జనం అక్కడా అక్కడా నిలబడి, ఏం జరుగుతుందాని ఆ యింటివైపే ఆసక్తిగా చూస్తున్నారు.

అందరూ అనుకున్నట్టుగా, ఆదినారాయణ అనుకోనట్టుగా అనసూయమ్మ సింధుజని యింట్లోకి రానివ్వలేదు. సింధుజ మీద ఆమెకే మాత్రమైనా అభిమానం వుందంటే, అది కేవలం సింధుజ నాలుగు రాళ్ళు సంపాదిస్తోందనే! కానీ, యిప్పుడు జరిగిన సంఘటనవల్ల ఆమెకు వుద్యోగం పోతుంది. అలాంటి బ్యాడ్ రిమార్కు పడ్డాక మళ్ళీ ఎక్కడా ఆమెకు వుద్యోగం యివ్వరు. యీ రెండు విషయాలూ అనసూయమ్మకి తెలుసు కాబట్టే, ఆదినారాయణ కోర్టుకి బయలుదేరుతున్నప్పుడే అనసూయ ఓ నిర్ణయానికొచ్చేసింది. వుదయంనించి మబ్బుగా వుండి, ఓ పది నిమిషాలనించి సన్నగా తుంపర ఆరంభమయినా, చాలామంది ఆ తుంపరని కూడా లక్ష్యపెట్టకుండా, యిక్కడ జరిగేచోద్యం చూస్తూ నిలబడ్డారు.

"ఆ బజారుముండ నా యింట్లోకి అడుగు పెట్టడానికి వీల్లేదు'' అనసూయమ్మ బిగ్గరగా అరిచింది.

"నేనేం తప్పు చెయ్యలేదు పిన్నీ'' దుఃఖాన్ని అదుపులో పెట్టుకుంటూ మెల్లగా గొణిగింది.

"తప్పు చెయ్యకపోతే కోర్టులో జరీమానా ఎందుకు కట్టేవు? నీతో వాదించడానికి నేను లాయర్నీ కాదు, యిది కోర్టూ కాదు. నువ్వు మంచిదానివో చెడ్డదానివో కోర్టే తేల్చినప్పుడు కాదంటానికి నేనెంత? నా బతుకెంత?'' అనసూయ రెచ్చిపోతూ కేకలు వేసేసరికి ఆదినారాయణ సహించలేక "నువ్వు నోర్మూస్కుని లోపలకిపదా'' అని అరిచాడు.

"మీరే నోర్మూస్కుని లోపలకి నడవండి. యిలాంటి భడాచోర్ పనే గనక నా కూతురు చేసుంటే దాన్ని యిక్కడికిక్కడే కత్తికో కండ కింద నరికేసేదాన్ని. కానీ యిది నా కన్నకూతురు కాకపోయింది. యిన్నాళ్ళూ యిదెంత పేట్రేగిపోయి పేలినా, యిది సంపాదించే జీతం నా నోరునొక్కేసింది. కానీ, యిదిప్పుడు పడుపువృత్తి చెయ్యడానికి తప్ప మరెందుకూ పనికిరాదు. ఇలాంటి తిరుగుబోతు నాయింట్లో వుంటే, నా కూతురికి పెళ్ళవదు. నా యింటిపరువు పెంటమీద పడ్డం నేనొప్పుకోను...! యీ రోజునించి మీకిది పుట్టలేదనుకోండి- పుట్టినా, నిన్న పొద్దుట దానికేదో ఏక్సిడెంటయి చచ్చిందనుకోండి...''

అనసూయమ్మని అదుపులో పెట్టడానికి ఆదినారాయణ శక్తి చాల్లేదు. అతన్ని అనసూయ, రేవతి పట్టుకుని బరబరమంటూ యింట్లోకి లాక్కొచ్చి ఓ గదిలోకి నెట్టి గడియపె




ట్టేరు. లోపలకి రాబోతున్న సింధుజని అనసూయ జుట్టుపట్టుకుని బయటకి ఈడ్చేసింది.

"నన్ను యింట్లోకి రావద్దంటే నేనెక్కడకి పోతాను పిన్నీ నాకు మీరు తప్ప మరెవరువున్నారు పిన్నీ నేనే నేరం చెయ్యలేదు పిన్నీ" అంటూ సింధుజ ఎంత ఏడుస్తూ మొరపెట్టుకున్నా ఆమె వినకుండా బయటకి గెంటేసి, తలుపులు మూసేసింది. అప్పటికి వర్షం బాగా ఎక్కువైంది. అయినా జనం అక్కడున్న యిళ్ళ వరండాల్లో నిలబడి చోద్యం చూస్తూనే వున్నారు. గదిలోకి నెట్టివేయబడ్డ ఆదినారాయణ తలుపులు బాదుతూ అరుస్తూనే వున్నాడు. అయినా అనసూయ చలించలేదు. బయటనించి సింధుజ తలుపు కొడుతూ, ప్రాధేయపడుతోంది. ఆ మాటలు, ఆ శబ్దాలు తనకి వినిపించనట్టే వూరుకుంది.

సింధుజకేం చెయ్యాలో, యిప్పుడు ఎక్కడికి వెళ్ళాలో అర్థంకాలేదు. నిన్న వుదయంనించి యిప్పటిదాకా ఒక రకమైన నరకాన్ని అనుభవించి వస్తే, యిప్పుడు అంతకంటే పెద్ద నరకం అనుభవంలోకొచ్చింది. చేతిలో పర్సు, అందులో నలభై రూపాయిలు తప్ప, ఆమె దగ్గర మరేమీ లేవు. వర్షం ధారాపాతంగా కురుస్తోంది. సింధుజ ఎదురింటి వరండాలో నిలబడదామని అటువైపు రెండడుగులు వేసింది. వాళ్ళు గబగబా యింట్లోకి వెళ్ళిపోయి తలుపులు మూసేశారు. సింధుజ తమ యిళ్ళల్లోకి అడుగుపెడుతుందేమోనని భయపడి మిగతావాళ్ళూ ముందుచూపుతో తలుపులు మూసేసుకున్నారు. వాళ్ళతో సింధుజకి పెద్దగా పరిచయంలేదు. తను యిరుక్కున్న నేరంలోని నిజానిజాలు వాళ్ళకి తెలియవు. అయినా తనవాళ్ళే యింటినించి గెంటేసి, తలుపులు మూసినప్పుడు పరాయివాళ్ళెందుకు తలుపులు తెరచి ఆశ్రయం యిస్తారు?

వర్షంలో తడుస్తూనే సింధుజ అక్కడనించి కదిలింది. ఆఫీసులో పనిచేసే వనజ యిల్లు తనకి తెలుసు. ఆ యింటికి వెళ్ళింది. ఆరోజు ఆదివారం కాబట్టి వనజ యింట్లోనే వుంది. "రండి, కూర్చోండి" అంటూ కూర్చోబెట్టి, తడిసిపోయిన తలని తుడుచుకోడానికి తువ్వాలు యిచ్చింది. అంతలోనే ఆమె భర్త వచ్చేడు. "ఈవిడ సింధుజ, నా కొలీగ్" అంటూ పరిచయం చేసింది. "అంటే, నిన్న నువ్వు చెప్పింది యీవిడ గురించేనా?" అంటూ సింధుజ అక్కడ వుండడానికి తిరస్కరించాడు. సింధుజ తను అమాయకురాలినని మొరపెట్టుకుంది "చూడండి... మీరిక్కడ ఎంతసేపుంటారు? ఎన్నాళ్ళుంటారు? మీ వాళ్ళే మిమ్మల్ని యింటినించి గెంటేసినప్పుడు, మీకు మేమే కాదు, ఎవరు మాత్రం ఆశ్రయం యిస్తారు? మీరు నిజంగా నిర్దోషులే అయితే ఆ విషయం నిరూపించుకోండి. మీ జీవితంతో చెలగాటాలాడినవాళ్ళని బయటకీడ్చి అందరి ముందూ నిలబెట్టండి. అయితే యిది సినిమాల్లో జరుగుతుంది. కాని నిజజీవితంలో జరగదు. జరిపించడానికి మీరు ఆడవాళ్ళు. మీరేం చెయ్యగలరు?"

సింధుజ ఆ యింటినించి బయటకొచ్చింది. తను నిర్దోషినని నిరూపించుకోవాలంటే ఏం చెయ్యాలి? ఎవరు తనకి సాయపడతారు? ఎవరు? ఎవరు? ఎవరు?

సింధుజ నడక ఆగింది. ఆమె మస్తిష్కంలో మెదిలిన ఓ వ్యక్తే ఆమె నడకని ఆపింది. ఔను... మధులత ఆంటీయే తనని కాపాడాలి. లాయర్ మధులత ఆంటీ! సింధుజ వడివడిగా నడిచింది. యస్.టి.డి. స్టాల్ దగ్గరకెళ్ళింది.

"నాకు గుంటూరు యస్.టి.డి. కాల్ కావాలి. నా దగ్గర నలభై రూపాయిలు వున్నాయి. కాల్ ఛార్జీకి అది చాలదు. మిగిలింది మా ఆంటీ రాగానే యిస్తాను. ఒకవేళ నా మీద నమ్మకం లేకపోతే, యీ వాచీ మీ దగ్గరుంచండి. ఆంటీ రాగానే విడిపించుకుంటాను" అంటూ చేతివాచీ విప్పియిచ్చింది.

అతను సింధుజనోసారి నిశితంగా చూశాడు. "ఫర్వాలేదు. డబ్బులు తర్వాత యిద్దరుగాని, మీరు ఫోన్ చెయ్యండి" అంటూ ఫోన్ డయల్‌చేసి అందించాడు. అదృష్టవశాత్తు మధులతే ఫోన్ అందుకుంది. సింధుజ జరిగిందంతా వివరించింది. గుండెలో కళపెళమంటూ సుళ్ళు తిరుగుతున్న ఆవేశాన్ని ఆందో

శనని, ఆవేదనను అదుపులో పెట్టుకుంటూ చెప్పవలసిందంతా చెప్పింది. "నువ్వు వెంటనే బయలుదేరి రావాలి. వచ్చేవరకూ నేను యీ యస్.టి.డి. స్టాల్‌దగ్గరే కూర్చుని వుంటాను" మధులత వెంటనే బయల్దేరి వస్తానని, మరేమీ కంగారు పడవద్దని చెప్పింది. చెప్పినట్టుగానే మధులత వెంటనే విశాఖపట్నం బయలుదేరింది.



మధులత యిప్పుడు గుంటూరులో పేరు మోసిన లాయర్‌గానే చాలామందికి తెలుసు కానీ, గతంలో ఆమె చరిత్ర దాదాపు ఎవరికీ తెలియదనే చెప్పాలి. ఆమె భర్త రంగనాథరావు విజయవాడలో లాయరు వృత్తి చేస్తుండేవాడు. కానీ అతని దృష్టి లాయరు వృత్తి మీద లేదు. కోర్టులో వున్న పాతిక లక్షల ఆస్తి వివాదం మీద వుంది.

మధులత తండ్రి వెంకట్రావుకి రావల్సిన పాతిక లక్షల ఆస్తి మీద అతని దాయాదులు కేసు వేశారు. ఆ ఆస్తి ఎట్టి పరిస్థితుల్లోనూ వెంకట్రావుకే వస్తుందని రంగనాథరావు నమ్మకం. వెంకట్రావుకి మధులత ఒక్కతే కూతురు కాబట్టి, ఆ ఆస్తంతా ఆమెకే దక్కుతుంది.

ఆ ఆశతోనే పైసా కట్నం అడగకుండా మధులతని రంగనాథరావు పెళ్ళిచేసుకున్నాడు. ఆ తర్వాత నాలుగు సంవత్సరాలు కేసు నడిచినా, చివరికా ఆస్తి వెంకట్రావుకి కాకుండా, అతని దాయాదులకే దక్కాలని కోర్టు తీర్పు యిచ్చింది. అప్పటికే రక్తపోటు, గుండె జబ్బుతో మంచంమీదున్న వెంకట్రావు తీర్పువిన్న గంటకే కన్నుమూశాడు. తండ్రి చావుతో మధులత తల్లడిల్లిపోతే, రావాల్సిన ఆస్తి రాకుండా పోయిందని రంగనాథరావు కుతకుతలాడిపోయేడు. ఆ క్షణంనించి మధులత అతని కంటికి అక్కరకురాని మనిషిలాగ, తనకి పట్టిన శనిగ్రహంలా కనిపించింది. రెండులక్షల కట్నం యిస్తామంటూ వచ్చిన రెండుమూడు సంబంధాల్ని వదులుకుని, పాతికలక్షలు వస్తాయన్న ఆశతో మధులతని పెళ్ళిచేసుకున్నాడు. కానీ, యిప్పుడు వచ్చిన తీర్పువల్ల తనకెంతో నష్టం వచ్చినట్టుగా బాధపడిపోయేడు. ఈ నష్టాన్ని భర్తీ చేస్కోవాలి. తనకి వయసేం ముదిరిపోలేదు కాబట్టి, లక్షలు తెచ్చే అమ్మాయిని పెళ్ళిచేసుకోవచ్చు. కానీ మధులతని వదిలించుకోవడం ఎలా? అతను లాయరు కాబట్టి ఆ సమస్యకి పరిష్కారం వెంటనే కనిపెట్టగలిగాడు. మధులత పెద్దగా చదువుకోలేదు. హక్కులకోసం మాట్లాడగలిగే శక్తి కూడా లేని అతి సాధారణమైన ఆడది. మేనమామ వరసయిన ఓ దూరపు బంధువు మినహా ఆమెకు మరెవరూ లేరు.

ఓరోజు మధులతని చెకప్‌కోసం రంగనాథరావు ఓ ప్రైవేటు ఆసుపత్రికి తీసుకువెళ్ళాడు. అక్కడున్న లేడీ డాక్టరుకి ముందుగానే చేతులు తడపడంవల్ల, ఆమె మధులతని చెకప్ చేసినట్టు నటించి రంగనాథరావు చెప్పమన్నట్టే చెప్పింది. ఆమె చెప్పినప్రకారం మధులతకి సంతానయోగ్యత లేదు. ఆమెకీ జన్మలో పిల్లలు పుట్టరు. ఆ మర్నాడు రంగనాథరావు ఓ విడాకులపత్రం తీసుకొచ్చి మధులతకిచ్చేడు. "చూడు మధూ! నా వంశాభివృద్ధికోసం నాకు సంతానం కావాలి. కానీ ఆ యోగ్యత నీకు లేదు కాబట్టి, నేను మరో పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. సంతానయోగ్యత లేని భార్యకి, ఆమె భర్త విడాకులు యివ్వొచ్చునని చట్టంలోనూ వుంది. ఒకవేళ నా నిర్ణయాన్ని సవాల్‌చేస్తూ నువ్వు కోర్టుకెక్కినా, తీర్పు నాకు అనుకూలంగానే వస్తుంది. కోర్టుకి వెళ్ళాలనుకుంటే నాకు అభ్యంతరంలేదు. అలా చెయ్యడం యిష్టంలేకపోతే నేను మరో పెళ్ళి చేసుకోడానికి నీకు అభ్యంతరం లేనట్టుగా కాగితంమీద




సంతకంపెట్టు'' అన్నాడు.

కోర్టులో తీర్పు వచ్చిందగ్గర్నించి రంగనాథ రావులో వచ్చిన మార్పు ఆమె గమనిస్తూనే వుంది. తన తండ్రి దినకార్యాన్ని కూడా వీలు న్నంత చవకలోనే తేల్చేశాడు. నీ తండ్రివల్ల నాకు పాతికలక్షలు నష్టం వచ్చింది. అతనికి నువ్వు తప్ప మరెవరూ లేరుకదాని ఈ నాలుగే ళ్ళూ నా యింట్లోనే పెట్టుకుని పోషించాను. యిప్పుడాయన చచ్చేక కూడా చేతిచమురు వదిలించుకోడానికి నేనేం ఫూల్‌ని కాదంటూ దినకార్యం జరిగేరోజున తనతోనే అన్నాడు. ఈమధ్య సుబ్బరామయ్యాగారి కూతుర్ని పెళ్ళి చేసుకునే ప్రయత్నాలు చేస్తున్నాడని తెలి సినా, అతన్ని నిలదీసి అడగలేదు. ఇప్పుడు విడాకులు కోరుతున్నాడు. ఆలెక్కన తనకి సంతానయోగ్యత లేదని డాక్టరు చేత అతనే చెప్పించాడనే విషయం అర్థమయింది. అత నికి కావలసింది డబ్బు! తను యివ్వలేనిదీ డబ్బే! డబ్బుంటేనే తను కావాలి. అది లేదు కాబట్టి తను అక్కర్లేదు. అటువంటప్పుడు తను భార్యస్థానంలో అక్కడున్నా తనది బానిస బ్రతుకే అవుతుంది. అతను అనుకున్నవి ధంగా మరోపెళ్ళి చేసుకుంటాడు. తను అడ్డు పడి ఆపలేదు. భర్తని సాధించవలసింది ప్రే మతోగాని, చట్టాలతో కాదు. అందుకే ఇవన్నీ ఆలోచించి, అతను కోరినట్టే ఆ పత్రంమీద సంతకం చేసింది.

''నువ్వు యికమీదట కూడా ఈ యింట్లోనే వుండొచ్చు. అది నీకు యిష్టంలేకపోతే వేరే యిల్లు అద్దెకు తీసి యిస్తాను. నీ పోషణకి ఎంతో కొంత యిస్తుంటాను'' అన్నాడు రంగనా థరావు పత్రాన్ని మడిచి జేబులో పెట్టు కుంటూ.

మధులత చిన్నగా నవ్వింది. ''నన్ను ఏ హోదాలో యిక్కడ వుండమంటున్నారు? భార్యగానా? పనిమనిషిగానా? వద్దండి. నేను మీ కళ్ళ ఎదుట వుండడం కూడా యికమీదట మీకు యిబ్బందిగానే వుంటుంది. నా భవిష్యత్తే మిటో కాలమే నిర్ణయిస్తుంది. ఈరోజునించి నా విషయం మర్చిపొండి'' అనేసి, ఆ మర్నాడే గుంటూరులో వున్న మావయ్యదగ్గరకి వెళ్ళిపో యింది. అతనిప్పుడు ఆర్థికంగా చితికిపో యినా ఆత్మీయతల విషయంలో పేదవాడు కాదు. అతను స్వాతంత్ర్య సమరయోధుడు. దేశానికి స్వతంత్రమేకాదు, స్త్రీకి పురుషుడితో సమానహక్కులు, గౌరవం కలగాలనే ఆశయం వున్నవాడు కావడంతో ఆరోజునించి మధులతకి అతను గార్డియన్‌గానే కాకుండా, గాడ్‌ఫాదర్‌గా, గైడ్‌గా కూడా మారేడు. ఆమెను చదువుకుని లాయరు అవమన్నాడు. పెళ్ళిచే సుకోమని కూడా చెప్పేడు. ఆమె మొదటిపని చేసింది. రెండోపని చెయ్యనని ఖచ్చితంగా చెప్పేసింది. ఆమె లాయరుగా ప్రాక్టీసు మొద లుపెట్టి తక్కువ టైములోనే ఎక్కువ పేరు సంపాదించుకుంది. కొంతమంది సివిల్‌కేసు లు ఎక్కువ చేయడంవల్ల సివిల్ లాయరని, మరికొంతమంది క్రిమినల్ కేసులు ఎక్కువగా చేసి క్రిమినల్‌లాయర్‌గా పేరుతెచ్చుకుంటా రు. కానీ, మధులత గుంటూరులో లేడీస్‌లా యర్‌గా పేరుతెచ్చుకుంది. పురుషాహంకారాని కీ, అధికారానికి బలైపోతున్న ఆడవాళ్ళ తర ఫున కేసులు టేకప్‌చేసి, వాళ్ళ నిస్సహాయతని నిర్మూలించింది. ''ఇది మా ఖర్మ, ఆడదానిగా పుట్టడమే పాపం, ఆడవాళ్ళం మేం ఏం చెయ్యగలం'' అనుకుంటూ జరిగిన అన్యా యంతో రాజీపడిపోతూ, న్యాయంకోసం పోరాడ లేని చాలామంది పేదస్త్రీలని తనే కలుసు కుని, పైసా ఫీజు తీసుకోకుండా వాళ్ళచేత కేసులు పెట్టించి, విజయాలు కట్టబెట్టింది. కోర్టులో సరైన పరిష్కారం దొరకవనుకున్న కేసు ల్ని, కోర్టుబయటే తన సాహసంతో, చాతు ర్యంతో సాధించింది.

సింధుజ గుంటూరులో వున్నప్పుడు మధు లత యింటికి నాలుగిళ్ళ అవతల వుండేది. చిన్నతనంనించి సింధుజ మధులత ప్రేమా భిమానాలు పొందింది. ''నీకు ఎప్పుడు ఏ యిబ్బంది వచ్చినా ఈ గుంటూరు ఆంటీ నీకోసం వుందనిమాత్రం మర్చిపోకు'' అంటూ సింధుజ ఆ వూర్నించి వచ్చేటప్పుడు ప్రత్యే కించి మరీ చెప్పింది. ఆమె యిచ్చిన భరోసా గుర్తువచ్చే, ధైర్యంచేసి ఫోన్‌చేసింది.

మర్నాడు ఉదయం టాక్సీ వచ్చి సింధుజ నిరీక్షిస్తున్న యస్.టి.డి. స్టాల్‌దగ్గర ఆగింది. అందులోనించి దిగిన మధులతని చూడగానే

సింధుజకి నోటినించి మాటకంటే ముందు కళ్ళనించి నీళ్ళు వచ్చేశాయి. ఆమెను కౌగ లించుకుని ''ఆంటీ'' అంటూ చంటిబిడ్డలా భోరుమంటూ ఏడ్చేసింది.

''ఏడవకు... నేనొచ్చేశాగా. యింక నీకేం భయంలేదు. జరిగిందంతా నువ్వు చెప్పేవు. నీ జీవితంతో చెలగాటాలాడి, నిన్ను వ్యభిచా రిగా ముద్రవేసి, నిన్ను నడివీధిలోకి గెంటించిన వారందరి అంతు నేను తేలుస్తా ను. ఆడదానివి నువ్వేం చెయ్యగలవని హేళన చేసినవాళ్ళందర్ని ఆడది తల్చుకుంటే ఏం చెయ్యగలదో నేను నిరూపిస్తాను. పదా, కారె క్కు'' అంది మధులత. ఆమెనడిగి డబ్బు తీస్కుని ఫోన్ ఛార్జి చెల్లించి, నిన్న రాత్రి అక్కడ పడుకోడానికి అవకాశం యిచ్చి నందుకు ఆ షాపు ప్రొప్రయిటర్‌కి కృతజ్ఞతలు చెప్పి సింధుజ కారెక్కింది.

★ ★ ★

ఆ వూళ్ళో కేశవవర్మగారు ప్రముఖ పారిశ్రా మికవేత్త! ఆయన కూతురికి అల్లుడు అన్యా యంగా విడాకులిస్తున్నప్పుడు లాయర్ మధు లత, ఆ కేసుని కోర్టుకి ఎక్కకుండా, భార్య గురించి తప్పుగా ఆలోచిస్తున్న అల్లుడికి కను విప్పు కలిగించింది. ఆవిధంగా వర్మగారు మధులతకి పరిచితుడు. ఆ వూళ్ళో వున్న ఆయన గెస్ట్‌హౌసుని ఆమె వుండడానికి ఏర్పా టుచేశాడు. సింధుజనించి ఫోన్ రాగానే, ఈ సమస్య పరిష్కరించడానికి తను కొన్నాళ్ళపా టు విశాఖపట్నంలో వుండక తప్పదని భావించి, అక్కడినించే వర్మగారికి ఫోన్‌చేసి చెప్పడంవల్ల, ఆమె ఆ వూరు వచ్చేసరికే బంగళాని శుభ్రంచేయించి, తన యింట్లో పనిచేసే యిద్దరు నౌఖర్లని కూడా ఆమె సపర్య ల నిమిత్తం అక్కడుంచాడు.

''యిదేకాదు లాయరుగారూ, నావల్ల మీకు ఏ సహకారం కావాలన్నా నేను చేస్తాను'' అని భరోసా కూడా యిచ్చేడు. ఓ ఎంబాసిడర్ కారుని డ్రైవరుతోసహా ఆమె అధీనంలో వుంచే డు.

సముద్రానికి ఆనుకుని వున్న బంగళా చూ డముచ్చటగా, వర్మగారి అభిరుచికి అద్దంపట్టే విధంగా వుంది. స్నానాలు, టిఫిన్లు అయ్యేక, సింధుజని కూర్చోబెట్టి, జరిగిందంతా మరో సారి వివరంగా చెప్పమంది. సింధుజ అంతా చెప్పింది. విన్నాక మధులత ఏమీ మాట్లాడ కుండా మౌనంగా వుండిపోయింది. ఓ పావు గంటసేపు ఆలోచించాక, ''నిన్ను వ్యభిచారిగా ముద్ర వేయడంవల్ల ఎవరికి లాభం కలుగు తుంది? ఇంతవరకూ ఈ నాటకంలో పెద్దపాత్ర లు ధరించింది భానుమూర్తి, యస్సై చంద్ర మౌళి, మీ ఆఫీసు సూపర్నెంటు హనుమంత రావు. భానుమూర్తి ఈ నాటకానికి ఎందుకు ఒప్పుకున్నాడో కారణం తెలుస్తూనేవుంది. చంద్రమౌళి, భానుమూర్తి స్నేహితులంటు న్నావు. మరి, హనుమంతరావు వాళ్ళిద్దరికీ స్నేహితుడా? లేక, వీడిది ప్రత్యేకపాత్రో తేలాలి. చూడబోతే వీళ్ళు ముగ్గురూ కేవలం ఈ నాట కంలో పాత్రధారులేతప్ప, అసలు సూత్రధారి మరెవరో వున్నట్టుంది. అదెవరో వూహించగల ను కూడా'' అంది ఆ గదిలో అటూయిటూ తిరుగుతూ.

''ఎవరు?'' సింధుజ ఎంతో ఆసక్తిగా అడి గింది.

''చెప్తాను. ముందు నన్ను కన్ఫర్మ్ చేసుకో నియ్. మన దండయాత్ర యిప్పుడేగా ఆరంభ మయింది'' అంటూ మళ్ళీ ఆలోచనలో పడింది.

★ ★ ★

ఆఫీసు సూపర్నెంటు హనుమంతరావు సాయంకాలం ఇంటికొస్తూనే హాల్లో వున్న మను మల్ని చూసి ఆశ్చర్యపోయేడు.

సోఫాలో సింధుజ, మధులత కూర్చున్నారు. ''మీకోసమే చూస్తున్నాం. కూర్చోండి. ఈ అమ్మా యెవరో మీకు చెప్పక్కర్లేదు. యింక, నా పేరు మధులత'' అంటూ మధులత ఎంతో హుందాగా పరిచయం చేసుకుంది.

సింధుజని చూస్తూనే హనుమంతరావుకి వణుకు పుట్టింది. ఇంక మధులత విగ్రహమే అతనికి చెమటలు పట్టిస్తోంది.

''మీరొచ్చిన పని...'' ఎదుటిసోఫాలో కూర్చుని మెల్లగా గొణిగాడు.

''మేం ఎందుకు వచ్చుంటామో మీరు





వూహించండి చూద్దాం'' అంది మధులత కళ్ళద్దాలు సవరించుకుంటూ.

''ఏమో నాకేం తెలుసు?''

''మీరు సింధుజని అప్సరా హొటల్‌కి ఎందుకు పంపించారు?''

హనుమంతరావు లేచి ''వుండండి కాఫీ తెస్తాను'' అంటూ వెళ్ళబోయేడు.

''అక్కర్లేదు. మీ అమ్మాయి మాకు కాఫీలిచ్చింది. మాకు కావల్సింది మీ సమాధానం. మీకు జవాబు చెప్పడానికిష్టంలేకపోతే చెప్పండి. యిదే ప్రశ్నని మీ ప్రొప్రయిటర్ రఘుపతిగారిచేత అడిగిస్తాను''

హనుమంతరావు ఆమెవైపు భయంభయంగా చూశాడు.

''ఈ ప్రశ్న మీ ప్రొప్రయిటర్‌చేత అడిగిస్తే, అది మీ వుద్యోగం పోగొట్టేదాకా వెళ్తుంది. ఫర్వాలేదు, మీ వుద్యోగం పోయినా నేను బాధపడను. ఎందుకంటే, ఈ అమాయకురాలి జీవితంమీద మీరంతా వేసిన ఆ భయంకరమైన ముద్రకంటే...''

''ప్లీజ్! ఆ పాపంలో నాకు భాగంలేదు. వాళ్ళు చెప్పినట్టే చేశానుతప్ప, ఆ తర్వాత జరిగిందానికీ నాకూ సంబంధంలేదు. అలా జరుగుతుందని కూడా నాకు తెలీదు'' అతను వణుకుతూనే జవాబు చెప్పేడు.

''ఆ పని చెయ్యమని ఎవరు చెప్పేరు?''

''ప్రభాకర్, వాళ్ళ నాన్న మట్టయ్య''

సింధుజ షాక్ తిన్నట్టుగా లేచి నిలబడింది. ''ఏమిటి మీరు చెప్తున్నది?'' అంది.

''నేనూహించింది కరెక్టే సింధూ'' అంది మధులత.

ఆమెవైపు అర్థంకానట్టుగా చూసింది సింధుజ. ''చెప్పండి, అలా పంపించినందుకు మీకెంత డబ్బిచ్చారు?'' మధులత సూటిగా అడిగింది.

''డబ్బేం యివ్వలేదు. స్టార్ హొటల్లో పార్టీ యిచ్చేరు''

''పోనీ, మీచేత ఎందుకలా చెప్పించారో, ఆ విషయమేమైనా చెప్పేరా?''

హనుమంతరావు యిరకాటంలో పడినట్టు చూశాడు.

''చూడండీ హనుమంతరావుగారూ, మీరు చెప్పకపోయినా నేను మరోవిధంగా తెల్సుకోగలను. కానీ, రేపు కోర్టుకొచ్చి సాక్ష్యం చెప్పవలసింది మీరే కాబట్టి...''

''కోర్టేమిటి?'' కంగారుగా అడిగాడు.

''ఓ అమాయకురాలిమీద మీరంతా కలిసి, బురదజల్లి, ఆవిడ భవిష్యత్తుని నాశనం చెయ్యాలని చూస్తే, మీ అందర్నీ కోర్టుకీడ్చి మీ అంతు తేల్చకుండా వదులుతామనుకుంటున్నారా? నిన్నటివరకు సింధుజ ఒంటరిది. బట్ నౌ... లాయర్ మధులత క్లయింటు''

''మీరు... లాయరుగారా?'' అతని నాలిక తడి ఆరిపోయినట్టుగా ఆ మాటల్ని స్పష్టంగా పలకలేకపోయింది.

''యస్... నేను లాయర్నే. మీ అమ్మాయిని యిందాక చూసేను. పెళ్ళి కావలసిన ఆ పిల్లమీద ఎవరైనా వ్యభిచారీ అని ముద్రవేసి, సంఘంలో తలెత్తుకోకుండా చేస్తే అప్పుడు కన్నతండ్రిగా మీరెంత క్షోభిస్తారో వూహించుకుని సమాధానం చెప్పండి. ఒక పూట యిచ్చిన పార్టీకోసం, కొన్ని గంటలపాటు కలిగించే మత్తుకోసం, అందుకు కృతజ్ఞత తీర్చుకోవడంకోసం, ఓ అమాయకురాలి జీవితానికి నిప్పు అంటించారు. ఇల్లు అంటించినవాడితో పాటు వాడికి నిప్పు అందించనవాడూ నేరస్థుడే అవుతాడు హనుమంతరావ్!''

హనుమంతరావుకి తను చేసిన పని యిలా లాయర్లు, కోర్టులుదాకా వస్తుందని తెలియదు. ''నన్ను క్షమించండి మేడమ్. నేను తప్పే చేశాను. ప్రభాకర్‌కి మా ప్రొప్రయిటర్ రఘుపతిగారి కూతుర్నిచ్చి పెళ్ళిచెయ్యడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయట. అందుకు సింధుజ అడ్డుపడుతుందని భయపడి, వాళ్ళు నన్నీ సాయం చెయ్యమన్నారు''

నిజంచెప్పేశాక అతను నెత్తిమీదనుంచి ఏదో బరువు దిగిపోయినట్టుగా ఫీలయ్యేడు.

సింధుజ ఏడుస్తూ సోఫాలో కూలబడిపోయింది. ఇదంతా ప్రభాకరే చేయించాడన్న నగ్నసత్యాన్ని ఆమె ఎందుకో సహించలేకపోతోంది.

మధులత ఆమె భుజంమీద చెయ్యి వేసి, ''ఏడుపు ఏ సమస్యనీ పరిష్కరించదు సింధూ. ఇప్పుడు కావల్సింది ఏడుపుకాదు, యింతవరకూ నీతో ముసుగుమనుషులు యుద్ధంచేశారు. యిప్పుడు ఆ ముసుగులు తొలగిపోయేయి కాబట్టి, యింక ప్రత్యక్షయుద్ధం ఆరంభమవుతుంది. చూడండి హనుమంతరావుగారూ! యిప్పుడు చెప్పిందే రేపు కోర్టులో చెప్పండి. అలా చెప్పడంవల్ల మీ వుద్యోగం పోతుందనుకుంటే, మీరు సింధుజని అప్సరా హొటల్‌కి పంపించకపోతే, వాళ్ళు మీ అమ్మాయిమీద అత్యాచారం చేస్తామని బెదిరించారని చెప్పండి. అప్పుడు మీరు సింధుజకి న్యాయం చేసినట్టూ అవుతుంది. మీ వుద్యోగాన్ని నిలబెట్టుకున్నట్టూ అవుతుంది'' అంటూ అతని అంగీకారంకోసం సూటిగా చూసింది.

''చెప్తానండి... కోర్టులో నిజమే చెప్తాను''

''మరోవిషయం. మేం యిక్కడకొచ్చినట్టుగాని, యీ విషయాలు అడిగినట్టుగాని మీరు ప్రభాకర్‌కి, మట్టయ్యకి చెప్పకండి. కనీసం ఓ రెండురోజులవరకైనా ఈ విషయం మీలోనే వుంచండి'' ఈ మాటని మధులత ఓ రిక్వెస్టులా కాకుండా ఓ ఆదేశంలాగే చెప్పింది.

''చెప్పనండి'' అన్నాడు ఎంతో నమ్మకంగా.

★ ★ ★

సింధుజ గెస్ట్‌హౌస్‌కి వచ్చేకగూడా మౌనంగా వుండిపోయింది. ఆమె ఎందుకు మౌనం వహించిందో మధులతకి తెలుసు. ప్రభాకర్ యింత మోసగాడూ, అవకాశవాదీ అని సింధుజకి యిప్పుడే తెల్సింది. 'అటువంటివాడినా నేను ప్రేమించేను?' అంటూ తనని తానే అసహ్యించుకోనారంభించింది.

''తన పెళ్ళివిషయం నాతో ఒక్క మాట చెప్పివుంటే నా అంతట నేనే అతని దారినించి తప్పుకునేదాన్ని. కానీ అలా చెప్పకుండా నేనే అడ్డువడతానని, యింత దారుణానికి తలపడాలా?''

సింధుజ అడిగిన ప్రశ్నకి మధులత రెండు మూడు నిమిషాలపాటు సీరియస్‌గా ఆలోచించి జవాబు చెప్పింది.

''ఏ బేక్‌గ్రౌండూ లేని నీ గురించి వాళ్ళు అంతలా భయపడ్డం నాకు నమ్మశక్యంగా లేదు. ఆ ప్రభాకర్ రాసిన వుత్తరాలుగాని, నువ్వూ అతనూ కలిసి తీయించుకున్న ఫొటోలుగాని నీదగ్గరున్నాయా?''

''వున్నాయి... ఆరు ఫొటోలూ, నాలుగు లెటర్సూ వున్నాయి''

''బహుశా వాటిని చూపించి నువ్వు అల్లరి చేస్తావని, వాళ్ళు వూహించే ఈ పథకం వేసుంటారు. అవి యిప్పుడు నీదగ్గరున్నాయా?''

''ఇక్కడ లేవు... మా ఇంట్లో బీరువాలో వున్నాయి''

మధులత ఓ క్షణం ఆలోచించి తన లెటర్ పాడ్ తీసి, సింధుజ తండ్రి ఆదినారాయణకి వుత్తరం రాసి, నౌఖర్ని పిల్చి, సింధుజ ఇంటికి కారులో వెళ్లి రమ్మంది.

ఓ అరగంట తర్వాత కారులో ఆదినారాయణ వచ్చేడు. మధులతకి నమస్కరించి ''నా కూతుర్ని తమరు ఆదుకున్నారా తల్లీ!'' అంటూ బావురుమంటూ ఏడ్చేశాడు.

''ఏం చెయ్యమంటారు ఆదినారాయణగారూ! అపనిందలు ఆడవాళ్లకి వాళ్ల నీడలంత దగ్గరగా అతుక్కుపోయేయి. అపనిందలు, అగ్నిపరీక్షలు ఆనాటి సీత దగ్గర్నించి, మీ కూతురు సింధుజ వరకూ వస్తూనే వున్నాయి. కాకపోతే ఆనాడు సీతనే ఆడదానికి రాముడనే ఒక మగవాడు భర్త హొదాలో అగ్నిపరీక్ష పెట్టేడు. కానీ ఇప్పుడు ఒక ఆడదాన్ని మరో ఆడదే నమ్మడం లేదు. మీ ఆవిడా అదే పనిచేసింది. చంపిన వాడిని వదిలేసి, చచ్చినవాడిని కర్రతో చావగొట్టే పని మీ ఆవిడ కూడా చేసింది. మీ సింధుజ నిర్దోషి అని నిరూపించి, అసలు దోషుల్ని శిక్షించాకే, సింధూని మీ ఇంటికి పంపిస్తాను'' అంటూ అతనిచ్చిన వుత్తరాలు, ఫొటోలు తీసుకుని చూసి, బీరువాలో దాచింది. ఓ గంట తర్వాత ఆదినారాయణ వెళ్లిపోయేడు.

''రేపు నువ్వు చెయ్యాల్సిన పని మరొకటుంది'' అంటూ మధులత రేపటి కార్యక్రమాన్ని సింధుజకి వివరించింది.

★ ★ ★

ప్రభాకర్, ఓ ముప్పై నలభై రకాల వెడ్డింగ్



కార్డ్సు ముందరేసుకుని, అందులో అత్యంత ఆకర్షణీయమైన కార్డుని సెలక్ట్ చేసి, తన పెళ్లికి వేయించాలని, పుదయంనించి ఆ పని మీదే కూర్చున్నాడు. మట్టయ్యకి అలా చేయడం ఇష్టం లేదు. ఫలానా గొప్పవాడి కూతుర్ని పెళ్లాడుతున్న విషయాన్ని ఓ చిత్తు కాగితం మీద రాసి పంపించినా రావల్సినోడు వస్తాడుగాని, కార్డులు చూసి రారుకదా! ఆ మాత్రందానికి ఈ కార్డుల కింద ఇంత ఖర్చెందుకూ దండగ అంటూ మట్టయ్య వాదిస్తున్నాడు. అలా వాదించుకుంటున్న తండ్రీ కొడుకులు గుమ్మం దగ్గర నిలబడ్డ వ్యక్తిని చూసి క్షణంపాటు కంగారుపడ్డారు.

సింధుజ గుమ్మం దగ్గర నిలబడి వాళ్లనే సూటిగా, రెప్పార్పకుండా చూస్తోంది. ఆమెను చూస్తూనే మట్టయ్య కొడుక్కేదో సైగ చేసి మరో గదిలోకి వెళ్లిపోయేడు.

సింధుజ ఎప్పుడైనా ఎదురుపడితే ఏం చెప్పాలో ప్రభాకర్ రిహార్సల్ చేస్కుని సిద్ధంగానే వున్నాడు. కాకపోతే, ఇలా డైరెక్ట్‌గా ఇంటికే వచ్చేస్తుందని వూహించలేదు. సడన్‌గా మూడ్ మార్చేసి, ఆమె మీద ఎంతో జాలి నటిస్తూ "నేను ఒక్క నాలుగు రోజులు వూళ్లో లేకపోయేసరికి ఎంత దారుణం జరిగిపోయింది సింధూ" అన్నాడు.

"మీరు వూర్నించి ఎప్పుడొచ్చేరు?" సూటిగా, సీరియస్‌గా అడిగింది.

"నిన్న కాదు... కాదు... ఇవాళ పుదయమే వచ్చేను"

"నాకేదో దారుణం జరిగిపోయిందంటున్నారు? ఏం జరిగిందట?"

"పోలీసులు అరెస్టు చేసి, కోర్టుకి తీసుకెళ్లేరటగా"

"మీకెవరు చెప్పేరు?"

"మా నాన్న చెప్పేడు"

"ఆయనకెలా తెలుసు?"

సమాధానం కోసం రెండు క్షణాల పాటు ప్రభాకర్ తడుముకున్నాడు.

"ఎవరో చెప్పేరట. అంత గొడవ జరిగేక మా నాన్నకెలా తెలియకుండా వుంటుంది. ఏమైనా నీకు చాలా అన్యాయం జరిగిపోయింది"

"నాకు జరిగింది అన్యాయమేనంటారా?"

"డెఫినిట్‌గా"

"మీరలా అంటారనే నా నమ్మకం. అందుకే జరిగింది తెల్సుకోకుండా మా ఇంట్లోవాళ్లు తరిమేస్తే డైరెక్టుగా మీ ఇంటికొచ్చేసాను" అంటూ సోఫాలో కూర్చుంది. ప్రభాకర్ అయోమయంలో పడ్డాడు. సింధుజ ఇలా ప్రవర్తించడం వింతగా ఫీలయ్యేడు. లోపల గదిలో వున్న మట్టయ్యకి సింధుజ ప్రవర్తన అంతుబట్టలేదు.

టీపాయ్ మీదున్న వెడ్డింగ్ కార్డ్సు తీసుకుని చూస్తూ "ముహూర్తం పెట్టించేశారా? అప్పుడే కార్డ్సు సెలక్ట్ చేసేస్తున్నారు. నా పేరు పక్కన డిగ్రీ కూడా వేయించండి" అంటూనే కార్డ్సు అక్కడ పెట్టేసి "నన్ను ఏ గదిలో వుండమంటారు?" అంది.

మట్టయ్యలోపల్నించి వచ్చి "ఏటమ్మా, నీ ఎవ్వారం నాకేం అర్థం కావడంలేదు. లాడ్జిలో దొరికిపోయి, కోర్టులో వ్యభిచారం నేరం కింద జరిమానా కట్టిందానివి, నువ్వు నా ఇంటి కోడలవడమా! అది ఎంత మాత్రం జరిగే పనికాదు" అన్నాడు సీరియస్‌గా.

"నా మీద ఆ నేరం మోపబడిందేగాని నిజంగా నేనా నేరం చెయ్యలేదండి. అందుకే నాకు జరిగింది అన్యాయమేనని మీ అబ్బాయి ఒప్పుకున్నారు" చాలా యధాలాపంగా చెప్పింది సింధుజ.

"నీకు జరిగింది అన్యాయమేనని అన్నాను గాని, నిన్ను పెళ్లి చేసుకుంటానని అనలేదే" అన్నాడు ప్రభాకర్ కాస్త ఆవేశపడుతూ.

"నేను నిర్దోషినైనప్పుడు మీకెందుకు అభ్యంతరం?"

"నేను నిర్దోషినని ఇప్పుడంటున్నావు. నేరం చేశానని కోర్టులోఒప్పుకున్నావు. ఇందులో ఏది నిజం? ఏమో, నువ్వు లాడ్జీలో నిజంగా తప్పు చేస్తుండగానే దొరికేవేమో" మట్టయ్య వ్యంగ్యంగా అంటూ ఓ వెకిలి నవ్వు నవ్వేడు.

"నేను లాడ్జికి వెళ్లేనంటున్నారు. ఎవరు చెప్పేరు? నేను ఏ లాడ్జికీ వెళ్లలేదండి"




''అబద్ధాలాడకు... నువ్వు లాడ్జికే వెళ్లేవు'' ప్రభాకర్ రెట్టిస్తూ అన్నాడు.

''కావాలంటే పోలీస్ రికార్డ్స్ చూడండి. నన్ను ఏదో బ్రోతల్ హౌస్‌లో పట్టుకున్నారని వుంటుంది''

మట్టయ్య, ప్రభాకర్ ఖంగుతిన్నట్టుగా ఒక ర్నొకరు చూసుకున్నారు.

''మీరెందుకలా చూసుకుంటున్నారు? బ్రోతల్ హౌస్‌లో కూడా నన్నే అరెస్టు చేశారుగాని, నాతో మరో మగాణ్ణి ఎవర్నీ అరెస్టు చెయ్యలేదు. కావాలంటే ఇన్‌స్పెక్టర్ చంద్రమౌళిగారినే అడగండి'' సింధుజ తొణక్కుండా, బెణక్కుండా మాట్లాడుతుంటే, తండ్రీ కొడుకులు కుతకుతలాడిపోయేరు.

''నువ్వు అబద్ధాలాడితే మేం నమ్మెయ్యడానికి సిద్ధంగా లేవమ్మా. నువ్వు అప్సరా హొటల్లో ఎవరో మగాడితో దొరికిపోయేఛన్న సంగతి చాలామంది చెప్పేర్లే'' మట్టయ్య కూడా దబాయింపు ధోరణిలోనే మాట్లాడాడు.

''ఓహో... ఆ మనిషా? ఆయన మా చిన్నాన్నగారండి, ఆయన కూడా నాతోపాటు వచ్చేరు. ఆయన పేరు చలపతిరావు''

''కాదు అతని పేరు భానుమూర్తి'' అనేసి, అంతలోనే ప్రభాకర్ తొందరపడి అనేసినట్టుగా నాలిక కరుచుకున్నాడు.

''అతని పేరు భానుమూర్తా? అతని పేరు మీకెలా తెలుసు? పోలీసులు నన్నే అరెస్టు చేశారుగానీ, భానుమూర్తి అనే పేరున్న మనిషినెవర్నీ అరెస్టు చెయ్యలేదు. కోర్టులో హాజరు పరచలేదు''

మట్టయ్యకి అరికాలిమంట నెత్తికెక్కింది. ప్రభాకర్ పరిస్థితీ అలాగేవుంది. సింధుజ ఇంకా అదే పద్ధతిలో వాదించి, ''నేను నిర్దోషినని ఇంత వివరంగా చెప్తున్నా నేను మీ భార్యని కావడానికి వీల్లేదంటున్నారేమిటి?'' అంటూ దబాయించింది. వాదన కాస్తా ఘర్షణ కింద మారింది. సింధుజ కూడా రెచ్చిపోయింది.

''మీరెందుకిలా గింజుకుపోతున్నారో నాకు తెలుసు. మీరు రఘుపతి గారమ్మాయిని పెళ్లి చేసుకుంటున్నారు. అందుకు నేను అడ్డం వస్తానని మీ ఫ్రెండు భానుమూర్తిని, చంద్రమౌళిని ఈ నాటకంలోకి దించారు''

తండ్రీ కొడుకులకి కొన్ని క్షణాలపాటు నోటంట మాటరాలేదు.

''అలా అని నీకెవరు చెప్పేరు?'' ప్రభాకర్ ఆవేశంగా అడిగాడు.

''మీ ఫ్రెండు భానుమూర్తే చెప్పేడు''

''అబద్ధం... మూర్తి ఎప్పుడూ అలా చెప్పడు'' మట్టయ్య అరిచాడు.

''చెప్పకపోతే, ఈ విషయం నాకెలా తెలుస్తుంది?'' సింధుజ అరిచింది.

''సరే చెప్పేడే అనుకో! చెప్తే ఏంటట? వాడుకాదు, ఇప్పుడు నేను చెప్తున్నాను విను... రఘుపతిగారి కూతుర్ని నేను పెళ్లి చేసుకుంటున్న మాట నిజమే! అందుకు నువ్వు అడ్డుపడకుండా వుండడానికి, మా నాన్న ఓ పథకం వేశాడు. ఆ పథకం ప్రకారమే మన సూపర్నెంటు హనుమంతురావుకి చెప్పి నిన్ను అప్సరా హొటల్‌కి పంపించేం. అక్కడ భానుమూర్తిగాణ్ణి వుంచేం. అదే టైముకి ఇన్‌స్పెక్టర్ చంద్రమౌళిని అక్కడకి పంపించేం. నిన్ను అరెస్టు చేయించేం. అయితే ఏంటట? ఇప్పుడు నువ్వు మమ్మల్ని ఏమైనా చెయ్యగలవా? నా పెళ్లిని నువ్వేమైనా ఆపు చెయ్యగలవా? వ్యభిచారిగా అరెస్టు అయి, కోర్టులో జరిమానా కట్టినదాన్ని పెళ్లి చేస్కోడం ఇష్టంలేకే వేరే పెళ్లి చేసుకుంటున్నానని నేను చెప్తాను''

సింధుజకి ఏడుపు వస్తున్నా ఆపుకుంటూ అతను చెప్పిందంతా విన్నది.

''నన్ను కాదనే హక్కు మీకున్న మాట నిజమే అయినా, నన్ను వదిలించుకోడానికి మీరు ఇంత అమానుషంగా ప్రవర్తించక్కర్లేదండి. నాతో ఒక్క మాట చెప్పుంటే, నా అంతట నేనే నవ్వుకుంటూ మీ దారినించి తప్పుకునేదాన్ని'' అనేసి ఆ ఇంటినించి గబగబా వెళ్లిపోయింది.

సింధుజ వెళ్లిపోయేక అంతవరకు కురిసిన కుండపోత వర్షం వెలిసిపోయినట్టు ఫీలయేరు. ఏదో ఒక రోజు సింధుజ ఇలా అడుగుతుందనుకుంటున్నారు. ఆ గొడవేదో ఇంత

వేగంగా తీరిపోవడం కూడా మంచిదే అని సంతోషించారు. కాకపోతే తమ నాటకం ఆమెకు తెలియకూడదనే అనుకున్నారు. కానీ భానుమూర్తి కొంతవరకు చెప్పెయ్యడంవల్ల మిగిలింది తాము చెప్పక తప్పింది కాదు. అయినా మూర్తిగాడు ఎందుకు చెప్పినట్టు? సందేహాన్ని నివృత్తి చేస్కోడానికి మూర్తి ఆఫీసుకి ఫోన్ చేశాడు ప్రభాకర్.

"ఛఛ... దాంతో నేనేం చెప్పలేదు. చెప్పేనని అనేసరికి నువ్వు మిగతా సంగతి చెప్పేసినట్టున్నావు. సర్లే ఇప్పుడు చెప్తే మాత్రం అదేం చేస్తుంది? అసలే అది ఆడది. మొన్నటివ కూ వుండే వుద్యోగంగాని, ఇంట్లో స్థానంగాని ఇప్పుడు లేవు. పైగా దాని మెడలో అదో బ్రోతల్ అని బోర్డు కూడా కట్టేశాంగా, ఇవాళ్టినించి అది వూరకుక్కలా తిరగాల్సిందే" అంటూ భానుమూర్తి పకపకమని నవ్వుతూ ఫోన్ పెట్టేశాడు.

భానుమూర్తి చెప్పకపోతే సింధుజకి ఈ నాటకం తనే ఆడించిన విషయం ఎలా తెలిసింది? ఈ ప్రశ్నకి సమాధానం దొరక్కపోయినా, సింధుజ తననేం చెయ్యలేదనే ధీమావల్ల అతను మళ్లీ తన పెళ్లి పనుల్లో పడిపోయేడు.

★ ★ ★

సింధుజ చెప్పిందంతా విని మధులత నిట్టూర్చింది. "ఆడదాన్ని బాధపెట్టడంలో చాలా పద్ధతులున్నాయమ్మా. కసాయివాడు గొర్రెల్ని ఒక్కసారి నరికి దాని ప్రాణం తీసేస్తాడు తప్ప, దాన్ని రకరకాలుగా బాధపెట్టడు. కానీ ఆడది ఆ గొర్రెపాటి అదృష్టం కూడా చేస్కోలేదు. పెళ్లి చేస్కున్నాక భార్యని ఆస్తి తేలేదనో, కట్నం తీసుకురాలేదనో కొందరు వేధిస్తారు. భార్యంటే దాసీతో సమానం అని మరికొందరు వేధిస్తారు. ఇలాంటి ప్రభాకర్‌లు ప్రేమ విషయంలో కూడా ఇంత దారుణంగా ప్రవర్తిస్తుంటారు. ఇతని విషయంలో, దుర్యోధనుడు వాళ్ల నాన్న మట్టయ్య అయితే, అతను వేసిన పథకాల్ని అమలు పరిచే దుశ్శాసనుడే ఈ ప్రభాకర్! ఏమైతేనేం, నాకు కావలసిన ఆధారాలు దొరికేయి కాబట్టి, ఇంక నా ఎదురుదాడి రేపట్నించి ఆరంభమవుతుంది" అంటూ సింధుజ భుజానికున్న బేగ్‌లోంచి టేప్‌రికార్డర్‌ని తీసి, కాసెట్ ఓసారి చూసి బీరువాలో పెట్టింది.

వంటమనిషి బాలయ్య వచ్చి "కుక్కింగ్ ఫినీష్ అయిపోయింది. మీరు ఈటింగ్ స్టార్ట్ చేస్తానంటే, నేను సర్వింగ్‌కి రెడీ మేడమ్" అన్నాడు. వాడి మాట, వాడి ఇంగ్లీషు చూసి మధులత నవ్వుకుంది. చాలా చిత్రమైన మనిషని మనసులోనే అనుకుంటూ సింధుజని తీస్కుని డైనింగ్ హాల్లోకి నడిచింది.

★ ★ ★

పోస్టులో వచ్చిన లాయర్ నోటీసు చూసి ప్రభాకర్ అదిరిపడ్డాడు. సింధుజ తరఫున ఆమె లాయరు మధులత పంపించిన నోటీస్ అది.

అమాయకురాలైన సింధుజని వ్యభిచారిగా ముద్రవేయడానికి ఓ నీచమైన ప్రయత్నం జరిగిందని, అందుకు ఆధారాలు తమవద్దవున్నాయని, విచారణకి కోర్టుకి హాజరుకావాలనే నోటీసు అది.

మట్టయ్య ఆలోచనలోపడ్డాడు. ఒంటరిగా మిగిలిపోయిన సింధుజ, కోర్టులో నేరం చేశానని ఒప్పుకుని, జరీమానా కూడా కట్టేసిన సింధుజ ఇప్పుడు తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోడానికి మమ్మల్ని కోర్టుకీడ్చడమా? ఇంత ధైర్యం దానికెలా వచ్చింది? తనని నిర్దోషని నిరూపించడానికి ఆధారాలు కూడా వున్నాయా? ఏంటా ఆధారాలు? వుంటే ఆవిడ దగ్గర ప్రభాకర్ రాసిన లవ్‌లెటర్సు, ఫోటోలు వుంటాయి. వాటికీ, ఈ కేసుకి సంబంధం ఏమీలేదు.

ఆ రాత్రి ప్రభాకర్ ఇంట్లో భానుమూర్తి, చంద్రమౌళి కూడా హాజరయేరు. పిలవకపోయినా హనుమంతురావు అక్కడకొచ్చేశాడు. అందుక్కారణం మూర్తి, చంద్రమౌళిలతోపాటు అతనికీ లాయర్ నోటీసు అందడమే! ఎందుకైనా మంచిదని మట్టయ్య నగరంలోని ప్రముఖ లాయరు కృష్ణమోహన్‌ని కూడా పార్టీకి పిల్చాడు. జరిగిందంతా విన్నాక కృష్ణమోహన్, విషయాన్ని చాలా ఈజీగా తీసిపారేస్తూ-

"మీరేం కంగారు పడకండి. ఈ నాటకం





ఆడింది మూర్తిగారు, చంద్రమౌళిగారు, హను మంతురావుగారు, ఆడించింది మీ తండ్రీ కొడుకులు అంతేకదా! మీరు ఆడించేరనే పాయింటు, ఈ ముగ్గురూ చచ్చినా కోర్టులో చెప్పరు. మేం ఈ నాటకంలో పాత్రధారుల మని వీళ్లు ఎంత మాత్రం ఒప్పుకోరు. ఇహ పోతే వాళ్ల దగ్గర సరైన ఆధారాలున్నాయన్నది కేవలం మా లాయర్ల దబాయింపు మాత్రమే! అలా అంటే కాస్త భయపడి, ఏదో ఓ రాజీ కొస్తామని! రాజీపడ్డానికి ఏదో కాస్త డబ్బు అడు గుతారు. అసలే ఇప్పుడా అమ్మాయికి ఉద్యోగం లేదు, ఇంట్లో ఆశ్రయం కూడా లేదు. అంచేత డబ్బు కోసమే ఈ నోటీసు ఇప్పించి వుంటుంది'' అన్నాడు.

ప్రభాకర్‌కి ఓ సందేహం వచ్చింది. సింధూని మా మౌళీగాడు అప్సరా హోటల్లో అరెస్టు చేసినా, ఏదో బ్రోతల్ హౌస్‌లో అరెస్టు చేసినట్టుగా రాసేడటకదా! దానివల్ల ఏమీ తేడారాదా?''

''మూర్తిగాణ్ణి కూడా అరెస్టు చేస్తే వాడినీ కోర్టుకి తీసుకెళ్లాలి, జరిమానా కట్టించాలి. అంచేత, సింధుజని ఇర్రిటేట్ చెయ్యడం వరకే వాడిని వినియోగించుకున్నాను. లేక పోతే, వాడు బ్రోతల్ కేసులో జరిమానా కట్టిన విషయం వాళ్లబాస్‌కి తెలిస్తే వాడి వుద్యోగానికే ఎసరురావచ్చని అలా చేశాను'' అన్నాడు చంద్రమౌళి ఏదో సంజాయిషీ ఇస్తున్నట్టుగా

కృష్ణమోహన్ తాగుతున్న గ్లాసు కిందకి దించి ''అసలు భానుమూర్తిగారు ఎప్పుడు పిక్చర్లో కొస్తారు? అప్సరా హోటల్ అనే పాయింటు వచ్చినప్పుడు కదా! హనుమంతు రావుగారు సింధుజని పిలిచి అప్సరాహో టల్ కెళ్లమని చెప్పినప్పుడు అక్కడ మూడో మనిషి ఎవరూ లేరుకదా?'' అంటూ హను మంతురావు వైపు చూశాడు.

అతను కాస్త గుర్తు చేస్కుని ''లేరండి'' అన్నాడు.

''దెన్ వాటీజ్ ద ప్రాబ్లమ్? హనుమంతురా వుగారు సింధుజని అప్సరాహోటల్‌కెళ్లమనే చెప్పలేదు. పైగా ఒకసారి నేరాన్ని ఒప్పుకున్న మనిషి, మళ్లీ ఇప్పుడు పేద్ద పతివ్రతలా కేసుపెట్టిందంటే, అది కేవలం పెద్ద మనుషు ల్ని అవమానించడానికే అని నేను వాదిస్తా నుగా'' అంటూ లాయరు పగలబడి నవ్వేడు. మిగతావాళ్లూ వంత కలిపారు. అంతలోనే ప్రభాకర్‌కి మరో సందేహం వచ్చింది.

''ఔనండీ నాకు తెలియక అడుగుతాను. ఈ నోటీసు పంపించిన లాయర్ మధులత ఈ వూరి లాయర్ కానట్టుందే!''

''కాదులెండి... గుంటూరులో ఓ మోస్తరుగా లీడింగ్ లాయరనే ఆవిడ గురించి చెప్తుంటా రు. సింధుజ మీద వుండే అభిమానం కొద్దీ వచ్చుంటుంది. అయినా ఫర్వాలేదు. ఎందు కంటే ఇటు పక్కవున్నది ఆటంబాంబు'' అంటూ కృష్ణమోహన్ అనేసరికి, అతనేదో జోక్ పేల్చినట్టుగా అందరూ పగలబడి నవ్వేరు ఒక్క హనుమంతురావు తప్ప.



కోర్టులోకి వచ్చేక, ఆ రోజునించి ఎవరో కొత్త జడ్జీ వస్తున్నారన్న విషయం మధులతకి తెలి సింది. సింధుజ, ప్రభాకర్, మట్టయ్య, చంద్ర మౌళి, భానుమూర్తి, హనుమంతురావు అంద రూ వచ్చి ఆడియన్స్‌లో కూర్చున్నారు.

జడ్జి స్థానంలోకొస్తున్న వ్యక్తిని చూసి, మధు లత ఆశ్చర్యపోయింది.

అతను రంగనాథరావు.

ఒకనాటి మధులత భర్త!!!

రంగనాథరావు తన సీట్లో కూర్చున్నాక మధులతని చూసి, నివ్వెరపోయేడు.

పాతికేళ్ల కిందట తలదించుకుని తన జీవితం నించి నిష్క్రమించిన మధులత,

ఈనాడు లాయర్‌గా తల ఎత్తిందా?

రంగనాధరావు జడ్జిగా ప్రమోట్ అయేడన్న విషయం మధులత విన్నా ఈ వూరికి ట్రాన్స్‌ఫర్ అయిన విషయం మాత్రం తెలియదు. అతనీ రోజు న్యాయమూర్తి స్థాయికి ఎదిగినా అన్యాయమైపోయిన ఆడదానికి ఎంతవరకు న్యాయం చేస్తాడనేది తనకి సందేహమే! కొన్ని కేసుల్ని చట్టాల పరిధినించి బయటకిలాగి, మానవతా ధృక్పథంతో ఆలోచించి, న్యాయం చెయ్యాల్సిన అవసరం వుంది. కానీ, రంగనాధరావు వుద్యోగరీత్యా వున్నత స్థాయికి ఎదిగినా, ప్రవృత్తిరీత్యా, ఈ ఇరవై ఏళ్ల కాలంలో అతను ఎదిగేడో, లేదో తెలియదు. ఎదిగినా, ఎంతవరకు ఎదిగాడో తెలియదు. అందులోనూ ఇది తను వకాల్తా పుచ్చుకుని వాదిస్తున్న కేసు. తీర్పు తను వూహించిన దానికి భిన్నంగా వస్తే సింధుజకి న్యాయం చెయ్యడానికి బదులు అన్యాయం చేసినట్టవుతుంది. న్యాయం కోసం ముందడుగేసి కోర్టు కెక్కిన ఓ అమాయకురాలి ఓటమి, ఆమె జీవితంతో చెలగాటాలాడిన మగవారికి వారి దుర్మార్గానికి మరింత బలాన్నిస్తుంది. అదే గనక జరిగితే అలాంటి పురుష అహంకారులు ఏకవడగ నాగుపాము దశనించి వేయి పడగల శేషువులుగా రూపొందుతారు. కాబట్టి సింధుజకి న్యాయం చెయ్యడానికి కోర్టుని ఆశ్రయించకూడదు. తన చాతుర్యంతో తనే సాధించాలి.

మధులత లేచి నిలబడింది. "క్షమించండి యువరానర్... కొంతమంది దగా కోర్ల దౌష్ట్యానికి అన్యాయమైపోయిన ఓ అమాయికురాలికి న్యాయం జరిపించే వుద్దేశ్యంతో నేను ఆమె తరవున వకాల్తా పుచ్చుకున్నాను. కానీ ఇప్పుడా కేసుని విత్‌డ్రా చేసుకుంటున్నాను. అందుకు అనుమతి ఇప్పించవలసిందిగా కోరుతున్నాను"

మధులత చేసిన రిక్వెస్టుకి ప్రభాకర్ వగైరాలంతా ఆశ్చర్యపోయేరు. ఆంటీ ఎందుకు విత్‌డ్రా అయిపోతోందో సింధుజకి అర్థం కాలేదు. లాయర్ కృష్ణమోహన్ తన వర్గం వారి వైపు, ఓసారి విజయగర్వంతో చూశాడు.

రంగనాధరావు టేబిల్ మీదనున్న గ్లాసులోని నీళ్లు కొద్దిగా తాగి "కారణం?" అని అడిగాడు.

"ప్రత్యేకమైన కారణమంటూ ఏమీ లేదు. దయచేసి క్షమించమని మరోసారి కోరుతున్నాను" మధులత ముక్తసరిగా చెప్పి కుర్చుండిపోయింది.

★ ★ ★

ఆ రాత్రి మట్టయ్య మరోసారి తన బృందానికి పార్టీ ఇచ్చేడు. పార్టీలో లాయర్ కృష్ణమోహన్ మరీ ఎక్కువతాగి, మధులత విత్‌డ్రా అయిపోడానికి తనే కారణమని, తనని చూసి భయపడి, కేసు గెలవలేనని నిర్ణయించుకుని తోక ముడిచేసిందని ప్రగల్భాలు పలికాడు. మట్టయ్య అతని మాటల్ని ఒప్పుకుంటూనే మరో విధంగా అన్నాడు.

"మీరు చెప్పినట్టు, లాయరు నోటీసు చూడగానే మనం కంగారుపడిపోయి, కాళ్ల బేరానికొచ్చేసి, కట్టలకి కట్టలు డబ్బు అందించేస్తామని ఆ లాయరమ్మ అనుకుంది. కానీ మనందరం కంచుకోటలంకదా! మనం లొంగకపోయేసరికి ఆవిడగారు తోకముడిచేసింది. దానిదగ్గర నిజంగా ఆధారాలుంటే కోర్టులో చెలరేగిపోయేదికదా! దేవుడు కూడా బహుశా మన పార్టీవాడే అయివుంటాడు. అందుకే మనల్ని గెలిపించేడు" అతని మాటలు, మిగతావారి అభిప్రాయాలు దాదాపు ఒకేలా వుండడంతో ఆ రోజు పార్టీ చాలా ఆనందంగానే గడిచిపోయింది.

★ ★ ★

మధులత గెస్టుహౌస్ ముందు కారు ఆగితే, వచ్చింది ఎవరా? అని కిటికీలోనించి చూసింది.

కారులోనించి దిగుతున్న వ్యక్తి రంగనాధరావు.

అతను వస్తాడని మధులత వూహించింది. "మే ఐ కమిన్" అన్నాడు గుమ్మం దగ్గర నిలబడి.

"రండి" ముక్తసరిగా అంది మధులత.

"మీరు వస్తారని వూహించాను. కూర్చోండి" అంటూ లోపలకెళ్లి కాఫీ పట్టుకొచ్చి, అతని చేతికిచ్చి ఎదుటి సోఫాలో కూర్చుంది.

రంగనాధరావు ఆమెను తదేకంగా చూస్తూ





ఉండిపోయేడు తప్ప రెండు నిమిషాల వరకూ ఏమీ మాట్లాడలేదు.

"పిల్లలెంతమంది?" నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అడిగింది.

"ఒకమ్మాయి"

మళ్లీ నిశ్శబ్దం... "కేసు ఎందుకు విత్‌డ్రా చేసుకున్నావ్? నేను న్యాయం చెయ్యనని సందేహించావా?" కాఫీ తాగుతూ అడిగాడు.

"అదీ ఒక కారణమే అనుకోండి. కానీ అంతకుమించి నేను మరో సెకెండ్ థాట్ తీసుకున్నాను. ఈ కేసులో నాకు కావల్సింది న్యాయం. దాన్ని కోర్టుద్వారా కంటే నేను వ్యక్తిగానే సాధిస్తాననే నమ్మకం కుదిరింది. అందుకే విత్‌డ్రా అయిపోయేను"

"అంటే, ఏం చేద్దామని నీ వుద్దేశ్యం?"

"చేసేముందు చెప్పడం నాకిష్టం వుండదు"

మళ్లీ నిశ్శబ్దం అలుముకుంది. ఓ నిమిషం తర్వాత "గుంటూరులో మధులత అనే లాయరు వుందని విన్నాను. కానీ ఆ మధులత నువ్వనుకోలేదు" అన్నాడు రంగనాధరావు. ఆమె చిన్నగా నవ్వి వూరుకుంది. అతనులేచి, ఆ గదిలో అటూ ఇటూ తిరుగుతూ "మళ్లీ పెళ్లి చేస్కోలేదా?" అన్నాడు.

"అక్కర్లేదనుకున్నాను"

మళ్లీ సోఫాలో కూర్చున్నాడు. "నేను చాలా మారిపోయేను మధూ"

"తెలుస్తూనే వుందిగా, అప్పుడు లాయరు, ఇప్పుడు జడ్జి. అప్పుడు యువకులు, ఇప్పుడు...."

"ఆ మార్పులు కాదు. నేను చెప్పదల్చిందేమిటంటే" అతని మాటలు పూర్తి కాకుండానే సింధుజ వచ్చింది, మరో కారులో. రంగనాధరావులేచి నిలబడి "నేను మరోసారి వస్తాను" అంటూ బయటకి నడిచి, కారు ఎక్కి వెళ్లిపోయేడు.

"జడ్జీగారులా వున్నారు. దేనికొచ్చేరు?" అంది సింధుజ ఆశ్చర్యంగా.

"ఒకప్పుడు నాకు బాగా తెలిసిన మనిషే... వూరికే పలకరించడానికొచ్చేరు" అంటూ టాపిక్ మార్చి మాట్లాడింది.

"నువ్వెళ్లిన పని ఏమైంది?"

"నేను ఎంక్వయిరీ చేశాను. నువ్వు విన్నది కరక్టే" అంది. ఆ విషయం మీద మధులత మరేమీ మాట్లాడకుండా వెళ్లి సోఫాలో కూర్చుంది.

"మూల విరాట్టుని బయటకి లాగాలంటే, అతనికి కాపలాకాస్తున్న ద్వారపాలకుల్ని ముందు పక్కకి లాగాలి" అంది శూన్యంలోకి చూస్తూ. ఓ నిమిషం తర్వాత ఎవరికో ఫోన్ చేసి మాట్లాడింది.

★ ★ ★

చిట్‌ఫండ్ కంపెనీలో స్టెనోగ్రాఫర్ పోస్టుకి ఇంటర్వ్యూలు జరుగుతున్నాయి. నాలుగు రోజుల కిందట లోకల్ పేపర్లో వేసిన ప్రకటనకి పదహారుమంది అభ్యర్థులొచ్చేరు. అందులో పదిమంది మగవాళ్లు కాగా, ఆరుగురు అమ్మాయిలు. అందులో ఓ అమ్మాయి భానుమూర్తి కంటికి కొట్టొచ్చినట్టు కనిపించింది. అందంతో పాటు అవయవ పుష్టి వున్నవాళ్లు అరుదుగా వుంటారు. అలాంటి అరుదైన అందంగల ఆ అమ్మాయి పేరు అరుంధతి.

అరుంధతిని ఇంటర్వ్యూకి పిలిచాడు. ఆమె సాంప్రదాయబద్ధంగా రెండు చేతులతోనూ నమస్కరించింది. "ఇక్కడున్నది ఒకే ఒక్క పోస్టు, కానీ దానికి పదహారుమంది పోటీపడుతున్నారు. నీకే ఆ వుద్యోగం ఇస్తానన్నాననుకో, దానికి ప్రత్యుపకారం నువ్వేం చేయగలవు?" భానుమూర్తి సూటిగా అడిగాడు.

"నేను పేదదాన్ని. పెద్ద కుటుంబాన్ని పోషించలేకనే ఈ వుద్యోగాన్ని ఆశిస్తున్నాను. నేను మీకేం డబ్బు ఇవ్వగలను. మీరే కనికరించి వుపకారం చెయ్యమని ప్రార్థిస్తున్నాను" అరుంధతి ఎంతో వినయంగా రిక్వెస్టు చేసింది.

మూర్తి పగలబడి నవ్వేడు. "నువ్వు డబ్బుకి పేదదానివి కావచ్చు. కానీ అందానికి కాదుగా. నా చేతిలో అధికారం వుంది కాబట్టి నేను నీకు వుద్యోగం ఇచ్చి వుపకారం చేస్తాను. నీ దగ్గర అందం వుంది కాబట్టి, దాంతో నన్ను సంతోష పెట్టొచ్చుగా. నేను నీకిచ్చేది ముప్పై అయిదేళ్ల

పాటు నీకు నెల నెలా డబ్బు తెచ్చి పెట్టే వుద్యోగం. కానీ నేను అడిగింది ఒక్కరోజు ఆనందం. బాగా ఆలోచించుకో. ఇష్టమైతే సాయంత్రం మోహినీ మహల్ గెస్టుహౌస్‌కి ఏడు గంటలకిరా''

అరుంధతి నిట్టూర్చింది. కనుకొనల్లో నీళ్లు తిరిగితే, కర్చీఫ్‌తో ఒత్తుకుంది. ఓ నిమిషం తర్వాత తన అంగీకారాన్ని తెలుపుతూ తల ఆడించింది. హ్యాండ్‌బేగ్ నీరసంగా భుజాన్నే సుకుని లేచింది.

ఆ సాయంత్రం-

అరుంధతి హడావిడిగా ఆ గెస్ట్‌హౌస్‌లో వున్న మూర్తి దగ్గరకి వచ్చేసరికి ఏడుంపావు అయింది. అప్పటికే మూర్తి తాగడం ఆరంభించేడు.

"ఆలస్యమైందేం?'' మూర్తి అడిగాడు.

"ఆటో దొరకడం కష్టమైందండి'' అంటూ హేండ్‌బేగ్‌ని అక్కడున్న టేబిల్ మీద పెట్టి, రుమాలుతో చెమట తుడుచుకుంది.



"ఆలస్యమైతే మనసు మార్చుకున్నావను కున్నాను" అంటూ ఓ గ్లాసులో విస్కీ, సోడా వేసి అందించాడు.



"వద్దండి, నాకు అలవాటు లేదు. మనసు మార్చుకునేదాన్నే... కానీ, మీ మాట కాదని అల్లరవడంకంటే, ఏదో విధంగా రాజీపడ్డమే మంచిదని నిర్ణయించుకున్నాను" అరుంధతి గత్యంతరం లేక తప్పు చేస్తున్నట్టుగా ఫీలవుతూ చెప్పింది.

"నన్ను ఎదిరిస్తే అల్లరి చేస్తానని నీకెవరు చెప్పేరు?" చాలా ఆసక్తిగా అడిగాడు.

"ఎవరో సింధుజ అనే అమ్మాయి మీ మాట వినలేదని..." గ్లాసులో వున్నదంతా గబగబా తాగేసి వగలబడినవ్వేడు మూర్తి. "ఆ సింధుజ ఓ పొగరుమోతు రాస్కెల్. నన్ను కాదనడమేకాకుండా ఆఫీసులో అందరి ముందూ నన్ను చెప్పుతో కొట్టింది. అయితే నేనూరుకున్నానా? మా ప్రభాకర్‌గాడికి సాయం చెయ్యడానికి వాడితో చేతులు కలిపాను. దాన్ని నేర్పుగా హొటల్‌కి రప్పించి, వుత్తపుణ్యానికి దాన్ని ఏమీ చెయ్యకుండానే పోలీసులచేత అరెస్టు చేయించి, కోర్టుకీడ్చిమరీ దాన్ని వ్యభిచారని కోర్టువారి చేత నమ్మించేను. దటీజ్ భానుమూర్తి అహ్హహ్హహ్హ.." అంటూ పగలబడి నవ్వుతున్న మూర్తి గుమ్మం దగ్గర నిలబడిన వ్యక్తిని చూసి, కొయ్యబారిపోయేడు.

అతను చిట్‌ఫండ్ కంపెనీ ప్రొప్రయిటర్ దయానంద! హైదరాబాద్‌లో వుండాల్సిన వ్యక్తి ఇక్కడ, ఈ సమయంలో ఎందుకున్నాడో మూర్తికి అర్థం కాలేదు.

"ఈ అమ్మాయెవరు?" దయానంద చాలా నిదానంగా అడిగాడు.

"ఏమో సార్! స్టెనో పోస్టు తనకే ఇమ్మంటూ చాలా బలవంతం చేస్తోంది. పొమ్మని కసిరినా పోవడం లేదు" ధైర్యం తెచ్చుకుంటూ గబగబా అనేశాడు.

"ఇప్పుడు సింధుజ విషయం ఏదో చెప్తున్నట్టున్నావ్..."

"అబ్బే... ఏమీ చెప్పడం లేదండి, ఏమీ చెప్పలేదు" మూర్తి తడబడుతూ అనేసి, లోపలకి వస్తున్న మనుమల్ని చూసి, మరింత ఆశ్చర్యపోయాడు.

వాళ్లు లాయర్ మధులత!

సింధుజ!

మధులత తిన్నగా వెళ్లి టేబిల్ మీద పెట్టిన అరుంధతి బేగ్ తీసుకొచ్చి, అందులో వున్న టేప్‌రికార్డర్ని తీసి బయటపెట్టింది. రివైండ్ చేసి, ఇందాక మూర్తి చెప్పిన మాటల్ని వినిపించింది. మూర్తికి చెమటలతో బట్టలు తడిసి ముద్ద అయేయి.

"తెలివి తేటలు నీ ఒక్కడికే వున్నాయనుకోకు మూర్తీ! నీ నీచత్వాన్ని నీ నోటంట బయటపెట్టడానికే ఈ ప్లాన్. ఈ అరుంధతి నా దగ్గర జూనియర్‌గా పని చేస్తున్న లాయరు. నీకు ఎరవేయడానికి నేనే గుంటూరునించి పిలిపించి, మీ ఆఫీసులోని పోస్టుకి ఎప్లయ్ చేయించేను. అందాన్ని అనుభవించడానికి నువ్వు ఎంత అమానుషానికైనా దిగుతావని తెలిసే, నీ నికృష్ట జీవితాన్ని ప్రత్యక్షంగా చూపించడానికి హైదరాబాద్‌నించి దయానందగార్ని కూడా పిలిపించేను..."

మధులత చెప్పే ఒక్కో మాట మూర్తికి ఒక్కో కొరడా దెబ్బలా తగుల్తోంది.

"ఆడదానివి నువ్వేం చెయ్యగలవ్ అంటూ సింధుజని ఛేలెంజ్ చేశావ్. ఇప్పుడేం చేసిందో అర్థమైందిగదా!" అంటూ దయానందవైపు తిరిగి "ఇప్పుడు మీ తీర్పు చెప్పండి" అంది.

"ఇలాంటి చీడపురుగులవల్ల మా సంస్థకున్న పేరు ప్రఖ్యాతలు మంటగలిసిపోతాయి కాబట్టి వీణ్ణి ఈ క్షణమే వుద్యోగంనించి డిస్మిస్ చేస్తున్నాను" అన్నాడు దయానంద.

మూర్తి తలదించుకున్నాడు. "సింధూ! నువ్వంటే ఏమిటో మరోసారి తెలియజేస్తే మరోసారి ఏ అమ్మాయి జీవితంతోనూ ఆడుకునే అవకాశం వుండేదు. కానియ్" అంది మధులత.

సింధుజ ముందుకొచ్చి ఫెడీఫెడీమంటూ లెంపకాయలు కొట్టింది. థూ అంటూ ముఖం మీద ఉమ్మింది. అయినా మూర్తి చచ్చిన పాములా వుండిపోయేడు. మధులత ఫైనల్ వార్నింగ్ ఇస్తున్నట్టుగా చెప్పింది. "మూర్తీ నీ ఇంట్లో నీ భార్య పట్ల కూడా రాక్షసంగా ప్రవర్తిస్తావని నేను ఎంక్వయిరీ చేసి తెల్సుకున్నాను. ఈ రోజు వరకు నువ్వు అధికారంలో వున్న




నీచుడివి. కానీ ఈ క్షణంనించి నీకు అధికారం పోయింది. దాంతో పాటు నీ నీచత్వం కూడా పోతే మంచిది. లేదంటే దాన్ని కూడా నాశనం చేసే ఏర్పాటు చేస్తాను. నీలో మార్పు కలిగించడమే నా తీర్పు'' అంటూ దయానందవైపు తిరిగి అతను అందించిన సహకారానికి, బైట్లీగా తీసుకున్న నిర్ణయానికీ కృతజ్ఞతలు చెప్పింది.

''ఆ కృతజ్ఞతలేవో నేనే నీకు చెప్పాలమ్మా. కలుపుమొక్కల్ని ఏరి పారెయ్యకపోతే మంచి మొక్కలకి బలం వుండదు. ఇలాంటి నీచుల వల్ల మొత్తం మా సంస్థకే ముప్పు వస్తుంది. నువ్వు పూనుకోబట్టి, ఇన్నాళ్లకైనా వీడిని తొలగించగలిగేను'' దయానంద ఎంతో సిన్సియర్‌గా చెప్పేడు.

భానుమూర్తి అధికార దుర్వినియోగం ఆ విధంగా అంతమయింది.

★ ★ ★

యస్సై చంద్రమౌళి ఆరోజు వుదయం తొమ్మిదిన్నరకి స్టేషన్ కొచ్చేడు. హెడ్ కానిస్టేబుల్ అరగంటనించి ఆత్రంగా వెయిట్ చేస్తున్నాడు.

''సార్... మీ కోసం కేశవవర్మగారు రెండుసార్లు బాంబేనించి ఫోన్ చేశారుసార్'' అన్నాడు హెచ్.సి. అప్పలకొండ.

కేశవవర్మగారు ప్రముఖ పారిశ్రామికవేత్త కావడంతోపాటు పోలీసుల సహకారంతో గతంలో చాలా పనులు చేయించాడు. అందుకు తగినట్టుగా పారితోషికాలు, నజరానాలూ ముట్టజెప్పేడు. అటువంటి వర్మగారు తన కోసం బొంబాయి నించి ఫోన్ చేశారంటే ఆశ్చర్యపోయాడు. ఆయన వ్యాపార నిమిత్తం తరచుగా బొంబాయి, ఢిల్లీ, కలకత్తా వెళ్లడం అలవాటే. కానీ ఇప్పుడు బొంబాయి నించి ఫోన్ చేశారంటే ఏదో ముఖ్యమైన పనే అయి వుండాలి.

పది నిమిషాలు గడవకముందే మళ్లీ ఫోన్ మోగింది. మౌళి గభీమని ఫోన్ అందుకున్నాడు. అవతలనించి కేశవవర్మ మాట్లాడుతున్నాడు.

''మిస్టర్ మౌళీ, నువ్వు నాకో ఉపకారం చెయ్యాలయ్యా... మరేం లేదు. హైదరాబాద్‌లో మా తమ్ముడి కొడుకు నిన్న రాత్రి తన ఫ్రెండ్స్‌తో ఏదో పార్టీలో కూర్చుని, అక్కడెవడితోనో ఘర్షణపడి, సీసాతో వాడి తల మీద కొట్టేడట. వాడు అక్కడికక్కడే చచ్చిపోయేడట. అక్కడున్న మిగతా ఇద్దరూ మా వాడి ఫ్రెండ్సే కాబట్టి, వాళ్ల సంగతి నేను చూసుకుంటాను. ఈ గొడవ విషయం నిన్న అర్ధరాత్రి నాకు ఫోన్ చేసి, మా తమ్ముడు చెప్పేడు. ఇప్పుడేం చేస్తున్నానంటే, వాణ్ణి ఇవాళ మోర్నింగ్ ఫ్లైట్‌కి మారు పేరు మీద టిక్కెట్ తీయించి వైజాగ్ పంపించమని చెప్పేను. ఈ పాటికి ఫ్లైట్ లేండ్ అయేవుంటుంది. వాడు సరాసరి నీ దగ్గరకే వస్తాడు. నువ్వేం చెయ్యాలంటే, నిన్నరాత్రి ఇక్కడ వాడేదో న్యూసెన్స్ చేస్తే నువ్వే స్వయంగా పట్టుకుని రిమేండ్‌లో పెట్టేవని రాస్కో. కోర్టుకి తీసుకెళ్లి ఏదో జరీమానా వేయించెయ్. మిగతా విషయాలన్నీ నేను బాంబేనించి వచ్చేక చూసుకుంటాను'' వర్మ గడగడమని చెప్పిందంతా విన్నాడుగాని, మౌళికి అతను చెప్పినట్టు చెయ్యడానికి ధైర్యం చాల్లేదు.

''అది కాదు సార్... మర్డర్ కేసంటున్నారు... మేనేజ్ చెయ్యడం చాలా కష్టం...'' అంటూ మెల్లగా గొణిగాడు.

''ఒకేసారి నీకు యాభై వేలు రావడం కూడా కష్టమేగదా'' వర్మ కాస్త వ్యంగ్యంగానే అన్నాడు.

''ఎంతసార్?' మౌళి రెట్టించాడు.

''యాభైవేలు. మా వాడు వచ్చి ఆ డబ్బు నీకు ఇచ్చేస్తాడు. కేసునించి బయటపడిపోయేక మరో పదో ఇరవయ్యో ఇవ్వకుండా వుంటానా! అన్నట్టు మా వాడి పేరు విజయ్‌కుమార్''

మౌళి సంతోషంగా ఒప్పేసుకున్నాడు. ఫోన్ పెట్టేసిన పదే నిమిషాలకి విజయ్‌కుమార్ టాక్సీలో నించి ఓ బ్రీఫ్‌కేసు పట్టుకుని దిగేడు. పాతికేళ్లు కూడా వుండని కుర్రాడు అప్పుడే డ్రింకు పార్టీలు, మర్డర్లకీ దిగేడేవిటాని ఆశ్చర్యపోయినా, పెద్ద వాళ్ల గొడవలు అలాగే వుంటాయని సరిపెట్టుకున్నాడు మౌళి. ఆ అబ్బాయికి తనే సెల్యూట్ చేసి, కూర్చోబెట్టేడు. ''పెదనా

న్నగారు అంతా చెప్పేరు బాబూ, మీరేం కంగారుపడనవసరం లేదు'' అంటూ సిగరెట్ ఆఫర్ చేశాడు. దానికి అగ్గిపుల్ల కూడా తనే గీసి వెలిగించాడు.

''ఇట్సాల్‌రైట్. ఇక్కడ నేను కాస్త విస్కీ తీస్కోడానికి వీలవుతుందా?'' చాలా దర్జాగా అడిగాడు విజయ్‌కుమార్.

''వీలులేకపోయినా నేను కలిగిస్తాగా. లోపల ఇంట్రాగేషన్ సెల్ వుంది. అక్కడ కూర్చోండి'' అంటూ లోపలవున్న మరో రూమ్‌లోకి తీసుకు వెళ్లాడు. సోడాలు కావాలంటే కానిస్టేబుల్ని పంపించి మూడు సోడాలు తెప్పించాడు. విజయ్‌కుమార్ తన బ్రీఫ్‌కేసులోనించి స్కాచ్‌విస్కీ బోటిల్ తీశాడు.

''నేను వెళ్లి ఛార్జ్‌షీటు అదీ రాయించే పని చూసుకుంటాను'' అన్నాడు మౌళి చేతులు నులుముకుంటూ. ఆ అబ్బాయి తన మందు పనే చూసుకుంటున్నాడు తప్ప వర్మగారు చెప్పిన డబ్బు విషయం చెప్పడంలేదు.

''పెదనాన్నగారు... డబ్బు విషయం...'' సణిగేడు మౌళి.

''ఓహ్ అదా'' అంటూ బ్రీఫ్‌కేసు ఓపెన్ చేసి, తువ్వాలు మడతల్లో దాచిన అయిదు కరెన్సీ కట్టల్ని తీసి మౌళికి అందించాడు. మౌళి, ఆ కట్టల్ని రెండు జేబుల్లోనూ కుక్కుకుని ఇంక మీ పని కానివ్వండి, నేను నా పని కానిస్తాను'' అంటూ తన సీటు దగ్గరకి నడిచాడు. టేబిల్ దగ్గరకి రాబోయిన మౌళి, తన సీట్లో ఏదో దెయ్యాన్ని చూసినట్టుగా బేరమన్నాడు.

యస్పీ ఉషారాణి అతని సీట్లో కూర్చుని ఉంది.

ఆమె అలా సర్‌ప్రైజ్ విజిట్స్ అప్పుడప్పుడు ఇవ్వడం మామూలేగాని, ఇవాళ, ఈ టైమ్‌లో వస్తుందని మాత్రం వూహించలేదు తడబడుతూనే సెల్యూట్ చేశాడు.

''ఎలా వుంది పొజీషను?'' అంటూనే ఆమె ఇంట్రాగేషన్ సెల్‌వైపు నడిచింది. మౌళి కంగారుపడుతూనే ఆమెను ఫాలో అయేడు. అక్కడున్న విజయ్‌కుమార్‌ని చూస్తూ ''ఎవరితను?'' అని అడిగింది.

''అతను. .. విజయ్‌కుమార్ అని... నిన్న రాత్రి జగదాంబా జంక్షన్లో పబ్లిక్ న్యూసెన్స్ చేస్తుంటే అరెస్టు చేశాను మేడమ్'' అన్నాడు ధైర్యం పుంజుకుంటూ.

''అరెస్టు చేసిన వాళ్లందరికీ ఇలాగే మర్యాదలు జరిపిస్తారా?'' ఆ ప్రశ్నకి జవాబు చెప్పలేకపోయేడు.

ఉషారాణి మళ్లీ మౌళి కూర్చుండే సీటు దగ్గరకెళ్లి కూర్చుంది.

''అతన్ని ఎప్పుడు అరెస్టు చేశారు?''

''నిన్న రాత్రి మేడమ్... పది గంటలు దాటేక...''

''ఐసీ! ఏదీ ఆ ఛార్జ్‌షీట్ చూపించండి''

మౌళి ఖంగుతిన్నాడు. అది రాద్దామనుకుంటూ వుండగానే ఈవిడ గారు ప్రత్యక్షమయేరు.

''సారీ మేడమ్ ఇంకా రాయలేదు...'' ఎపాలజిటిగ్గా అన్నాడు.

''వాట్, నిన్నరాత్రి అరెస్టు చేసిన వాణ్ణి గురించి ఇంకా ఛార్జ్‌షీట్ రాయలేదా? నిజం చెప్పండి. అతన్ని నిజంగా నిన్ననే అరెస్టు చేశారా?'' ఆమె దబాయిస్తూ అడిగింది.

''నిజంగానే నిన్న రాత్రి అరెస్టు చేశాను''

''ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్... నిన్న రాత్రి హైదరాబాద్‌లో ఓ వ్యక్తిని మర్డర్ చేసిన అబ్బాయి ఇవాళ ఫ్లైట్‌లో ఇక్కడికి పారిపోయి వచ్చేడని ఇన్ఫర్మేషన్ వచ్చింది. ఆ అబ్బాయి పేరు కూడా విజయ్‌కుమార్. అతనే ఇతనవడానికేమైనా ఛాన్సు వుందంటారా?''

''మౌళి గుండెల్లో గుర్రాలు పరుగెట్టనారంభించాయి. ఈ కేసు తను అనుకున్నంత ఈజీగా వున్నట్టు లేదు. అయినా, తను ఇలాంటప్పుడే ధైర్యంగా వుండాలి''

''నో మేడమ్, ఎట్టి పరిస్థితుల్లోనూ అలాంటి అవకాశంలేదు. అతని పేరు, ఇతని పేరు ఒక్కటే కావచ్చు కానీ, పెర్సన్ మాత్రం ఒక్కరు కావడానికి వీల్లేదు. బికాజ్''

''మీరు ఇతన్ని నిన్న రాత్రి అరెస్టు చేశారు''

''కరక్ట్ మేడమ్''

ఉషారాణి టేబిల్ మీదున్న బెల్ కొట్టింది. బయటనించి ముగ్గురు సూట్లు ధరించిన




వ్యక్తులు లోపల కొచ్చేరు.

"వుయ్ ఆర్ ఫ్రమ్ సి.బి.ఐ" అంటూ తమ ఐడెంటింటీ కార్డులు చూపించారు.

"యూకేన్ ప్రొసీడ్" అంది ఉషారాణి.

"ఇనస్పెక్టర్... మిమ్మల్నొసారి చెకప్ చెయ్యాలి" అన్నాడో సి.బి.ఐ. ఆఫీసర్.

"ఎ... ఎ... ఎందుకు" అని మౌళి అంటుండగానే ఆ ఆఫీసరు మౌళి రెండు జేబుల్లోనించి యాభై వేల రూపాయిల్ని బయటికి లాగేడు. మౌళి ముఖం తెల్లబారిపోయింది.

"ఈ డబ్బు మీకెక్కడనించి వచ్చిందో చెప్పగలరా?"

"అది... అది... మా ఆవిడకి నగలు చేయించమని, మా మావయ్యగారిచ్చేరు..."

స్టేషన్‌లోకి వస్తున్న సింధుజని, మధులతని చూసి మౌళికి గుండె ఒక్క క్షణం ఆగినట్టయింది.

"నో సార్! ఆ డబ్బుని ఆ విజయ్‌కుమార్ యిచ్చేడు" మధులత శాంత గంభీరస్వరంతో చెప్పింది.

"అబద్ధం... అయినా, అతనెందుకు నాకింత డబ్బు యిస్తాడు?"

"అతను హత్యచేశాడు కాబట్టి యిస్తాడు. నువ్వా హంతకుణ్ణి రక్షిస్తావని హామీ యిచ్చినందుకు యిస్తాడు. కేశవవర్మగారు నీకు చెప్పేరు కాబట్టి యిస్తాడు"

"నో... యిదంతా కట్టుకథ. నాకేం తెలియదు" చంద్రమౌళి అరిచాడు.

"నీకు తెలియనిది యిదికాదు ఇనస్పెక్టర్! నువ్వు ఎలాంటి నీచుడివో యస్పీగారికి తెలియజేయడానికి నేనే ఈ పథకం వేశాను. ఆ విషయం నీకు తెలియదు. విజయ్‌కుమార్‌ని నేనే పంపించేను. అదీ నీకు తెలియదు. కేశవవర్మగార్ని ఈ వూర్నించే నీతో మాట్లాడించేను. అదీ నీకు తెలియదు. యస్పీగారి సహకారంతో సి.బి.ఐ. ఆఫీసర్నుని నేనే పిలిపించాను. అదీ నీకు తెలియదు. హైదరాబాద్‌లో అసలు హత్యే జరగలేదు. అదీ నీకు తెలియదు. నీకు తెల్సిందల్లా అమాయకుల మీద నేరాలు మోపి వాళ్ళని నేరస్థులుగా ముద్రవేయడం, డబ్బుకోసం నేరస్థులకి కొమ్ము కాయడం...! యస్పీగారూ, ఈ చంద్రమౌళి మా సింధుజ విషయంలో ఎంత దారుణానికి ఒడిగట్టి, దీని జీవితం నాశనం కావడానికి ఎంత సహకారం అందించాడో మీకు అర్థమయ్యే వుంటుంది"

ఉషారాణి బాధ్యతగల ఆఫీసరుగా, మానవత్వం వున్న మనిషిగా కూడా బాధపడింది.

"యూసీ మిస్టర్ చంద్రమౌళి! శాంతిభద్రతల్ని రక్షిస్తామని ప్రమాణంచేసి మనం ఈ వుద్యోగాల్లోకొచ్చేం. ప్రజల్నించి పన్నులరూపంలో ప్రభుత్వం వసూలుచేస్తున్న డబ్బుని మనం జీతాలుగా తీస్కుంటూ, వాళ్ళని ఎంత బాగా రక్షిస్తున్నామో నాకంటే మీకే బాగా తెలుసు. వందమంది నేరస్థులు తప్పించుకున్నా ఫర్వాలేదుగానీ, ఒక్క నిర్దోషి కూడా శిక్షింపబడకూడదనే మన నియమాన్ని ఎంత బాగా అమలుజరుపుతున్నారో ఈ సింధుజ ఓ పెద్ద ఉదాహరణ. మనం మహాత్మాగాంధీలం కానక్కర్లేదు. మానవత్వం వున్న మనుషులుగా బతగ్గలిగితే చాలు. న్యాయాన్ని నిలబెట్టలేకపోతే వూరుకోండి. కానీ దాని ప్రాణం తీయాలని మాత్రం చూడకండి. మీరు నేరస్థుల్ని పట్టుకోలేకపోతే, అది మీ అసమర్థతగా భావించి, మరొకరిచేత ఆ పని చేయించగలను. కానీ మీరు అమానుషత్వానికి తలపడితే, మీవల్ల బలైపోయేవారిని మేం ఎలా వుద్ధరించగలం? నీలాంటివారిని క్షమిస్తే, అదికూడా నేరమే అవుతుంది. సో, ఫ్రమ్‌దిస్ మూమెంట్, యూ ఆర్ సస్పెండెడ్ ఫ్రమ్ యువర్ డ్యూటీస్" ఉషారాణి ఓ పోలీస్ అధికారిగానేకాకుండా, ఓ స్త్రీగా ఎక్కువ ఆవేశపడింది.

చంద్రమౌళి నడుము విరిగిపోయిన పాములా నిస్సహాయంగా చూశాడు. మధులత మరికాస్త ముందుకొచ్చి, "మీ నేరాన్ని బయట పెట్టడానికి నేను కోర్టుకెక్కి కూడా, ఓ వ్యక్తిగత కారణంవల్ల ఆ కేసుని విత్‌డ్రా చేసుకున్నాను. అప్పుడు నేను మీకు భయపడి, తోకముడిచేశానని మీరూ, మీ ఫ్రెండ్సూ, హేపీగా పార్టీ చేసుకున్నారు. నేను తోక ముడిచేసింది పంజా విసరడానికేనని యిప్పటికైనా అర్థమైందా?



ఆడదానివి నువ్వేం చెయ్యగలవే అంటూ సింధుజని మీరంతా గేలిచేశారు! నిన్న మీ భానుమూర్తి కోరలు పీకేసిందీ ఈ ఆడదే! యిప్పుడు నీ నడుము విరగ్గొట్టిన యస్పీగారూ ఆడవాళ్ళే! ఆమెచేతికి కర్ర అందించిన ఈ లాయర్ మధులతా ఆడదే!'' అంటూ యస్పీ గారివైపు తిరిగి ''మేడమ్, యిందాక మీరు మనసున్న మంచిమనిషిగా ఓ మాటన్నారు. యిలాంటివాళ్ళ అమానుష చర్యలకి బలి అయిపోయినవారిని ఎలా వుద్ధరించగలమూ అన్నారే... యిప్పుడు చెప్తున్నాను. యీ చంద్ర మౌళి, ఆ భానుమూర్తి వాళ్ళ వాళ్ళ వుద్యోగాలు, అధికారాలు వుపయోగించి సింధుజ జీవితంతో ఆడుకున్నందుకు వారిని శిక్షించడం జరిగింది. కానీ, సింధుజని ఏ వ్యక్తి అయితే వంచించి, వ్యభిచారని ముద్ర వేయించి, నడివీధికి నెట్టించాడో వాడిచేతే సింధుజకి తాళికట్టించి, సింధూ జీవితానికి ఓ ముగింపు యిస్తాను''

ఉషారాణి మనస్ఫూర్తిగా మధులతని అభినందిస్తూ, ''అలాచేస్తే తప్ప అలాంటి అవకాశవాదులకి బుద్ధిరాదు, యిలాంటి సింధుజలకి నిజమైన న్యాయం జరగదు. అవసరమైతే నేనూ మీకు సహకరిస్తాను. మీరు తప్పకుండా ఆ పని చెయ్యండి. కానీ, అతనికి మేరేజీ ఫిక్స్ అయిపోయింది. యిప్పుడేం చెయ్యగలరు? రఘుపతిగారికి ఈ ఫేక్ట్ అంతా చెప్తామంటారా?'' అంది.

''మీ సహకారానికి మెనీ మెనీ థేంక్స్! మేం మగాళ్ళమని వాళ్ళు గర్వపడుతూ ఎంత నాటకీయంగా ఓ చెడ్డపని చేశారో, మేమూ అంత నాటకీయంగానే ఓ మంచిపని చేస్తాం. భానుమూర్తి విషయంలో దయానందగారు సహృదయంతో సహకరించారు. ఈ చంద్రమౌళి విషయంలో మీరు ఎంతో సహకరించారు. మీ భరోసా ఎలాగూ వుంది కాబట్టి మరో రూట్లో నేనే ప్రొసీడ్ అవుతాను'' అంటూ మధులత తన కృతజ్ఞతలు తెలియజేసింది.

ఇనస్పెక్టర్ చంద్రమౌళి చాప్టర్ ఈవిధంగా ఓ కొలిక్కి వచ్చింది.

★ ★ ★

మర్నాడు మధులత భానుమూర్తి భార్య సుజాతని, చంద్రమౌళి భార్య రుక్మిణిని తన గెస్ట్‌హౌస్‌కి రమ్మని నౌఖరు బాలయ్యద్వారా కబురు చేసింది. వాళ్ళు వచ్చేక కాఫీ, ఫలహారాలు పెట్టి, కాసేపు ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పింది. తర్వాత సడెన్‌గా,

''నేను మీ భర్తల పట్ల ప్రవర్తించిన తీరు... బహుశా మీకు బాధ కలిగించి వుంటుంది'' అనేసరికి రుక్మిణికి, సుజాతకి ఏం బదులు చెప్పాలో తెలియక, ఒకర్నొకరు సంశయాత్మకంగా చూసుకున్నారు.

''నాకు తెలుసు. వుద్యోగంమీద బతికేవాళ్ళకి ఆ వుద్యోగం పోతే జీవనాధారం పోయినట్టే. అయితే, మీవాళ్ళ విషయంలో వుద్యోగాలు పోయినా, మీకు మరీ అంత నష్టంగాని, కష్టంగాని కలగదని నాకు తెలుసు. ఒకవేళ కలిగినా... నేను చెయ్యగలిగిందేమీ లేదు. ఎందుకంటే, వాళ్ళకి వుద్యోగాలు పోతే, వాళ్ళ మీద ఆధారపడినవాళ్ళే బాధపడతారు. కానీ, అలాంటివాళ్ళు వుద్యోగాల్లో వుంటే సింధుజలాంటి అమాయకులు ఎంతోమంది ఆహుతై పోయే ప్రమాదం వుంది''

మధులత వారి స్పందన గమనించడానికి ఒక్కక్షణం ఆగింది. రుక్మిణి చిన్నగా నవ్వుతూ, ''మీరు చెప్పింది కరెక్టేనండి. మావాళ్ళ వుద్యోగాలు పోవడం వుండడం సంగతి అటుంచితే, మీరు చాలా మంచిపని చేశారండి. ఎందుకంటే కోర్టులో ఓ నేరస్థుడికి శిక్ష వేసేటప్పుడు, అతను చేసే నేరాన్ని దృష్టిలో పెట్టుకునే శిక్ష విధిస్తారుగాని, అతన్ని జైలుకి పంపించడంవల్ల అతని కుటుంబం ఎంత నష్టపోతుందని ఆలోచించరు. అలా ఆలోచిస్తూపోతే ఏ ఒక్క నేరస్థుడ్ని న్యాయస్థానం శిక్షించలేదు. ఎందుకంటే ప్రతీ నేరస్థుడికీ ఓ కుటుంబం వుంటుంది కాబట్టి'' అనేసరికి మధులత శబ్దంకాకుండా చప్పట్లు కొట్టి అభినందించింది.

''నేను అంత బాగా చెప్పలేనుగాని, నా అభిప్రాయమూ అదేనండీ'' అంది సుజాత.

వారిద్దరివైపు తృప్తిగా చూసి, కళ్ళద్దాలు సవరించుకుంది మధులత.

''వెరీగుడ్... ఆవేశాలు, అపార్థాలు లేకుండా నన్ను సరిగా అర్థంచేసుకుంటున్నందుకు









# అందాలభామ హాబీ

అందాలపోటీలలో అదే పనిగా పాల్గొని అలిసిపోయిన హెలెన్‌స్మిత్ అనే ఈ సుందరాంగికి గొర్రెలంటే మహా ముద్దు. సౌత్ ఇంగ్లాండుకు చెందిన హెలెన్ తనవేకాక, ఇరుగుపొరుగు వాళ్ల గొర్రెలను కూడా పోగేసి వాటిని కొండచరియల మీదకి పంపి, ఆనక ఓ చక్కటి మోటారు సైకిలు మీద తను కూడా వెళ్లి సాయంకాలం దాకా వాటిని మేపి ఇంటికి తీసుకొస్తుంది. ఆవిడకి ఆ గొర్రెలకాపరి ఉద్యోగమే నచ్చుటమేమిటని ఇరుగు పొరుగువారు చెవులు కొరుక్కున్నా, బుగ్గలు నొక్కుకున్నా లక్ష్యపెట్టడం లేదట హెలెన్.

నాకు సంతోషంగా వుంది. ఇప్పుడు మీవాళ్ళ అధికారాలు పోయినా అహంమాత్రం పోలేదు. ఆ పని చెయ్యవలసింది మీరే! నాకు మీ కాపురాల విషయం తెలుసు. ఇతరులకి అపకారిగా వుండడం ఎంత తప్పో, అయినవాళ్ళకి అనుకూలంగా వుండకపోవడమూ అంతే తప్పు! వాళ్ళకి మీరు కనువిప్పు కలిగించాలంటే, మీరు కాస్త కఠినంగా ప్రవర్తించాలి''

''అలా ప్రవర్తిస్తే తప్ప కనువిప్పు కలగదంటారా?'' సుజాత సిన్సియర్‌గానే అడిగింది.

''బంగారం చాలా విలువైందే! అయినా దాన్ని ఓ అందమైన ఆభరణంగా మలచడానికి నిప్పుల్లో కాలుస్తున్నాం. సుత్తిదెబ్బలు వేస్తున్నాం. ఈ రెండుపనులూ దాన్ని కించపరచడానికి చెయ్యడంలేదుగా! బంగారంతో చేసిన దేవుడి విగ్రహానికి కిలిమి పట్టినప్పుడు చింతపండుతో తోముతాం. అది దేవుడి విగ్రహం, దాన్ని చింతపండుతో తోమడం ఏమిటని ఆలోచిస్తే, ఆ కిలిమి ఎలా వదుల్తుంది? మీ కాపురాల్లో ఎటువంటి యిబ్బంది వుందో మీకు తెలుసు. ఆ యిబ్బంది పోయి మీ వ్యక్తిత్వాలకీ ఓ గౌరవం కలగాలని కోరుకుంటున్నారు. కానీ, ఆ యిబ్బందిని ఎవరు తొలగిస్తారు? ఆ పని చెయ్యడానికి ఆకాశంనించి ఎవరో దిగి వస్తారనుకోవడం చాలా పొరపాటు''

రుక్మిణి, సుజాత శ్రద్ధగా పాఠం వింటున్న విద్యార్థుల్లా ఆమె చెప్పిందంతా విన్నారు. వారు మధులత చెప్పింది విని, ఆమోదించి, ఆనందంగా వెళ్తున్నప్పుడు, సుజాతతో ఆమె మరో విషయం చెప్పింది.

''రింగ్ మాష్టర్ **చేతిలో** ఓ బెత్తం వుంటే తప్ప జంతువులు అతను చెప్పినమాట వినవు. అలాగే నీకో వుద్యోగం, సంపాదన వుంటేతప్ప, యింట్లో నీ మాట చెల్లదు''

''ఔనండీ... నన్ను పోషిస్తున్నాననే అధికారంతోనే ఆయన నన్ను మరీ చులకన చేసేశారు'' ఆమె బాధని తమాయించుకుంటూ చెప్పింది.

''అదంతా నిన్నటి కథ. రేపట్నించి కొత్తకథ ఆరంభం కావాలి. రేపట్నించీ నువ్వు కేశవవర్మ గారి ఫాక్టరీలో వుద్యోగం చేస్తున్నావు. ఆ ఏర్పాటు చేశాకే నిన్ను పిలిచేను. రేపట్నించి వుద్యోగం నీ చేతిలో వుంటుంది. మీ యిద్దరి వెనుకా నేనుంటాను. ఇంక కావల్సిందల్లా మీ మనోధైర్యమే. ఆల్ ద బెస్ట్'' అంటూ వారిని ఆశీర్వదించి పంపించింది మధులత.



**చం**ద్రమౌళి, భానుమూర్తి యిళ్ళల్లో కొత్త అధ్యాయం ఆరంభమయింది.

పోలీసు అధికారిగా వుంటూ నిరంకుశంగా, పేట్రేగిపోయి ప్రవర్తించినవాళ్ళకి వుద్యోగంలో వున్నంతకాలం బతుకు రాజాలాగే గడిచిపోయేది. పరోక్షంలో తిట్టుకున్నా, ఎదుటవున్నప్పుడుమాత్రం మర్యాదగా, వినయంగానే ప్రవర్తిస్తారు. కానీ ఆ అధికారులు అవినీతి ఆరోపణల వల్ల వుద్యోగంనించి డిస్మిస్ అయిపోతేమాత్రం ఆ తర్వాత వాళ్ళది కుక్కబతుకేనని చంద్రమౌళికి బాగా తెలుసు. ప్రస్తుతం అతను ఆ అనుభవాన్నే పొందుతున్నాడు. వీధిలో వెళ్తుంటే మునుపు అందరూ గౌరవంగా మాట్లాడేవారు. కానీ యిప్పుడు చాలామంది పలకరించడమే మానేశారు. అతను ప్రస్తుతం సస్పెన్షన్‌లో వుండి సగం జీతం పొందుతున్నా త్వరలో ఆయన్ని డిస్మిస్ చేసేస్తారన్న రూమరు పాకడంవల్ల అతనిమీద జాలిపడేవాడుగాని, గౌరవించేవాడుగాని లేకపోయేరు. ఒకరోజు వీధిలోనించి వస్తుంటే కానిస్టేబులు కోదండం ఎదురుపడి, అలవాటుప్రకారం శెల్యూట్ చేసేసి, అంతలోనే నాలిక కరుచుకుని, ''సారీసార్, మీరు వుద్యోగంలో వున్నారనుకుని తొందరపడి శెల్యూట్ చేసేశాను.




క్షమించండి'' అన్నాడు.

''ఏం? నేను సస్పెన్షన్‌లో వుంటేమాత్రం నువ్వు శెల్యూట్ చెయ్యకూడదా. రేపోమాపో నేను మళ్ళీ డ్యూటీలోకొచ్చేస్తాగా'' అన్నాడు ధీమా వ్యక్తంచేస్తూ.

''మీరు మళ్ళీ వుద్యోగంలోకొచ్చే ఆశేం పెట్టుకోకండి. యస్పీ ఉషారాణిగారు మీ పాత వ్యవహారాలు కూడా తవ్వి తీసిమరీ మిమ్మల్ని యింటికి పంపించే ఏర్పాటు చేస్తున్నారు'' అన్న చావుకబురు చెప్పి వెళ్ళిపోయేడు వాడు. దాంతో మౌళి పూర్తిగా అప్‌సెట్ అయిపోయేడు.

ఇంట్లో రుక్మిణి కూడా అతనికి వ్యతిరేకంగా ప్రవర్తించనారంభించింది. జీతమంతా తన చేతిలో పెట్టుకోవడంతోపాటు, మౌళికి వచ్చే సగంజీతం కూడా తీస్కుని, అతనికి నెలవారీ ఖర్చుకింద కేవలం రెండువందలుమాత్రం యిచ్చింది. ఆ విషయంలో యిద్దరిమధ్య వాదన జరిగింది.

''రెండువందలు నాకేం సరిపోతాయి?''

''యింట్లో వుండేవారికి ఖర్చులేం వుంటాయ్? భోజనం, కాఫీ టిఫిన్లన్నీ యింట్లోనే జరిగిపోతున్నప్పుడు, వేరు ఖర్చులేం వుంటాయ్? ఒకవేళ వున్నా వాటిని తగ్గించుకోండి. రేపు మీ వుద్యోగం పోయినప్పుడు ఈ సగంజీతం కూడా రాదు. అప్పుడు నా ఒక్కజీతంతో మీ విలాసాల ఖర్చులు భరించడం కష్టంకదా?'' అంటూ రుక్మిణి సూటిగా చెప్పేసింది.

చంద్రమౌళికిప్పుడు కాలం గడవడమే కష్టమైపోయింది. తన విషయంలో లోకల్‌గా వచ్చే న్యూస్ పేపర్స్‌లో కూడా రాయడంవల్ల వీధిలో కెళ్తే తెలిసినవాడు, తెలియనివాడు కూడా తన సస్పెన్షన్ గురించే అడుగుతున్నాడు. కొందరు వ్యంగ్యంగా అడుగుతున్నారు. కొందరు జాలి నటిస్తూ అడుగుతున్నారు. ఎలా అడిగినా దుర్భరంగానే వుంది. యింట్లో కూర్చుని పత్రికలు, నవల్సు చదివే అలవాటు తనకి లేదు. రెండురోజులపాటు టీవీదగ్గర కూర్చుని కంటిన్యూగా తెలుగు ప్రోగ్రాములు చూశాక, 'ఈ టీవీ కార్యక్రమాలు కూడా మా పోలీసువాళ్ళ కార్యక్రమాల్లా ఛండాలంగా వున్నాయన్న మాట' అనుకున్నాడు.

టీవీ చూస్తున్న మౌళిదగ్గరకి రుక్మిణి రుసరుసలాడుతూ వచ్చి, ''చూడండి... మొన్నటివరకు మనిద్దరం వుద్యోగాలు చేశాం. నేను ఆఫీసు వర్కుతోపాటు యింటిపనులు కూడా చేసేదాన్ని. కాస్త సాయంగా మీ కానిస్టేబుల్ ఎవరో ఒకరు పనిచేసేవారు. కానీ యిప్పుడు మీకు వుద్యోగమూ లేదు. కానిస్టేబుల్సూ రావడంలేదు. పనిమాత్రం అలాగే వుంది. నాకు కాస్త సాయంచేస్తే తప్పేంలేదు. ఓ పనిమనిషిని పెట్టుకుంటే రెండుపూటలా భోజనం, ఓ పూట టిఫిన్ పెట్టి, నూరు నూట పాతిక యిస్తే తప్ప ఎవరూ ఒప్పుకోరు. మీకిచ్చే డబ్బు కట్ చేసి పనిమనిషిని ఆ డబ్బుకి పెట్టుకోమంటారా? లేక మీరే నాకు సాయంచేస్తారా? ఒకవేళ, నేనిలా చెప్పడం తప్పనుకుంటే, యిప్పుడే మధులతగార్ని పిలిపిస్తాను. ఆవిణ్ణే అడగండి'' అంది. మధులత ప్రస్తావన వచ్చేసరికి చంద్రమౌళిలో తెలియని భయం ప్రవేశించింది.

''ఈమాత్రందానికి ఆవిణ్ణి పిలవడం ఎందుకు. నేను చెయ్యనంటేకదా. ఏం చెయ్యమంటావో చెప్పు'' అన్నాడు. ఆమె ఏదో పని పురమాయించింది. వీధి తలుపు గడియ పెట్టొచ్చి, కూరగాయలు తరగనారంభించాడు.

''సర్ఫ్ పేకెట్ అయిపోయింది. నేను వెళ్ళి తీసుకొస్తాను. పొయ్యిమీద బియ్యం పెట్టేను. పొంగు వస్తుందేమో చూడండి'' అంటూ రుక్మిణి వీధి తలుపు తీసుకుని బయటికెళ్ళింది. ఆమె వెళ్ళిన ఓ అరనిమిషానికి ఎప్పుడూ ఆ యింటికిరాని బాలన్ యింట్లోకొచ్చేడు. అతన్ని చూస్తూనే మౌళి కంగారుపడి కూర్చున్నచోట నించి లేచిపోయి, ''ఏవిటీ యిలావచ్చేశావ్? మా ఆవిడకి జ్వరంగా వుండేనూ... కాస్త సాయం చేద్దామని'' అన్నాడు.

'వీడిదుంపతెగ. తను అధికారంలో వున్నప్పుడు ఏనాడూ వీడు యింటికి రాలేదు. వీడిని ఆడంగి వెధవా అని తను తిట్టేడు. యిప్పుడు సరిగ్గా తను కూరగాయలు తరుగుతున్నప్పుడే వీడి కంటబడ్డాను అనుకున్నాడు మనసులో

''మీ ఆవిడగారికి ఒంట్లో బాగులేదా?'' అత

ను వ్యంగ్యంగా అడిగేడని తెల్సిపోతోంది.

"ఔనయ్యా... నూటనాలుగు డిగ్రీల జ్వరం. మంచం దిగలేకపోతుంటేను"

"మరి మీ మిస్సెస్ యిప్పుడే నాకు వీధిలో కనిపించేరే?"

చంద్రమౌళి ఖంగుతిన్నట్టుగా చూసి, లేని గంభీరత ప్రదర్శిస్తూ అన్నాడు "అయితే ఏంటట?"

"అదికాదు సార్! భార్యకి సాయం చేస్తే తప్పేంలేదని చెప్తున్నాను. అందులోనూ మీరిప్పుడు ఖాళీయేగదా!"

ఆమాట అంటున్నప్పుడే పొయ్యిమీద పెట్టిన బియ్యం పొంగువస్తే మౌళి గబగబా వెళ్ళి గరిటెతో కలిపి, మళ్ళీ బాలన్దగ్గరకొచ్చేడు. "యింతకీ నువ్వు ఎందుకొచ్చినట్టు?" అన్నాడు.

"మరేంలేదండీ... మీరిప్పుడు ఖాళీయే గదా! మీరు కూడా నాలాగే ఎల్.ఐ.సి. ఏజెన్సీ తీసుకుంటే మీకు కాలక్షేపమూ అవుతుంది. నాలుగు డబ్బులూ వస్తాయికదాని..." అంటూ కూర్చుని భుజానికున్న సంచిలోనించి ఏవో పుస్తకాలు తీయబోయేడు. కానీ వీడొచ్చింది తనని వేళాకోళం చెయ్యడానికే అనుకుని అతన్ని తిట్టి బయటికి పంపేశాడు.

పాడు వెళ్ళేముందు కొరడాదెబ్బలాంటి ఓ మాట వదిలిమరీ వెళ్ళిపోయేడు.

"నాగుపాము శివుడిమెడలో వున్నంతకాలమే అది భక్తులచేత పూజించబడుతుంది. కానీ, అది ఆ స్థానాన్ని వదిలి, బయటకొస్తే అదే భక్తులు దాన్ని కొట్టి చంపేస్తారు. అధికారంలో వున్నప్పుడు పేట్రేగిపోయినవాళ్ళ గతీ అంతే"

చంద్రమౌళిమీద ఆ మాట బాగానే ప్రభావం చూపించింది.

★ ★ ★

సుజాత ఉద్యోగానికి వెళ్తుండడంవల్ల భానుమూర్తి యింట్లోనే వుంటున్నాడు. వీధిలోకొస్తే చంద్రమౌళికి ఏర్పడిన యిబ్బందే యితనికీ ఎదురవడంవల్ల వీధి ముఖం చూడ్డం మానేశాడు. నిన్ననోసారి వెనకటిలాగే సుజాత మీద ఏదో విషయంలో కోపాన్ని ప్రదర్శించబోతే సుజాత గట్టిగానే హెచ్చరించింది.

"మునుపు మీరు నన్ను ఎంత హీనంగా చూసినా, బయటకెళ్ళినప్పుడు నేను ఫలానా భానుమూర్తిగారి పెళ్ళాన్నని చెప్పుకుని గౌరవం పొందేదాన్ని. కానీ యిప్పుడలా చెప్పుకుంటే నన్ను ఛీకొడతారు, మీ చరిత్ర అంతలా వ్యాపించిపోయింది. అందుకే నేను నేనుగానే బతుకుతున్నాను. మునుపు మీరేం అనేవారో గుర్తుందా? నేను నిన్ను పోషిస్తున్నాను కాబట్టి నువ్వు నాకు బానిసకిందే లెక్క అన్నారు. నిన్ను జుట్టుపట్టుకుని బైటకీడ్చేస్తే నువ్వు పిచ్చికుక్కలా వూరంట తిరగాల్సిందే అన్నారు. ఇప్పుడు అవే మాటలు నేను అనడమా, మానడమా అనేది మీ ప్రవర్తనమీదే ఆధారపడి వుంటుంది"

ఆ హెచ్చరిక తర్వాత భానుమూర్తి మూడొంతులు తగ్గిపోయేడు. సరిగా అలాంటి సమయంలోనే బెజవాడనుంచి వనజ సూట్కేసు పట్టుకుని దిగిపోయింది. ఆమెను చూస్తూనే మూర్తి రాకూడని వ్యక్తి వచ్చేసినట్టుగా కంగారు పడ్డాడు. ఆ సమయంలో సుజాత యింట్లోలేదు.

ఏడాదిన్నరక్రితం యిదే వనజ విజయవాడనించి వచ్చినప్పుడు యింట్లోనే వుంచి సరసాలు సాగించాడు. "మీరు బైట ఎన్నిరకాలుగా తిరిగినా నేను అడ్డుపెట్టను. కానీ యిలాంటి బజారుమనుషుల్ని తీసుకొచ్చి నా కళ్ళముందు, నా యింట్లోనే సరసాలాడుతుంటే నేను సహించలేను" అంటూ సుజాత ఎదిరించింది. సహించకేంచేస్తావే అంటూ ఆమెను చావగొట్టేడు. వనజకి కూడా సుజాత చేత సపర్యలు చేయించాడు. ఆమె బట్టలు వుతికించాడు. 'ఇంట్లోవాళ్ళు వేలెత్తి చూపిస్తే బయటవాళ్ళు కాలెత్తి చూపించరా' అన్న సామెతని వనజ నిజంచేస్తూ సుజాతని హీనంగా చూసి, మాట్లాడింది.

భానుమూర్తి పొజీషన్ తెలియక వుత్తరం కూడా రాయకుండా ఫోన్ చేయకుండా సరాసరి సూట్కేసుతో దిగిపోయిందిప్పుడు.

ఆమెను వెంటనే వెళ్ళిపొమ్మన్నాడు. "నీకో నాలుగురోజులు ప్రోగ్రాం యిచ్చి ఓ వదివేలు




పట్టుకెళ్దామనొస్తే, పొమ్మంటావేం. నేను పోను'' అంటూ ఖచ్చితంగా చెప్పేసింది.

"స్ట్రైన్‌లో ఒళ్ళంతా హూనమైపోయింది. ఓ రెండు పెగ్గులు వేసి కాసేపు పడుకోవాలి బాస్. ఏదీ మీ చరణదాసి ఎక్కడా కనబడ్డంలేదు. అది బిర్యానీ భలేగా చేస్తుంది. దానిచేత చికెన్ బిర్యానీ చేయించు'' అంటూ చనువుగా అతని రూమ్‌లోకెళ్ళి బీరువాలోనించి బ్రాందీబాటిల్ తీసి గ్లాసులో పోసుకుని తాగనారంభించింది. సరిగా అదే సమయానికి సుజాత వచ్చింది. ఆమెతోపాటు మధులతా వచ్చింది.

ఇంకేంవుంది, నా పని అయిపోయింది అనుకుంటూ గడగడలాడేడు భానుమూర్తి. వనజని చూస్తూనే సుజాత రెచ్చిపోయి, ''యిదే ఆంటీ, అప్పుడు నేను చెప్పేనే వనజని! ఆ రంగులరాట్నం యిదే'' అంది.

మధులత వనజని ఓసారి నఖశిక పర్యంతం చూసింది.

వనజ కూడా ఆమెను అలాగే చూసి, ''ఎవరీ ఆంటీ?'' అంది వ్యంగ్యంగా.

మూర్తికేం చెప్పాలో అర్థంకాలేదు.

మధులత మూర్తిని ఓసారి అసహ్యంగా చూసి, ''ఎలుగుబంటి తోలు ఎన్నాళ్ళు వుతికినా నలుపు నలుపేగాని తెలుపురాదూ అంటారు. నువ్వూ ఆ ఎలుగ్గొడ్డు జాతివాడివేనన్నమాట. నీగురించి, దీన్ని గురించి సుజాత యింతకుముందే చెప్పింది. యింత జరిగి, నీ కొమ్ములు విరిచేసినా, యింకా నీ బుద్ధి బురదలోనే దొర్లుతోందన్నమాట'' అంది.

''నో మేడమ్. దీన్ని నేను రమ్మనలేదు. నాకు చెప్పకుండా అదే వచ్చేసింది'' ముఖం దీనంగా పెట్టి అన్నాడు.

''నీకు చెప్పకుండానే నీ బెడ్‌రూమ్‌లో దూరిపోయి మందు కొడుతోందా?''

మూర్తి తల దించుకున్నాడు.

''సరే, నీమాటే నిజమనుకుందాం. నాకో విషయం చెప్పు. నువ్వు దీన్ని యింటికి తెచ్చుకున్నట్టే, మీ ఆవిడా మరో మగాణ్ణి యింటికి తెచ్చుకుందే అనుకో. అప్పుడు నువ్వేంచేస్తావ్?'' సూటిగా అడిగింది మధులత.

జవాబు చెప్పడానికి మూర్తి సంశయిస్తూ వుండిపోయేడు.

''నాకు కావలసింది నువ్వు నీళ్ళు నమలడం కాదు, సమాధానం. నువ్వేం చేస్తావో నాకు చెప్పాలి'' రెట్టించి అడిగింది మధులత.

''చావగొడతాను''

''అదేపని యిప్పుడు నీ పెళ్ళాం చెయ్యాలి. కానీ అది మామూలు పద్ధతి. కాబట్టి ఆ పని నువ్వే చెయ్. చెయ్యకపోతే వూర్కోను చెయ్'' ఆజ్ఞాపిస్తున్నట్టుగా అరిచింది. గెస్ట్‌హౌస్‌లో సింధుజచేత కొట్టించినట్టుగా యిప్పుడు సుజాతచేత తనని కొట్టిస్తుందేమోనని భయపడి వనజ చెంపమీద ఫెడీమంటూ లెంపకాయ కొట్టేడు. అయితే వనజ వూరుకోలేదు.

''నీ పెళ్ళాంముందు నన్ను కొడతావ్రా రాస్కెల్'' అంటూ మూర్తినీ లాగి కొట్టింది. మూర్తి దిమ్మెరపోయేడు. ఆమెను తిరిగి కొట్టబోతుంటే మధులత ఆపుచేసింది. వనజ సూట్‌కేసు పట్టుకుని గబగబా వెళ్ళిపోయింది.

''చూసేవా మూర్తీ! ఈ ఒక్క సంఘటనతో దాని చరిత్రమొత్తం తెలిసిపోయింది. నీ భార్యముందో బజారుమనిషి నిన్నో దెబ్బ కొడితే నీకెంత బాధ, అవమానం కలిగాయి? మరి నువ్వు, అదే కిరాయి మనిషిదగ్గర మీ ఆవిణ్ణి కొట్టేవు. దానికి మీ ఆవిడచేత సపర్యలు చేయించేవు. అప్పుడు నీ భార్య ఎంత బాధపడివుంటుందో ఆలోచించేవా?''

మూర్తి కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

★ ★ ★

గెస్ట్‌హౌస్‌కి ఆనుకుని వున్న గార్డెన్‌లో మధులత, సింధుజ కూర్చున్నారు. మధులత ఆరోజు సింధుజ పెళ్ళి విషయం ప్రస్తావించింది. ప్రభాకర్ తండ్రివల్ల చెడ్డవాడయ్యేడేగాని, స్వతహాగా చెడ్డవాడు కాదని నా అనుమానం. నిన్ను అపఖ్యాతిపాలు చేసిన వ్యక్తిని తిరిగి దెబ్బకొట్టడం ఒకపద్ధతి. అతన్లో పరివర్తన కలిగించి, నీ మనిషిగా చేస్కోవడం రెండోపద్ధతి! మొదటి పద్ధతివల్ల ప్రతీకారం తీరుతుంది. కానీ మన వుద్దేశం అదికాదు. అందుకే నీ పెళ్ళి అతన్తో జరిపించాలని నిర్ణయించేను. ఈ పెళ్ళి గనక జరిగితే, అదే నువ్వు సాధించిన ఘనకార్యమవుతుంది. దగా



పడిన చాలామంది ఆడపిల్లలకి నీ కథ ఆదర్శమవుతుంది. సత్యవంతుడు చనిపోతే, యముడితో వాదించి సావిత్రి తన భర్త ప్రాణాలు తిరిగి తెచ్చుకుందంటాడు. కానీ అది పురాణం. నిజంగా జరిగిందో లేదో ఎవరూ చెప్పలేరు. కానీ నీ పెళ్ళి విషయంలో నువ్వు విజయం సాధిస్తే దాన్ని పుక్కిటి పురాణంగా కాదు, ఈనాటి స్త్రీ గెలుపుగా చెప్పుకుంటారు. రేపటికది చరిత్రవుతుంది''

సింధుజ అంతా మౌనంగా విని, ఓ మాట చెప్పింది, ''నా తండ్రి, నా పినతల్లి కూడా చెయ్యలేని మహోపకారాన్ని నువ్వు చేశావు ఆంటీ! నువ్వు జరిపించే న్యాయాన్ని, నువ్వు చెప్పే నిర్ణయాన్ని నేను శిరసావహించడమే తప్ప ప్రశ్నించే హక్కు నాకు లేదు. నువ్వేం చెయ్యమంటే అదే చేస్తాను''

సింధుజ తలని ప్రేమగా నిమిరి, ఆమె కళ్ళనించి జారబోతున్న నీటిని తన కర్చీఫ్‌తో తుడిచింది మధులత.

★ ★ ★

సింధుజని గెస్ట్‌హౌసులోనే వుంచి వంటమనిషి బాలయ్యని తీస్కుని మధులత కారులో ఎక్కడికో వెళ్ళి సాయంత్రం వచ్చింది. అలాగే మర్నాడు వుదయం కూడా బాలయ్యని తీసుకునే ప్రభాకర్ యింటికి వెళ్ళింది.

శుభలేఖలమీద పేర్లు రాస్తూ ప్రభాకర్, మట్టయ్య బిజీగా వున్నారు. అప్పటికింకా పెళ్ళి నాలుగురోజులే వుంది. కారు దిగి, యింట్లోకొచ్చిన మధులతని చూసి, సడన్‌గా యింట్లోకి ఓ సింహమో, పులో వచ్చినట్టుగా ప్రభాకర్ కంగారుపడ్డాడు. మట్టయ్య కూడా భయపడినా, వెంటనే సర్దుకున్నాడు.

''నేనెవరో యీ పాటికి మీకు తెలిసే వుంటుంది కాబట్టి, ప్రత్యేకించి పరిచయాలు అక్కర్లేదనుకుంటాను'' అంటూ వాళ్ళు కూర్చోమనకుండానే అక్కడున్న సోఫాలో కూర్చుంది.

ఆమె రావడం గమనించి అన్నపూర్ణ కాఫీ పట్టుకొచ్చి యిచ్చింది. ఆమెనోసారి నఖశిఖపర్యంతంచూసి ''నేనెవరో తెలుసామ్మా?'' అంది మధులత.

''మా ఆయన, మా అబ్బాయి మధులత అనే ఆవిడ గురించి మాట్లాడుకోవడం విన్నాను. మిమ్మల్ని చూడగానే వీళ్ళిద్దరూ కంగారు పడ్డారంటే, బహుశా మీరే ఆ మధులత అయి వుంటారనుకున్నాను'' అంది అన్నపూర్ణ ఎంతో వినయంగా.

''మేమేం కంగారుపడలేదుగాని, నువ్వు నోర్మూస్కుని లోపలకెళ్ళు'' మట్టయ్య గదమాయించేసరికి ఆమె తలవంచుకుని లోపలకెళ్ళిపోయింది.

మధులత చిన్నగా నవ్వుతూ, ''అంటే మీరు ప్రతిరోజూ నా గురించి చర్చించుకుంటున్నారన్నమాట. థాంక్స్'' అంటూ హేండ్‌బాగ్ లోనించి ఓ శుభలేఖ తీసింది. దానిమీద మట్టయ్య పేరు రాసి, అతని చేతికిచ్చింది.

''ఏంటిది?''

''శుభలేఖ''

''ఆ సంగతి అవుపడతానేవుంది. కానీ ఎవరి పెళ్ళి అని అడుగుతున్నాను''

''సింధుజకి పెళ్ళిచేస్తున్నాను''

ప్రభాకర్, మట్టయ్య ఆశ్చర్యంగా ఒకర్నొకరు చూసుకున్నారు. అంతలోనే మట్టయ్య వ్యంగ్యంగా నవ్వుతూ- ''పోన్లేమ్మా, మీరైనా పూనుకుని ఆ పిల్లకి పెళ్ళిచేస్తున్నారు. లేకపోతే అలాంటి పిల్లని పెళ్ళిచేస్కోడానికి ఏ వెధవా సిద్ధపడడు'' అంటూనే శుభలేఖ కవరు మీదున్న కల్యాణమంటపం పేరు, సుముహూర్తం చూశాడు.

ప్రహ్లాద కళ్యాణమంటపం. ముహూర్తం శనివారం రాత్రి ఏడు గంటల యిరవై రెండు నిమిషాలకి! తండ్రీ కొడుకులు కాస్త కంగారుపడ్డారు. ప్రభాకర్ మరోసారి చూశాడు. తన పెళ్ళి కూడా అదే కల్యాణమంటపంలో, అదేరోజు అదే ముహూర్తానికి జరగబోతోంది. అక్కడ ఒకే బిల్డింగులో గ్రౌండ్ ఫ్లోర్‌లో ఒకటి, ఫస్ట్ ఫ్లోర్‌లో మరొకటీ వున్నా, రఘుపతిగారు రెండుఫ్లోరుల్నీ కలిపే తీసుకున్నారు. అలాంటప్పుడు సింధుజ పెళ్ళికి ఒక మంటపం అద్దెకిచ్చే అవకాశమేలేదు.

''మా అబ్బాయి పెళ్ళి అదే మంటపంలో అదే ముహూర్తానికి జరుగుతున్నప్పుడు అక్కడ నువ్వెలా పెళ్ళిచేస్తావమ్మా?'' అన్నాడు

 

మట్టయ్య వ్యంగ్యంగా.

దానికి బాలయ్య జవాబు చెప్పేడు, ''సింధుజమ్మగారి పెళ్ళి మీ కల్యాణ మంట పంలో మీ ముహూర్తానికే జరగడం కాదండి, మీ అబ్బాయిగారితోనే జరుగుతున్నాది. కవ రులో వున్న కార్డు చూడండి''

మట్టయ్య మధులతవైపోసారి రౌద్రంగా చూసి, లోపలున్న కార్డుతీశాడు. వరుడి పేరు ప్రభాకర్ అనే వుంది. వరుడి తండ్రి పేరు మట్టయ్యానే వుంది.

''ఏంటిది? నాకు తెలియకుండా నా కొడుకు పెళ్ళెలా జరుగుతుంది?'' శుభలేఖని చిరాగ్గా నేలక్కొట్టి అడిగాడు.

''మీకు తెలియాలనే కార్డు ప్రింటు చే యించి, నేనే స్వయంగా వచ్చి మరీయిస్తున్నా ను'' ఒక్కోమాటని ఒత్తిఒత్తి పలుకుతూ మధు లత చెప్పింది.

''శుభలేఖ అచ్చువెయ్యగానే పెళ్ళి జరిగిపో తుందనుకున్నావా?''

''శుభలేఖ నేలమీద పారెయ్యగానే పెళ్ళి ఆగిపోతుందనుకున్నావా? సింధుజ పెళ్ళి నీ కొడుకుతోనే జరిపిస్తాను?''

''ఎలా జరిపిస్తావు? ఓ పదిమంది రౌడీల్ని పెట్టి, మావాణ్ణి కొట్టించి, వాడిచేత తాళికట్టి స్తావా?'' మట్టయ్య చాలా ఆవేశపడుతూ అడి గాడు. ప్రభాకర్‌కైతే యీ వాదనేవిటో అర్థంకా వడంలేదు.

''రౌడీలు, గూండాలు జోక్యం చేస్కోడానికిది రాజకీయమూ కాదు, జరగబోయేది ఎలక్షనూ కాదు. పెళ్ళి! ఆ పెళ్ళి మా సింధుజకి, మీ ప్రభాకరానికే జరుగుతుంది. మీరు ఏ పెద్దల ముందైతే మీ అబ్బాయి పెళ్ళిని, రఘుపతి గారి కూతుర్తో జరిపించాలనుకుంటున్నారో, ఆ పెద్దల సమక్షంలోనే, ఆ పెళ్ళికి బదులు, యీ పెళ్ళి జరుగుతుంది. ఏ అమ్మాయి మీదనైతే మీరు అన్యాయంగా వ్యభిచారని ముద్రవేసారో, ఆ అమ్మాయే మీ యింటికి కోడలిగా వస్తుంది''

''ఏం, ఛేలంజ్ చేస్తున్నావా?'' మట్టయ్య రెట్టించాడు.

''ఛేలంజే అనుకో''

''నీ ఛేలంజ్‌లు నాదగ్గర కాదు. మీ అంతు తేలుస్తానని కోర్టుకెక్కిందానివి, తీరా కోర్టులోకె ళ్ళి తేక ముడిచేసిందానివి, యిప్పుడు నేను తలపెట్టిన పెళ్ళిని ఆపుచేస్తావా? అసంభవం'' మట్టయ్య గొంతు పెంచి అరిచా డు.

''నేను తోకముడిచేసి వూరుకున్నానో, పంజా విసిరి భానుమూర్తిని, చంద్రమౌళినీ పడగొట్టేనో తెల్సి కూడా అలా మాట్లాడ్డం మీ మూర్ఖత్వమే అవుతుంది. మళ్ళీ పెళ్ళి పందిట్లో కలుసు కుందాం'' అనేసి, బాలయ్యని తీస్కుని వెళ్ళి పోయింది మధులత.

ఆ యింట్లోని వాతావరణం వేడెక్కిపో యింది. మట్టయ్య ఏదో ఆవేశపడ్డాడు గాని, మధులత అంతలా ఛేలంజ్ చేసి మరీ చెప్పే సరికి గుండెల్లో ఎక్కడో ఒణుకు ఆరంభమ యింది. ఆవిడ ఏ నపోర్టు చూసుకుని అంత ఛేలంజ్ చేసిందో అతనికి అర్థంకావడంలేదు. ప్రభాకర్ కేవలం మౌనప్రేక్షకుడిలా వుండి పోయి, జరిగిన సంభాషణంతా గుర్తుప్పగించి చూశాడు. మధులత నిష్క్రమణం తర్వాతే అతనూ యీ లోకంలో కొచ్చిపడ్డాడు.

మట్టయ్యకి మెదడంతా మొద్దుబారిపోయి నట్టయింది. బీరువాలోనించి విస్కీ బాటిల్ తీసి, గ్లాసులో సగానికి ఒంపి, మిగతా సగానికి నీళ్ళు వేస్కునితాగాడు. అన్నపూర్ణ గుమ్మం దగ్గరకొచ్చి ''యింతకీ మనబ్బాయి పెళ్ళి రఘుపతిగారి అమ్మాయితోనా? ఆ సింధుజ తోనా?'' అని అమాయికంగా అడిగింది.

అంతే! మట్టయ్య ఛర్రుమంటూ లేచి, చే తిలో వున్నగ్లాసుని ఆమెమీదకి విసిరాడు. ఆమె తప్పుకోవడంవల్ల గ్లాసు నేలమీద పడి, భళ్ళు మంటూ బద్దలయింది.

''ఏమే, నీకూ వెటకారమై పోయిందా? ఈ మట్టయ్య వేసిన ప్లానంటే, మాటలూ మజాకా అనుకున్నారా, నువ్వూ అదీ అలా వెటకారం చేసి మాట్లాడుతున్నారు? నా పథకం ఏమైనా బెడిసికొడితే, యీ వూరికే అగ్గెట్టేస్తాను. ఈ మట్టయ్యంటే ఏటనుకున్నారో'' అంటూ మట్ట య్య ఆవేశంతో చిందులు వేశాడుగాని, యిందులో ఒక్క అక్షరం కూడా వినకుండా అన్నపూర్ణగ్లాసు విసరగానే భయపడి పక్కగది

లోకి పారిపోయింది.

మట్టయ్య మరో రెండు పెగ్గులు తాగి, అటు యిటు తిరుగుతూ ఆలోచన తట్టడంకోసం కుడిచేత్తో తలమీద కొట్టుకున్నాడు. ఆడది అంత ఛేలంజింగా మాట్లాడుతుంటే, మగాణ్ణయి వుండి ఆ మాత్రం ఫోర్స్ వుపయోగించకపోతే భాగోదని అలా రెచ్చిపోయేడు గాని, యిప్పుడు ఆలోచిస్తే భయం కలుగుతోంది. భానుమూర్తి, చంద్రమౌళి యిద్దరికిద్దరూ మాయగాళ్ళే! అయినా వాళ్ళని పురుగుల్ని ఏరి పారేసినట్టు ఏరేసింది. అనూహ్యామైన ట్రిక్కులువేసి మరీ, వూపిరాడకుండా వుచ్చు బిగించింది. ఇప్పుడు నా మెడకి వుచ్చు బిగిస్తానని నా యింటికొచ్చి మరీ సవాల్ చేసిందంటే ఏదో పకడ్బందీగానే చేసుండాలి.

పెళ్ళి ఆపుచెయ్యడానికి ఆమెకుండే అవకాశాలేమిటి? రౌడీల్ని రంగంలోకి దింపనంటోంది! ఒకవేళ రఘుపతిగారి దగ్గరకెళ్ళి ప్రభాకర్ సింధుజని ప్రేమించి, పెళ్ళిచేసుకుంటానన్న విషయం చెప్పేస్తుందా? చెప్పుడు మాటలు వినొద్దని తను రఘుపతికి చెప్పడమైతే చెప్పేడుగాని, ఒకవేళ ప్రభాకర్ సింధుజకి రాసిన వుత్తరాలు...

మట్టయ్య ఆగిపోయేడు. ప్రేమ విషయం తెలియజేయడానికి ఆ వుత్తరాలు, ఫోటోలూ ఒక్కటే ఆధారం! వాటిని చూపిస్తే రఘుపతి ఆవేశపడొచ్చు. ఆ ఆధారాల్తోనే యీ పెళ్ళి జరిపించాలనుకుంటే, రఘుపతిగారికి వాటిని యిప్పుడే చూపించొచ్చు కదా! పెళ్ళి రోజుదాకా ఆగడమెందుకు? మట్టయ్య అంతకంటే ఏమీ ఆలోచించలేకపోయాడు. ఏమైనా తమమీద ఆ మధులత సాధించాలనుకుంటే, అందుకు ఆ వుత్తరాలు, ఫొటోలే ఆధారం! కాబట్టి, వాటిని ఎలాగైనా సంపాదించి నాశనం చేసెయ్యాలి. లేకపోతే. యీ పెళ్ళి జరగదు, పెళ్లివల్ల వచ్చే కోట్లాది ఆస్తీ దక్కదు. సింధుజమీద చేసిన కుట్రకి ఫలితమూ దక్కదు.

ఎలా సంపాదించాలి?

ఇదీ యిప్పటి సమస్య! అసలా ఫొటోలూ, వుత్తరాలూ యిప్పుడు ఎక్కడున్నాయి? సింధుజని వాళ్ళు పిన్ని కట్టుబట్టల్తో తగిలేసినప్పుడు, అవన్నీ ఆవిడ దగ్గర వుండడానికి అవకాశంలేదు. ఒకవేళ, ఆవిడే అరెష్టయినరోజున, పర్సులో వాటిని పెట్టుకునే ఆఫీసుకెళ్లిందా? సమాధానం దొరకలేదు.

బాలయ్య యిప్పుడు మధులత, సింధుజల దగ్గరే వుంటున్నాడు కాబట్టి, వాడికి దిట్టంగా మందూ, డబ్బూ కొట్టించి, వాటిని పట్టుకొచ్చే బాధ్యత అప్పజెప్తే, అవి ఎక్కడున్నా వాడే పట్టుకొచ్చేస్తాడు. ప్రభాకర్‌కి యీ అయిడియా చెప్తే-

"బాగానే వుంది, కానీ వాడు మనకి సాయంచేస్తాడా?" అంటూ సందేహం వ్యక్తంచేసాడు.

"వాడు చెయ్యడు. కానీ వాడిచేత డబ్బేచేయిస్తుంది. పదివేలు వాడిబతుక్కి అసాధ్యమైన ఎమౌంటు, మనకి అతి చిన్న ఎమౌంటు. మనకి రాబోయే కోట్లాది ఆస్తికి, యీ పది వేల ఖర్చూ ఓ లెక్కలోనిది కాదు. యిప్పుడు డబ్బుకోసం చూసుకుంటే అసలుకే మోసం వచ్చేలాగుంది. బాలయ్యగాడి గురించి విన్నాను. పది సీసాల బ్రాందీ యిచ్చి నీ పెళ్ళాన్ని వదిలేస్తావా అంటే, వదిలేస్తాడట. అంచేత యీ రాత్రికే వాడితో మాట్లాడతాను" అన్నాడు మట్టయ్య ఎంతో నమ్మకాన్ని వ్యక్తంచేస్తూ.

★ ★ ★

అన్నప్రాశననాడే ఆవకాయ పెట్టడం, బారసాల రోజునే బ్రాందీ చుక్కలు వెయ్యడంలాంటి పనులు సరదాగా చెప్పుకునేవేగాని, సాధారణంగా జరిగేవి కావు. కానీ బాలయ్య విషయంలో నిజంగానే జరిగింది. బాలయ్య తల్లి పురిట్లోనే చనిపోతే, అతని తండ్రి వెంకయ్యే అతన్ని పెంచేడు. బాలయ్య వూరికే రాత్రంతా ఏడుస్తుంటే, వాడిని నిద్రపుచ్చడానికి ఓ నాలుగు చుక్కల సారా వాడి నోట్లో పోసేవాడు, దాంతో తెల్లారేవరకు కిక్కురుమనకుండా నిద్రపోయేవాడు. యవ్వనంలోకొచ్చిన కొడుకుల్ని చూసి "చేతికి అందొచ్చిన కొడుకులు" అంటుంటారు. కానీ, బాలయ్య తండ్రికి ఏడోఏటనించే, చేతికి అందొచ్చే కొడుగ్గా కాకపోయినా, మందుకి అందొచ్చే కొడుగ్గా మారిపోయేడు. ఇప్పటికీ వాడిలో కోరిక తీరకుండా వుండిపోయింది. స్కాచ్ విస్కీని నీళ్ళు కలపకుండా




తాగాలని, ఒక్కసారిగా పదివేల రూపాయల్ని ఒక్క కట్టగా చేత్తో పట్టుకోవాలన్నది వాడి జీవితాశయం. అది గూడా, తను ఎప్పుడైనా, ఏదైనా ఓ ఘనకార్యం చేస్తే, దానికి బహుమతిగా ఆ రెండూ పొందితే అది వాడి జీవితంలో మరుపురాని రోజు అవుతుంది.

స్వయాన వాడి యింటి కొచ్చిన మట్టయ్యే సరిగ్గా అవే బహుమతిగా యిస్తానన్నాడు. అనడమే కాకుండా, స్కాచ్ బాటిల్‌ని, పదివేల రూపాయిల కట్టని సంచిలోనించి తీసి, వాడి కళ్ళముందు గాలిలో ఆడించేడు. "ఈ రెండూ కావాలంటే, నాకో సంగతి చెప్పాలి" అన్నాడు మట్టయ్య.

"ఏంటండి?" అన్నాడు ఆ రెండింటినే రెప్పార్పకుండా చూస్తూ. "మీ మధులతమ్మగారు ఏ ధైర్యం చూస్కుని, సింధుజతో, మా అబ్బాయి పెళ్ళి చేస్తానని తైతైమని ఎగిరిందిరా"

"బాబుగారూ, ఆ సీసాని చూస్తూంటే నాలిక లాగేస్తన్నాదండి. దాన్ని తాగుతూ మాట్లాడుకుందామండి" అంటూ ఆ సీసాని లాక్కున్నాడు. కానీ మట్టయ్య మళ్ళీ లాగేసుకున్నాడు. "ముందా సంగతి చెప్పి అప్పుడు తీస్కో"

"మీ అబ్బాయిగారు సింధుజమ్మగారికి రాసిన వుత్తరాలు, తీయించుకున్న ఫొటోలూ వున్నాయటకదండి. వాటి మీద ఆధారపడే, మిమ్మల్ని సవాల్ చేసారండి. పెళ్ళి పీటల మీద మీవాడు మర్యాదగా సింధుజగారి మెడలో తాళి కట్టలేదనుకోండి, అప్పుడు వాటిని బయటికి తీసి, కోర్టులో కేసుపెడతారట" అంటూ సీసాని లాక్కున్నాడు.

తన వూహ నిజమే! యింక వాటిని సంపాదించి నాశనం చెయ్యడం ఒక్కటే మిగిలింది "అవి ఎక్కడున్నయో తెలుసా నీకు" మెల్లగా అడిగాడు.

"ఎందుకు తెల్దండి. గెస్టుహౌసుందాండి, అందులో మధులతగారి బెడ్‌రూం వుందాండి. అందులో బీరువా వుందాండి. ఆ బీరువాలో ఓ దొంగ అరవుందాండి, అదిగదిగదిగో, ఆ అరలో దాచేరండి" అంటూనే సీసా మూత విప్పి గడగడమని రెండు ఔన్సులు తాగేశాడు. డబ్బు యిమ్మంటూ చెయ్యి చాపేడు.

"నువ్వు చెప్పిందానికి, ఆ సీసా యిచ్చేను. ఆ వుత్తరాలు, ఫొటోలు కూడా లాక్కొచ్చి నా చేతిలో పెడితే యీ పదివేలూ నీ చేతిలో పెట్టేస్తాను" అంటూ మళ్ళీ నోట్లకట్టని గాలిలో వూపేడు.

బాలయ్య ఖంగుతిన్నట్టుగా చూశాడు. రెండు మూడు నిమిషాలు ఆలోచిస్తూ వుండిపోయేడు. తర్వాత మరికొంచెం తాగి, "అలాగే బాబూ, ఆ యమ్మగారు యివాళ వుండి, రేపు వెళ్ళిపోయే మనిషి. కానీ మీరూ నేనూ యీ వూళ్ళో వుండేవాళ్ళం" అంటూ గభీమని ఆ నోట్లకట్ట లాక్కున్నాడు.

ఈ సంభాషణంతా బాలయ్య పెళ్లాం గమనిస్తూనే వుంది. ఆమెకీ డబ్బు మీద ఆశగానే వుంది, కానీ అందుకోసం ఒకమ్మాయికి ద్రోహం చెయ్యడం యిష్టంలేక, బాలయ్యని లోపలకి పిల్చి, మట్టయ్య చెప్పిన పని చెయ్యొద్దని కోప్పడింది.

కానీ బాలయ్య రెచ్చిపోయాడు. "ఆ యమ్మగారికిన్ని రోజుల్నించి సేవలు చేస్తున్నా ఒక్క రోజు ఓ అయిదు రూపాయలిచ్చి సినిమా కెళ్ళరా బాలయ్యా అన్నదా? యీ బాబుగారికి యింత చిన్న పని చేసి పెడితే పది వేల రూపాయలు యిస్తున్నారు. ఓ మందు సీసా యిచ్చేరు. హరిమీద గిరి పడ్డా సరే, నేనా డబ్బు వదులుకోను, అంతే గాదు, యీ సంగతి మధులతగారికి చెప్పేవో, నిన్ను చంపి, జైలుకెళ్ళి పోతానంతే" అంటూ తీవ్రంగా హెచ్చరించి మట్టయ్య వెంట బయలు దేరాడు. బాలయ్య డబ్బుని చూడగానే తను అనుకున్నదానికంటే ఎక్కువ స్పందించినందుకు మట్టయ్య లోలోపల సంతోషిస్తూ గెస్టుహౌసుకి బయలుదేరాడు.

వాళ్లిద్దరూ అక్కడకి చేరుకునేసరికి రాత్రి పదకొండు దాటింది. మట్టయ్యని బయట వరండాలో నిలబెట్టి, వంట గదిలోనించి మధులత రూమ్‌కి మధ్యనున్న హాలులోనించి మధులత రూంలోకి, చప్పుడుకాకుండా మెల్లగా వెళ్ళేడు. ఆమె ఒక మంచంమీద, సింధుజ మరో మంచంమీద నిద్రపోతున్నారు. వారిద్దరకీ, రాత్రి తొమ్మిదిన్నర దాటగానే నిద్రపోవడం

అలవాటు. మధులత తలగడ కిందనే తాళా లుంటాయి. మెల్లగా వెళ్లి వాటిని లాక్కుని, చప్పుడు కాకుండా బీరువా తెరచి, ఫొటోలు, వుత్తరాలూ తీస్కున్నాడు. మళ్ళీ తలుపులు మూసేసి, తాళాలు మళ్ళీ యధాస్థానంలో పెట్టేసి, బైటకి నడిచాడు.

వరండాలో వున్న లైటు వెలుతురులో మట్టయ్యా వుత్తరాల్ని ఫొటోల్ని చూసి సంతృప్తిపడ్డాడు. విజయగర్వంతో వికటాట్టహాసం చేయబోయి ఆగిపోయేడు. బాలయ్యకి చెప్పిన ప్రకారం డబ్బు యిచ్చేసి, యింటికి బయలుదేరాడు.

తను సంపాదించిన వాటిని నిద్రపోతున్న ప్రభాకర్‌ని లేపి మరీ చూపించాడు. "ఇవేనా, యింకా ఏమైనా వున్నాయా?"

"లేవు నాన్నా యింతే"

"నెగిటివ్స్ ఎక్కడున్నాయి?"

"నాదగ్గరే వున్నాయి"

ప్రభాకర్ బీరువాలోనించి నెగిటివ్స్ తీసిచ్చేడు. ఫొటోలు, వుత్తరాలు, నెగిటివ్స్‌ని ఓ కుప్పగా పోసి, అగ్గిపుల్ల అంటించాడు మట్టయ్యా. ఆ మంటని చూసి పగలబడి పగలబడి నవ్వేడు. "యిప్పుడు నువ్వేం చెయ్యగలవే! ఆడదానివి నీకే అన్ని తెలివితేటలుంటే, మగాణ్ణి నాకెన్ని తెలివితేటలుండాలి, అహ్హహ్హ" అంటూ కాలిన బూడిదతీసి గాల్లో జల్లేడు.

★ ★ ★

రఘుపతిగారు స్వతహాగా ధనవంతుడు, పైగా ఒక్కతే కూతురు కావడంవల్ల పెళ్ళి ఏర్పాట్లన్నీ భారీగానే చేశాడు. జగదాంబ జంక్షన్‌కి దగ్గర్లో వున్న ప్రహ్లాద కల్యాణ మంటపం రంగు దీపాల పరదా కప్పుకుంది. బాణాసంచా శబ్దాలు చెవుల్ని హోరెత్తించేస్తున్నాయి.

కల్యాణ వేదిక మీద ప్రభాకర్‌చేత పురోహితుడు విఘ్నేశ్వర పూజ చేయిస్తున్నాడు. మధులత ఎక్కడా కనబడలేదు. ఆమె కోసం మట్టయ్యా కలియజూస్తున్నాడు. ఆధారాలు పోయేయన్న సంగతి తెలిసి, ముఖం చూపించడానికి మనస్కరించక గెస్టుహౌసులో వుండిపోయి వుంటుంది. లేదా గుంటూరు వెళ్ళిపోయి వుంటుందనుకున్నాడు. కానీ, అతని దగ్గరకి అన్నపూర్ణ వచ్చి "మన కోడల్ని ఆ గదిలో ముస్తాబు చేస్తుంటే, ఆ లాయరుగారు సింధుజని, కింద అంతస్తులో ముస్తాబు చేస్తోందటండి" అంది.

మట్టయ్యా ఆశ్చర్యపోయేడు. ఇంకా ఏ ధైర్యంతో సింధుజని ముస్తాబు చేస్తోందో అర్థంకాలేదు. గబగబా కింద అంతస్తు కెళ్ళాడు. అన్నపూర్ణ చెప్పింది నిజమే! మధులత, రుక్మిణీ, సుజాత, సింధుజని అలంకరిస్తున్నారు. మట్టయ్యా వారి దగ్గరకెళ్ళి "నమస్తే" అన్నాడు వ్యంగ్యంగా. మధులతే చిన్నగా నవ్వి వూరుకుంది.

"యీ అమ్మాయికి వేరే సంబంధం చూసేరా?"

"లేదే! మేం అనుకున్న సంబంధానికే, అంటే, మీ అబ్బాయికే యిచ్చి పెళ్ళి చేస్తున్నాం"

"హుఁ! ఏ ధైర్యం చూస్కుని నువ్విలా ప్రొసీడ్ అయిపోతున్నావో గాని, అవతల మావాడి చేత పురోహితుడప్పుడే వినాయక పూజ చేయించేస్తున్నాడు. యింకో అయిదు నిమిషాల్లో పెళ్లి కూతురి తలమీద జీలకర్ర, బెల్లం కూడా పెట్టించేస్తాడు"

"చూడండి మట్టయ్యాగారూ, అయిదు నిమిషాలంటే, మూడు వందల సెకెండ్లు. యీ అయిదు నిమిషాల్లో ఎన్ని విడ్డూరాలైనా జరగొచ్చుగదా" మధులత కూడా ఎంతో ఆత్మవిశ్వాసంతో చెప్పింది.

"హు... అయిదు నిమిషాల్లో విడ్డూరాలేం జరిగిపోతాయ్?"

"మీ నెత్తిమీదో బాంబు పడ్డానికి అయిదు నిమిషాలకంటే ఎక్కువ టైం పడుతుందంటారా?"

మట్టయ్యకి ఆమె మాటలన్నీ ఏదో సంధి ప్రేలాపనలా అనిపించింది.

"మీరు వుండాల్సింది యిక్కడ కాదు మట్టయ్యాగారూ, అక్కడ పెళ్ళి దగ్గరుండండి, నేను రావల్సిన టైంకి నేనొస్తాను" అంది మధులత.

మట్టయ్యా నవ్వుకుంటూనే పెళ్ళి దగ్గరకి




నడిచాడు.



మట్టయ్యా వచ్చేసరికి బాలయ్యా అతిథు లందరికీ గబగబా చేతిరుమాళ్లు పంచడం కనిపించింది. మరో వింగ్‌లో వాడి పెళ్ళాం ముత్యాలమ్మ కూడా రుమాళ్ళు పంచుతోంది. రుమాళ్ళు అందుకున్న జనంలో ఏదో కల కలం రేగింది. అది క్రమంగా ఎక్కువ కాసా గింది. ఆ కలకలం ఏమిటో మట్టయ్యకి అర్థంకాలేదు. ఎవరో యిద్దరు వ్యక్తులు నాలుగైదు రుమాళ్ళు పట్టుకుని రఘుపతి దగ్గరకి పరుగెత్తి వాటిని చూపించారు. వాటిని పరిశీలనగా చూశాక ఆ పెళ్ళి ఆపండంటూ అరిచాడు.

బ్యాండుమేళం ఆగిపోయింది.

వేదమంత్రాలు ఆగిపోయేయి.

పీటలమీదకి రాబోతున్న పెళ్ళి కూతురు ఠక్కుమని ఆగి పోయింది!

మట్టయ్యకి, పీటలమీదున్న ప్రభాకరానికి ఏమీ అర్థంకాలేదు.

''మట్టయ్యా, యిలారా'' అంటూ రఘుపతి పిడుగు పడినట్టుగా అరిచాడు. మట్టయ్య అతని దగ్గరకి పరుగెత్తాడు.

''ఏంటి బావగారూ, ఏం జరిగింది?'' ఆత్రంగా అడిగాడు మట్టయ్య.

''యీ రుమాళ్ళు చూడు'' అంటూ ఓ రుమాలుని అతని ముఖంమీదకి విసిరాడు రఘుపతి.

ఆ రుమాలు మీద ఒకవైపు ప్రభాకర్, సింధుజలు రొమేంటిగ్గా తీయించుకున్న ఓ ఫోటో ప్రింట్ చేసుంది. రుమాళ్ళ మీదకి, ఆ ఫోటో ఎలా వచ్చిందో మట్టయ్యకి అర్థంకాలేదు.

మరోవైపు తిప్పేడు. దానిమీద ప్రభాకర్, సింధుజకి రాసిన ఓ వుత్తరం ప్రింట్ చేసుంది.

''అక్కడేంవుందో అందరూ వినేలా నువ్వే చదువు'' రఘుపతి శాసిస్తున్నట్టుగా అరిచాడు.

''అది కాదు బావగారూ...'' అంటూ ఏదో చెప్పబోయాడు.

''నేను చదవమంటున్నాను చదువు''

మట్టయ్యకి చదవక తప్పింది కాదు.

''నా ప్రాణ సమానమైన సింధుజకి, ప్రేమాభినందనలతో ప్రభాకర్ వ్రాయునది.

మన మధ్య ప్రేమ పుట్టింది కొన్ని నెలల క్రితమే అయినా, అది ఎన్నో యుగాలనించి సాగుతున్న ప్రేమలా నా మనసులో నిల్చిపోయింది. మన వివాహానికి మీ పెద్దల అనుమతి లభించినట్టే, నాకూ మా నాన్న అనుమతి లభించింది. ఆయన కట్నం కోరేమనిషే అయినా, నీ అందమే మన కొక బంగారు గని అని చెప్పి ఒప్పించేను. త్వరలోనే ముహూర్తాలు పెట్టించి, మనం శాస్త్రోక్తంగా దంపతులయే శుభఘడియకి స్వాగతం చెప్తాను.

నీవు లేక నేను లేను అని భావించే

నీ

ప్రభాకర్

ఉత్తరం చదివేసి మట్టయ్య కంగారుపడుతున్నాడు. కాళ్ళు, చేతులు, మొత్తం ఒళ్లంతా ఒణకనారంభించింది.

మధులత గదిలోనించి ఉత్తరాలు, ఫోటోలు బాలయ్యద్వారా తనే దొంగతనం చేయించేడు.

వాటినితనే స్వయంగా కాల్చి బూడిద చేశాడు.

అయినా, ఈ రుమాళ్ల మీదకి ఈ ఉత్తరం, ఈ ఫోటో ఎలా వచ్చేయి? అందరి కళ్ళూ తన మీదనే వున్నాయి. సమాధానం దొరకడంలేదు.

''వీటికి నీ సమాధానం ఏమిటి? నిన్ను పిల్చి, పెళ్లి విషయం మాట్లాడినప్పుడు నేనేం

చెప్పేను? నా కూతురికి న్యాయం చెయ్యడానికి, మరో అమ్మాయికి ద్రోహం చెయ్యడం నాకిష్టం లేదూ, మీ అబ్బాయి ఏ అమ్మాయినైనా ప్రేమించేడా అని అడిగేను. అడిగేనా? లేదా? అప్పుడు నువ్వేం చెప్పేవు? ఇప్పుడీ రుమాళ్ల భాగోతం ఏమిటి?''

మంటపంలో పీటల మీద కూర్చున్న ప్రభాకర్‌కి ఒళ్లంతా చెమటలు పట్టేయి. పెళ్లి మంటపం పంచాయితీగా మారుతుందనిగానీ, తనూ, తన తండ్రి దోషులుగా ఇన్ని వందల మంది ముందు నిలబడాల్సి వుంటుందని గానీ తను కలలో కూడా వూహించలేదు. అయినా తన బతుకుని బయటపెట్టేసే కార్యక్రమం ఆరంభమయిపోయింది.

''ఇదంతా ఏదో కుట్ర బావగారూ! నాకు మీ అంతటి గొప్పవారితో సంబంధం కలుస్తుందనే సరికి, ఎవరో కిట్టనివాళ్లు ఇలా దొంగ ఉత్తరాలు సృష్టించి, ట్రిక్ ఫొటోలు తీయించి, ఇలా నన్ను అల్లరి చేస్తున్నారు తప్ప, ఈ ఉత్తరాలు, ఫొటోలు అబద్ధం. ఈ ఫొటోలో వున్నది మా అబ్బాయి కాదు. ఈ ఉత్తరం మా వాడు రాసింది కాదు. ఈ దస్తూరీ మా ప్రభాకరానిది కాదు'' మట్టయ్య వీలున్నంత ధైర్యాన్ని తెచ్చుకుని వాదిస్తున్నాడు. ఏమాత్రం నిజం బయట పడినా, చేతికి అందబోయే కోటానుకోట్ల ఆస్తి ఎగిరిపోతుందని అతను ప్రతీ మాటనీ ఎంతో జాగ్రత్తగా మాట్లాడుతున్నాడు.

రఘుపతి ప్రభాకర్‌ని అడిగాడు, ''మీ నాన్న చెప్పింది నిజమా?''

''నిజమేనండి'' ప్రభాకర్ ధైర్యంగానే అనేశాడు.

''మరైతే ఈ కర్ఛీఫ్స్ ఎవరు ప్రింట్ చేయించేరు?'' రఘుపతి అతిథుల వైపు చూస్తూ అరిచాడు.

''నేను''

అందరూ ఆ సమాధానం వచ్చిన వైపు చూశారు. ఓ పక్కనించి మధులత, పెళ్లికూతురు ముస్తాబుతోవున్న సింధుజని తీసుకుని ముందుకొచ్చింది. తను ఎవరో ముందు క్లుప్తంగా వివరించాక అప్పుడు జనంవైపు తిరిగి మాట్లాడింది.

''పెద్దలందరకీ నమస్కారాలు! శుభకార్యం జరుగుతున్న కల్యాణ మంటపాన్ని న్యాయస్థానంగా మార్చడం నాకిష్టంలేని పని! అయినా తప్పనిసరి పరిస్థితుల్లో, ఈ వేదికని నేను కోర్టుగా మార్చక తప్పడం లేదు.

ఎందుకంటే, ఆ ప్రభాకర్ ఈ సింధుజని ప్రేమించేడు, ఆ ప్రేమని పెళ్లిదాకా తీసుకొచ్చేడు. కానీ అదే సమయంలో ఈ విషయాలేవీ తెలియని రఘుపతిగారు తమ కూతుర్ని ప్రభాకర్‌కిచ్చి పెళ్లి చెయ్యాలనుకున్నారు. ఈ పెళ్లి జరిగితే కోట్లాది ఆస్తి కలిసొస్తుందనే ఆశతో మట్టయ్య తన కొడుకు ఎవర్నీ ప్రేమించలేదని అబద్ధం చెప్పి, పెళ్లి ముహూర్తాలు పెట్టించేడు. కానీ, ప్రభాకర్ ఈ సింధుజని ప్రేమించాడో లేదో తెల్సుకోడానికి ఈ రుమాళ్ల మీద ప్రింట్ చేయించిన ఒక వుత్తరం, ఒక ఫొటోయే ఓ గొప్ప వుదాహరణ''

అందరూ వూపిరి బిగబెట్టి వింటున్నారు. పెళ్లికని వచ్చినవాళ్లు ఇలా న్యాయనిర్ణేతలుగా మారాల్సి వుంటుందని, ఆ జన సమూహంలో ఒక్కరూ వూహించలేదు! అందుకే అందరూ ఏదో కొత్త అనుభూతిని పొందుతూ నిశ్చేష్టులై కూర్చుండిపోయేరు.

''ఈ ఫొటోలు, ఈ ఉత్తరాలు అబద్ధం. ఇవే నిజమైతే, వీటి తాలూకా ఒరిజినల్సుని చూపించమనండి చూద్దాం. ఇదే న్యాయస్థానమని ఆవిడగారు అంటున్నప్పుడు, న్యాయస్థానంలో చూపించాల్సింది ఒరిజినల్ డాక్యుమెంట్స్‌గాని, ఈలాంటి ట్రిక్కు ఫొటోల్నీ, రంగుల రుమాళ్లనీ కాదుగదా'' మట్టయ్య సవాల్ చేస్తున్నట్టుగా బిగ్గరగా అన్నాడు.

రఘుపతిగారూ తన అభిప్రాయం కూడా అదేనన్నట్టుగా మధులత వైపు చూశాడు.

''ఒరిజినల్ లెటర్స్‌ని ఈయన దొంగతనం చేయించి, కాల్చిబూడిద చేస్తే అవి ఈ కోర్టుకెలావస్తాయి?'' మధులత మట్టయ్య వైపు ఛీత్కార భావం వ్యక్తం చేస్తూ చెప్పింది.

''నేను నీ ఇంట్లో దొంగతనం చేయించేనా? అవ్వవ్వ, ఎంత అబద్ధం'' మట్టయ్య అందరి ముందు నోటి మీద చేత్తో కొట్టుకుంటూ తైతైమని గెంతాడు.





''ఈ పులివేషాలు ఇక్కడెందుకులెండి?'' అంటూ మధులత బాలయ్యని ముందుకు పిల్చి జరిగిందేవిటో చెప్పమంది.

వాడు ఓసారి కాలర్ సర్దుకుని మట్టయ్యే తన చేత చేయించిన దొంగతనం గురించి వివరంగా చెప్పి, ఆ తర్వాత మట్టయ్యతో అన్నాడు.

''చూడండి సార్! నాకు డబ్బంటే ఆశ, మందంటే ఇష్టం. ఆ రెండూ ఆశ చూపించి నన్ను ఆ లవ్‌లెటర్ను, ఫొటోలు తీసుకొచ్చి ఇమ్మన్నారు, ఇచ్చేను. వాటిని మీరు కాల్చి బూడిద చేశారు. అంతటితో మీ దుర్మార్గం గెలిచిందనుకున్నారు. మీ పన్నాగాలకి తిరుగు లేదనుకున్నారు. కానీ మీరు ఎక్కడైతే గెలిచేన నుకున్నారో, కరక్ట్‌గా అక్కడే ఓడిపోయేరు''

మట్టయ్య, ప్రభాకర్, మంటపంలోని ప్రతి ఒక్కరూ ఎంతో ఆసక్తిగా వింటున్నారు.

''చెప్పు బాలయ్యా'' అంటూ ప్రోత్స హించింది మధులత.

''మట్టయ్యగారు తన కొడుకు రాసిన ప్రేమ లేఖల్ని, తీయించుకున్న ఫొటోల్ని నాశనం చేసే ప్రయత్నం చేస్తారని మా లాయరమ్మగా రు ముందుగానే వూహించారు. అందుకే ఓ ముఖ్యమైన లవ్‌లెటర్ని ఓ ఫొటోని రుమాళ్ల మీద ప్రింట్ కొట్టించేశారు. ఆ పని చేశాకే లాయరమ్మగారు ప్రభాకరంగారింటికెళ్లి, నీ పెళ్లి సింధుజమ్మగారితోనే జరుగుతుందని ఛే లంజ్ చేశారు. ఆ తర్వాత ఏ క్షణంలోనైనా మట్టయ్య వచ్చి ఫొటోల గురించి, ఉత్తరాల గురించి అడుగుతారని అమ్మగారు చెప్పేరు. అలా అడిగినప్పుడు నేనేం చెప్పాలో, నేనేం చెయ్యాలో నాకూ, మా ఆవిడకీ అమ్మగారు చెప్పేరు. ఆవిడ చెప్పిన ప్రకారం మట్టయ్యగా రొచ్చేరు. ఆయన ముందు నేనూ మా ఆవిడా గొడవలు పడుతున్నట్టుగా నటించి, ఆయన ఇచ్చిన పదివేలూ తీస్కుని, ఆయనకి కావ ల్సిన ఆధారాలు అందించేను. మట్టయ్యగారు ఎంతో పెద్ద సైజు దుర్మార్గుడైనా, మా అమ్మ గారి ముందుచూపుని, మా మొగుడూ పెళ్లాల డ్రామాయాక్టింగ్‌ని ఆయన అర్థం చేస్కోలేకపో యేడు. ఇదండీ కథ'' బాలయ్య తనకి రాక రాక వచ్చిన అవకాశాన్ని పూర్తిగా వినియో గించుకున్నానన్న సంతోషంతో అతిథులందరి కీ రెండు చేతులూ ఎత్తి నమస్కరించాడు.

బాలయ్య చేసిన మోసానికి మట్టయ్య గబ గబా వెళ్లి వాడిని చెప్పుతో కొట్టాలనుకున్నాడు, పీక పిసికి చంపాలనుకున్నాడు. కానీ వాడిని ఇప్పుడేం చేసినా, అదంతా తనకి వ్యతిరేకమే అవుతుంది. కాబట్టి ఇప్పుడు కావల్సింది ఆలో చనగాని, ఆవేశాలు కాదని, బలవంతాన తమా యించుకున్నాడు.

మధులత మట్టయ్య దగ్గరకొచ్చి ''ఇప్పుడే మంటారు?'' అంది.

మట్టయ్య ఆమెకు జవాబు చెప్పకుండా రఘుపతి దగ్గరకొచ్చి జవాబు చెప్పేడు.

''బావగారూ! ఈవిడ చెప్పింది, ఆ బాల య్యగాడి చేత చెప్పించిందీ అంతా అబద్ధ మని ఈ పాటికి మీకు అర్థమైపోయే వుంటుంది. లేకపోతే పని వాడి చేత డ్రామా నాటకాలు ఆడించడం ఏమిటి? రుమాళ్ల మీద బొమ్మలూ, ఉత్తరాలూ ప్రింట్‌కొ ట్టించడం ఏమిటి? తీరా, ఆ ఆధారాలు ఏవని అడిగితే అవన్నీ నేను దొంగతనం చేయించాననడం ఏవిటి? సరే, ఇంత జరి గింతర్వాత నా పరువు, నా కొడుకు పరువు ఇలా ఈ వచ్చిని పందిట్లో పంచాయితీకి నిలబడింతర్వాత నేనో నిజాన్ని ఒప్పుకుంటు న్నాను. మా అబ్బాయి మాంచి పెర్సనాల్టీ మనిషి కాబట్టి, ఈ సింధుజ మావాడి మీద మోజు పడింది. పెళ్లి చేసుకోమంటూ ప్రాణా లు తోడేసింది. సరే, ఈ అమ్మాయిని పెళ్లి చేస్కోడమా, మానడమా అని మేం కిందా మీదా పడుతున్న టైములోనే, ఈ అమ్మాయి ఏదో లాడ్జీలో బ్రోతల్ కేసులో దొరికిపోవడం, కోర్టులో జరీమానా కట్టి బయటపడ్డమూ జరి గింది. మీరు పెద్దవాళ్లు కాబట్టి, మీ కంపె నీలో జరిగే చిన్నచిన్న విషయాలు మీదాకా రావు కాబట్టి, మీకు సింధుజ విషయం తెలియదు. ఆ అమ్మాయి మీ కంపెనీలోనే పని చేసేది. ఈ బ్రోతల్ కేసు కారణంగానే ఆ అమ్మాయిని ఉద్యోగంనించి డిస్మిస్ చే

యడం జరిగింది. ఇప్పుడు చెప్పండి. మా వాడు ఆ అమ్మాయిని ఇష్టపడినా, అదో వ్యభిచారి అని నిరూపణయ్యేక మా వాడు దాన్ని ఎలా పెళ్లి చేసుకుంటాడు? అందుకే నేనూ ఈ అమ్మాయిని తిరస్కరించాను. దాంతో ఈ అమ్మాయి, ఈ లాయర్ని గుంటూరునించి రప్పించి మరీ మమ్మల్ని అల్లరి చేయడానికి సిద్ధపడింది''

మట్టయ్యే మధులత చేసిన అభియోగాన్ని ఒప్పుకున్నట్టే ఒప్పుకుని చివరగా తనదేం తప్పులేదంటూ తప్పుకున్నాడు. అలా తప్పుకోవడంవల్ల కంగారుపడింది మధులత కాదు. అతిథుల్లో కూర్చున్న చంద్రమౌళి, భానుమూర్తులే! వాదన ఇంకా పెరిగితే ఇదిగో ఈ ఇనస్పెక్టరే అరెస్టు చేశాడు. ఇదిగో ఈ భానుమూర్తితోనే సింధుజ లాడ్జిలో దొరికిందని తమని సాక్ష్యం వేస్తే మళ్లీ కథ మొదటికొస్తుంది. ఇప్పటికే ప్రజల దృష్టిలో సగం చచ్చి బతుకుతున్నారు. ఛ, పెళ్లికి రామని ఎంత చెప్పినా వినకుండా తమని రుక్మిణీ, సుజాతలు లాక్కొచ్చేరంటూ వాళ్ల మీద వాళ్లకే చిరాకు కలిగింది.

మధులత మాత్రం ఎవరి జోలికీ వెళ్లకుండా, వాస్తవాన్నే నమ్ముకుంది.''సింధుజ అరెస్టయిన మాట నిజం, కోర్టులో జరీమానా కట్టిన మాట నిజమే! కానీ, సింధుజ నేరం చెయ్యలేదు. మోపబడింది. ఈ మట్టయ్యే ఆ ప్రభాకర్ కలిసి ఒక దుష్ట నాటకం ఆడేరు. ప్రేమించిన అమ్మాయి ఎక్కడ ఈ పెళ్లికి అడ్డుపడుతుందోనని, ఆమెపై వ్యభిచారిగా ముద్రవేశారు'' అంది

''నిజమా? అదే నిజమని రుజువైతే ఈ పెళ్లి ఆపుచేసి, ఆ ప్రభాకర్‌ని ఈ క్షణం ఉద్యోగంనించి డిస్మిస్ చేస్తాను'' అన్నాడు రఘుపతి సిన్సియర్‌గా.

''ఇక్కడే నిరూపిస్తాను'' అంది మధులత.

మట్టయ్యే రఘుపతి దగ్గరకి వెళ్లి ''బహుశా ఈవిడ ఆ ఇనస్పెక్టర్ని, భానుమూర్తిని సాక్ష్యం వెయ్యాలనుకుంటోందేమో! వాళ్లిద్దరి మీద ట్రిక్కులు ప్రయోగించి, ఉద్యోగాల్నించి పీకించేసి, బెదరగొట్టింది. అంచేత ఇప్పుడు వాళ్లు ఆవిడ చెప్పిందే రైటని అనినా అనేస్తారు. అంచేత వేరే సాక్ష్యం వుంటే చూపించమనండి చూద్దాం'' అంటూ మధులతని సవాల్ చేస్తూ అరిచాడు.

మధులత రెండే రెండు క్షణాలు మౌనం వహించింది. తాము సాక్ష్యం చెప్పకపోతే నిజం బైటపడే అవకాశమే లేదు, కానీ తమని సాక్ష్యం వెయ్యడానికి వీల్లేదని మట్టయ్యే షరతు పెట్టేడు. ఇప్పుడామె ఏం చేస్తుందని భానుమూర్తి, చంద్రమౌళి ఆమె వైపు ఆసక్తిగా చూశారు.

''మైడియర్ ఫ్రెండ్స్! మట్టయ్యగారు చాలా పొరపాటు పడ్డారు. మీ అందరికీ నిజం వెల్లడి చేయడానికి చంద్రమౌళిని, భానుమూర్తిని సాక్ష్యం చెప్పమనను, ఎందుకంటే ఆ నిజమేదో సాక్షాత్తు ప్రభాకర్ చేతనే అతని నోటిద్వారానే చెప్పిస్తాను'' అంటూ ప్రభాకర్ వైపు చూసింది. ప్రభాకర్ వణుకుతున్నాడు. అందరూ అతని వైపు చూస్తున్నారు.

రెండు మూడు, నాలుగు... క్షణాలు గడుస్తున్నాయి. సడన్‌గా, కల్యాణ మంటపంలో వున్న అన్ని లౌడ్ స్పీకర్స్‌నించి ప్రభాకర్ గొంతుతో మాటలు వినబడనారంభించేయి.

''ఇప్పుడు నేను చెప్తాను విను, రఘుపతి గారి కూతుర్ని నేను పెళ్లి చేసుకుంటున్న మాట నిజమే! అందుకు నువ్వు అడ్డు పడకుండా వుండడానికి మా నాన్న ఓ పథకం వేశాడు...'' అంటూ ప్రభాకర్ సింధుజతో చెప్పిన మాటలన్నీ వినిపించాయి.

ఆ మాటలు ఇప్పుడెలా వినిపించేయి? ఆ రోజు ఎవరైనా చాటునించి ఆ మాటలు టేప్ రికార్డర్‌లో రికార్డ్ చేశారా? ప్రభాకర్, మట్టయ్యే మతిపోయిన మనుమల్లా పిచ్చి




చూపులు చూసేరు.

లౌడ్ స్పీకర్‌లోనించి వినబడుతున్న మాటలు ఆగిపోయేయి. మధులత ఇప్పుడు మరింత బిగ్గరగా, మరింత ఆవేశంగా మాట్లాడింది.

''ఇప్పుడు మీరు విన్న ప్రతీ మాటా, ప్రతీ అక్షరం ఆ ప్రభాకర్ స్వయాన తన నోటితో చెప్పిందే! ఈ సింధుజతో చెప్పిందే! అతని నోటి వెంట నిజం చెప్పించడానికి నేనే సింధుజ హేండ్‌బేగ్‌లో టేప్‌రికార్డర్ పెట్టి పంపించేను. ఈ విషయం నాకూ, సింధుజ కీ తప్ప మరెవరికీ తెలీదు. ఇప్పుడు జరిగిందేమిటో ఇక్కడున్న మీ అందరికీ తెల్సింది కాబట్టి ఇప్పుడు ఏం జరగాలో మీరే చెప్పండి. అర్ధరాత్రి పూట ఆడది ఒంటరిగా స్వేచ్ఛగా, భయంలేకుండా నడ వగలిగినప్పుడే దేశానికి నిజమైన స్వతంత్రం వచ్చినట్టూ అని చెప్పిన గాంధీగారి ఆశయాన్ని అమలు పెట్టమని మిమ్మల్ని కోరడంలేదు. అవకాశవాదుల స్వార్ధానికి బలైపోయిన ఓ ఆడపిల్లకి న్యాయం చెయ్యమని కోరుతున్నాను''

కల్యాణమంటపంలో రెండు మూడు క్షణాలు గంభీరమైన నిశ్శబ్దం తిరిగింతర్వాత యస్పీ ఉషారాణి మధులత దగ్గర కొచ్చి, ''ఆ తండ్రీ కొడుకుల్ని ఇప్పుడే అరెస్టు చేసి ప్రాసిక్యూట్ చెయ్యాలి మధులతగారూ. కానీ మీరు సింధుజ వివాహం ప్రభాకర్‌తో జరిపించాలనుకుంటున్నారు కాబట్టి, మేమందరం దాన్నే సమర్థిస్తున్నాం'' అంది.

''ఔను యస్పీగారూ... ఇక్కడ కావలసింది శిక్ష విధించి కక్ష తీర్చుకోవడం కాదు. అన్యాయమైపోయిన అమ్మాయికి న్యాయం జరిపించడం'' అంటూ రఘుపతి దగ్గరకొచ్చి ''అయామ్ సారీ రఘుపతిగారూ... నేను చేసిందాన్ని మీ కూతురి పెళ్లిని నేను ఆపడం అనుకుంటారో, కళంకం ఆపాదించిన ఓ అమాయకురాలికి ఆ మచ్చ తుడిచేసి, మాంగల్యభాగ్యం కలిగించటం అనుకుంటారో...'' అంటూ ఎంతో సిన్సియర్‌గా చెప్తుంటే, రఘుపతి ఆమెను మాట పూర్తి చెయ్యకుండా ఆపుచేశాడు.

''లేదమ్మా! నా కూతురికి మరో వరుణ్ణి తేగలిగే ఆస్తి, అవకాశం నాకున్నాయి. కానీ ఇలా దగా పడిన ఆడవాళ్లని వుద్ధరించే, మీలాంటి మనుషులు ఎక్కడో అరుదుగా వుంటారు. మీరు కోర్టుకెక్కినా, వాదోపవాదాల మధ్య నిజం నలిగిపోయి, దొంగసాక్షుల కాళ్ల కింద పడి చచ్చిపోయివుండేదేమో! ఏ కోర్టూ జరిపించని న్యాయాన్ని మీరు ఆడవారై వుండి, ఒంటరిగా పోరాడి జరిపించారు. మీరు చేసిందే న్యాయం. అంతేకాదు నా కూతురికి అన్యాయం జరగకుండా అడ్డుకుని కాపాడారు'' అంటూ కళ్లద్దాలు తీసి కళ్లలోని నీరు తుడుచుకున్నాడు.

మట్టయ్యా ఈ ఓటమిని అంగీకరించలేక, నిప్పుల మీద నిలబడి నట్టుగా కుతకుతలాడి పోతున్నాడు. అయినా మధులత అదేమీ ఖాతరు చెయ్యకుండా సింధుజతో పెళ్లి జరిపించే స్తోంది. ఆ క్షణంలో అక్కడవున్న వేలాది మంది దృష్టిలో తనో నీచుడు! శిక్షించకుండా దయదల్చి వదిలేసిన నేరస్థుడు.

ప్రభాకర్ పరిస్థితి అంతకంటే అధ్వాన్నంగా వుంది. ఇంతమంది పెద్దలు, ప్రముఖుల సమక్షంలో తన పెళ్లి జరుగుతోందని, కొంతసేపు క్రితం వరకూ గర్వపడ్డాడు. కానీ ఆ ప్రముఖుల సమక్షంలోనే మధులత తన బతుకుని వుతికి వుతికి ఎండబెట్టింది. తనని క్షమించకుండా భానుమూర్తిని కొట్టించినట్టే, తననీ ఏ గదిలోకైనా తీసుకువెళ్లి నాలుగు చెప్పుదెబ్బలు కొట్టించి, వదిలేస్తే సంతోషించేవాడు. రేపట్నించి సింధుజ తనని సాధిస్తుంది, వేధిస్తుంది! ఈవిధంగా ఆలోచిస్తూనే పురోహితుడు చెయ్యమన్నట్టుగా చేసేస్తున్నాడు. పురోహితుడు ''ధర్మేచ, అర్థేచ, కామేచ, మోక్షేచ'' అంటూ సప్తపది మంత్రం చదువుతుంటే, మధులత అతని దగ్గరకొచ్చి ''చూడండి, మగవాడు భర్త స్థానంలోకి వెళ్తున్నప్పుడు భర్తగా అతని ధర్మాన్ని, కర్తవ్యాన్ని నూ

చించే మంత్రమది, దాని అర్థం ఏమిటో స్పష్టంగా తెలుగులో చెప్తే ఆ భర్తకి అర్థమవుతుందికదా'' అంది.

''ధర్మ కార్యములను నిర్వహించుటలోను, ధనధాన్యములు సంపాదించి, అనుభవించుటలోను, కోర్కెలు తీర్చుకొనుటలోను, మోక్షమును కోరి సాగించే కార్యక్రమముల్లోను భార్యని విడువను. ధర్మపత్నిని విడిచి చరించను'' అంటూ పురోహితుడు తెలుగులో అర్థాన్ని వివరించాడు. మంగళసూత్రధారణ జరిగేక, ''ఇప్పుడు పెళ్లికూతురి అన్నయ్యలు చెల్లెల్ని దీవిస్తూ కట్నకానుకలు చదివిస్తారని పురోహితుడి చేత మధులత ఎనౌన్స్ చేయించింది.

సింధుజకి అన్నయ్యలు కూడా ఉన్నారా, మాకు తెలియదే అనుకుంటూ ఆ అన్నయ్యలెవరా అని చంద్రమౌళి, భానుమూర్తి అటూ ఇటూ చూశారు. రుక్మిణి చంద్రమౌళి దగ్గరకి, సుజాత భానుమూర్తి దగ్గరకీ వచ్చి ''పదండి'' అన్నారు.

''ఎందుకు?'' ఇద్దరు మగాళ్లూ ఒకేసారి అడిగారు.

''మీరేకదా ఆ అమ్మాయికి అన్నయ్యలు'' అంది రుక్మిణి చిన్నగా నవ్వుతూ.

''మేం ఆ అమ్మాయికి అన్నయ్యలం ఎలా అవుతాం? అవం...'' అనేశాడు భానుమూర్తి.

''అవుతారని మధులత ఆంటీ డిక్లేర్ చేశాక, మీరు అవం అంటే... ఎందుకులెండి... మా సమక్షంలో మీరు ఇన్సల్ట్ అవడం మా కిష్టం లేదు. నోర్మూస్కుని పదండి. చీరలు, జాకెట్ బట్టలు ఆల్ రెడీ కొనేశాం, పదండి''

అందరూ వాళ్లవైపే చూస్తుండేసరికి, చంద్రమౌళి, భానుమూర్తి ఇంక వాదించి లాభం లేదని, ఆడవాళ్ల వెంట వేదిక మీదకి నడిచారు.

వివాహతతంగం అయేక అంతవరకు వెనక సీట్లో కూర్చున్న ఆదినారాయణ మధులత దగ్గర కొచ్చి, ఆమెనో పక్కకి తీసుకెళ్లి వస్తున్న కన్నీటిని ఆపుచేసుకుంటూ ''అమ్మా, మీరు చేసిన ఉపకారానికి కృతజ్ఞతలు మాటల్లో చెప్పేది కాదమ్మా. వచ్చే జన్మంటూ వుంటే మీ బిడ్డగా పుట్టి, మీకు సేవచేసి, మీ రుణం తీర్చుకుంటాను'' అన్నాడు.

''ఛఛ అవేం మాటలండి, సింధుజ నాకు మాత్రం కూతురు కాదా. మీ మిస్సెస్ ఏరీ రాలేదా?''

''రమ్మన్నాను... కానీ దానికి ముఖం చెల్లక రాలేదు''

''పోనీ మీరురండి. నూతన దంపతులు మీకు పాదాభివందనం చేస్తారు''

''వద్దులేమ్మా... నాకు పాదాభివందనం చేయించుకునే అర్హత లేదనే ఆ భగవంతుడు నాకు రెండు కాళ్లూ లేకుండా చేశాడు. ఆ సంగతి వదిలెయ్యమ్మా. సింధుజ పెళ్లి చాలా అసాధారణ పరిస్థితుల్లో జరిగింది. ఆ కోపంతో వాళ్లు సింధుజని బాధలు పెడతారేమోనని నాకు అనుమానంగావుంది'' అంటూ మెల్లగా తన సందేహాన్ని వ్యక్తం చేశాడు.

''చూద్దాం ఓ యజ్ఞం పూర్తి చేసినప్పుడు దాని ఫలాన్ని కూడా వాళ్లు అనుభవించాలిగా. నేను కొన్ని రోజులపాటు ఇక్కడ వుండి వాళ్లని రిపేర్ చేసే వెళ్తాను. మీరేం బాధపడకండి'' మధులత చెప్పిన మాటతో ఆదినారాయణ మనసు తేలికపడింది.

★ ★ ★

మట్టయ్య డాబా మీద చాప వేసుక్కూర్చుని, విస్కీ బోటిలు, మిగతా సరంజామా అంతా పెట్టుకుని తాగుతూ, 'ప్రస్తుతం నా పొజీషన్ ఏమిటి? నా భవిష్యత్ కార్యక్రమం ఏమిటీ?' అని సమీక్షించుకోనారంభించాడు.

గదా యుద్ధంలో తొడలు విరిగి, నేల కూలిపోయిన దుర్యోధనుణ్ణి గురించి చదివాడుగాని, అతన్ని చూడలేదు. చూస్తే బావుండేదని చాలా సార్లు అనుకున్నాడు. ఇంతవరకు చచ్చిన పాముల్ని చూశాడుగాని, నడుము విరిగిపోయిన పాముల గురించి వినడమే తప్ప చూడలేదు. అవకాశం దొరికితే చూద్దామనే అనుకున్నాడు. కానీ ఇప్పుడు చూడక్కర్లేదనుకున్నాడు. ఎందుకంటే తన పొజీషనూ ఇప్పుడు తొడలు విరిగిపోయిన దుర్యోధనుడిలాగ, నడుము విరిగిన పాములాగే తయారైంది.




తను ఓడిపోవడం, అదీ ఓ ఆడదాని చేతిలో ఓడిపోవడం, వూళ్ళోని పెద్దలముందు తనో నీచుడిగా నిరూపించబడ్డం, తల్చుకుంటుంటే నిద్రపట్టడంలేదు. తాగినా కిక్కు ఎక్కడం లేదు. రఘుపతిగారితో సంబంధం కలుపుకున్నాక ఖరీదైన కారుల్లో తిరుగుతూ, కట్టలకి కట్టలు నోట్లు లెక్కపెట్టొచ్చనుకున్నాడు. కొడుకుని అడిగో, లేకపోతే చాటుగా ఓ పది లక్షలు నొక్కేసో ఈసారి ఎమ్మెల్యే సీటుకి పోటీ చెయ్యాలనుకున్నాడు. తనకి రూలింగ్ పార్టీనించి టిక్కెట్ తప్పకుండా వచ్చే అవకాశం వుంది. తను పోటీ చేస్తే గెలవడం ఖాయం. కానీ ఇప్పుడు జరిగిన పెళ్లివల్ల తన కోరికలన్నీ కలలుగానే మిగిలిపోయాయి! అప్పులవాళ్లందరికీ, పెళ్లైన వారం రోజుల్లోగా వాళ్ల అప్పులు తీర్చేస్తానని మాట ఇచ్చేడు. ఇప్పుడా అప్పు తీర్చే అవకాశం కూడా పోయింది. సింధుజ ముందు' తనూ, తన కొడుకు ఇక మీదట ఓడిపోయిన సైనికుల్లా బతకాలి. ఆడది శాసించడం, మగాళ్లు పాటించడం తన వంశంలోనే లేదు. తన ఇంట్లో ఆడది ఎలా వుండాలో చెప్పడానికి ఓ వుదాహరణగా తన భార్యనే చూపించొచ్చు. కానీ రేపట్నించి సింధుజ ముందు తను కోరలు పీకేసిన పాములా బతకాలి. వుహుఁ! తనదీ దుర్యోధనుడి జాతకమే! ఓడిపోయి బతకడం తనకి చేతకాదు. తనకి దుర్మార్గుడని, నీచుడని ఎలాగూ ముద్రపడిపోయింది. ఆ ముద్రపడ్డాక ఇప్పుడు మంచివాడిగా మారిపోయినా ఎవడూ నమ్మడు. పైగా ఇంట్లో సుఖం, అధికారం కూడా లేదు. అలాంటప్పుడు సింధుజని కోడలి స్థానంనించి తప్పించెయ్యాలి.

ప్రభాకర్‌ని ఉద్యోగంనించి డిస్మిస్ చేస్తున్నట్టుగా ఆఫీసునించి ఉత్తరం వచ్చింది. రఘుపతిగారు ఆ పని చెయ్యడంతోపాటు సింధుజకి మళ్లీ ఉద్యోగం ఇచ్చేడు. ప్రభాకర్‌కి సంబంధించి అతని పెళ్లి ఒక అనూహ్య సంఘటన కాగా, తనకి ఉద్యోగం పోవడం, సింధుజకి మళ్లీ ఉద్యోగం రావడం మరో వూహించని సంఘటన.

మధులత సింధుజని ఆ ఇంట్లో దిగబెట్టి "పెళ్లయేక శోభనం జరగడం ఆచారం. కానీ ఈ ఇంట్లో వాళ్ల మనసులు నిజమైన పశ్చాత్తాపం పొందిన తర్వాత ఆ శుభకార్యం జరుగుతుంది. పెళ్లంటే నేను మూడో మనిషిగా జోక్యం చేసుకుని జరిపించాను. కానీ మీలో మార్పు తెచ్చుకోవడం అనేది కేవలం మీకు సంబంధించిన విషయం. బెత్తం పట్టుకుని బుద్ధి చెప్పడానికి మీరు ఎలిమెంట్రీ స్కూలు పిల్లలుకారు. నేనింకా కొన్ని రోజులు ఇక్కడే వుంటాను. ఇంక మీ విషయం సింధుజే చూసుకుంటుంది. సింధు ఏం చెయ్యాలన్నది నేను చెప్పే తీసుకొచ్చేను. ఇక మీదట జరిగే సంఘటనలకి నేను కేవలం ప్రేక్షకురాల్ని మాత్రమే! మరి ఈ ప్రేక్షకురాల్ని మీ తండ్రీ కొడుకులు నవ్విస్తారో, లేక ఆవేశపడేలా చేస్తారో మీకే వదిలేస్తున్నాను" అంటూ ఓ గంటసేపు మాట్లాడి వెళ్లిపోయింది.

మధులత వున్న ఆ కాస్సేపట్లో మట్టయ్యని ఆశ్చర్య పరిచిన మరో సంఘటన జరిగింది. అదేమిటంటే అన్నపూర్ణ మధులత చేసిన పనిని మెచ్చుకోవడం. మీరేగనక పూనుకోకుండా వుండుంటే ఓ అమాయకురాలికి బోలెడంత అన్యాయం జరిగిపోయి వుండేదంటూ అభినందిస్తుంటే మట్టయ్య కుతకుతలాడిపోయి "నువ్వు నోర్మూస్కుని లోపలకెళ్లు" అని కసిరాడు. అది మామూలే! కానీ మామూలుగా జరగని విషయం మరొకటి జరిగింది. గత ముప్పై ఏళ్లుగా ఏనాడూ భర్త మీద కోపం ప్రదర్శించి, ఎదురు మాట్లాడని అన్నపూర్ణ ఆరోజు మాట్లాడింది.

"చాల్లెండి... నేనేం చెప్పినా నోరుమూసుకుని లోపలకి ఫో అనే మాట ఎన్నో ఏళ్లనించీ వింటున్నదే! కనీసం ఓ మంచి పని చేసిన ఓ మంచిమనిషిని మెచ్చుకున్నప్పుడైనా మీరా మాట అనకుండా వుంటే బాగుంటుంది. మనం ఎలాగూ ఓ మంచి పని చెయ్యలేం"

ఈ మాటతో మట్టయ్య తల దిమ్మెత్తిపోయింది. నిప్పు ఎక్కడైనా పుట్టొచ్చుగాని, నీట్లో మాత్రం పుట్టదు. ఎదిరింపు ఎవర్లో నైనా రావచ్చుగాని, తన పెళ్లాంలో రావడం అతని వూహకి అందని విషయం! మధులతవల్ల

పబ్లిక్‌లో అవమానం, ఆమె ముందు ఇంట్లో పెళ్లాం వల్ల అవమానం! భార్యని కొట్టబోయి, అంతలోనే తమాయించుకున్నాడు.

మధులత వెళ్లిపోయేక, మేడ మీద వడి యాలు పెడుతున్న అన్నపూర్ణ దగ్గరకి చర చరా వెళ్లి "ఏంటే ఇందాక కూసేవ్... మాముందు ఆ లాయర్ని పొగుడుతావా?" అన్నాడు.

"నేను అన్నం తింటున్న మనిషినండి. ఆవిడ చేసిన మంచిపనికి వూరంతా ఆవిణ్ణీ పొగుడుతున్నారు. అలాంటప్పుడు నేను మెచ్చుకోకపోతే నాకూ పశువుకీ తేడా వుండదు గదండీ" అనేసి చరచరా వెళ్లిపోయింది.

ఇది ఆయనకి మరో పోటు. కొంపదీసి, ఈ



ఎదిరింపును మరెవరూ చూడలేదుగదాని మిగతా డాబాలవైపు చూశాడు. హమ్మయ్య ఎవరూ చూడలేదు.

ప్రభాకర్ మంచంమీద పడుకుని రెక్కలు చాచుకు తిరుగుతున్న ఫేన్‌వైపు చూస్తూ ఆలోచిస్తున్నాడు. ప్రాప్తం అనేమాట, వివాహం దైవ నిర్ణయం అనే మాటలెందుకో గుర్తొచ్చేయి. తనకింతే ప్రాప్తమని సరిపెట్టుకోవాలా? మనం ఎత్తులు, పన్నాగాలు ఎన్ని వన్నినా, భగవంతుడి నిర్ణయం ప్రకారమే పెళ్ళిళ్ళవుతాయని అందుకు తన పెళ్ళే ఓ వుదాహరణని నమ్మి



నోరుమూసుకోవాలా? మధులత వచ్చేక, చంద్రమౌళి, భానుమూర్తిల బండారాలు బయటపెట్టి, ఉద్యోగాలు తీయించేసి, అధికులమని గర్వపడుతున్నవాళ్లని ఇంట్లో కూర్చోబెట్టి, ఆడవాళ్ల చేతికి అధికారమిచ్చింది. దాంతో వాళ్లిద్దరూ పెళ్లాల చేతుల్లో ఎలా గంగిరెద్దులై తల లూపుతున్నారో తనకి తెలుసు. అలాంటిది ఇప్పుడు మధులత శిష్యురాలే తన భార్య అయింది. తనని ఎలా మార్చాలన్నది మధులత సింధుజకి అంతా చెప్పే పంపించేనంది. ఆ లెక్కన ఈ రోజునుంచి సింధుజ తనని సాధిస్తుంది. దెప్పిపొడుస్తుంది. పదిమంది ముందూ అవమానిస్తుంది.

ఆలోచనల్ని ఆపుతూ సింధుజ పిలిచిన పిలుపు వినిపించింది. మంచంమీదనించి లేచి, ఆ గదిలోకి వెళ్లాడు. ఎప్పుడు వచ్చిందో గాని మధులత కూడా అక్కడ వుంది.

"ఏం పిలిచేవ్?" అన్నాడు.

సింధుజని ఆరోజు అవమానించి ఇంట్లోనించి పంపించేక, ఆమెతో మాట్లాడ్డం ఇదే మొదటిసారి. సింధుజ ఆఫీసుకి బయలుదేరుతోంది.

"ఏం పిలిచేవ్?" అన్నాడు ప్రభాకర్ మరోసారి.

అద్దంముందు నిలబడి కనుబొమలు దిద్దుకుంటున్న సింధుజ, అతనివైపు తిరక్కుండానే, చిరాగ్గా జవాబు చెప్పింది. "ఏం చెప్పేవరకూ ఆగలేరా? అవతల మీకేమైనా అర్జంటు పనివుందా? ఏ పని వుండడానికైనా అసలు మీకు ఉద్యోగం వుంటేకదా! నిన్నటివరకూ నాకు ఉద్యోగం లేదు. మీకు వుండేది. కానీ ఈరోజునించి మీకు ఉద్యోగంలేదు. నాకు ఉద్యోగం వుంది. నిన్నటివరకూ ప్రజల దృష్టిలో నేను తప్పుడు మనిషిని, మీరు ఉత్తములు! కానీ నిన్నట్నించి జస్ట్ రివర్స్‌గా మారిపోయింది"

ప్రభాకర్ ముళ్లమీద నిలబడినట్టుగా ఫీలవుతూ- "అది చెప్పడానికే పిలిచేవా?" అన్నాడు.

"కాదు. కానీ ఆ విషయాలు చెప్తే తప్పా? జరిగింది చెప్పేను, మీరు జరిపించింది చెప్పేను. అదిసరే, ఇప్పుడు మీరేం చెయ్యాలంటే మీరు వంటచేసి..."

"వాట్, నేను వంట చెయ్యాలా?" కంగారుపడి అడిగాడు.

"ఎందుకు చెయ్యకూడదు?" సింధుజ సూటిగా అడిగింది.

"నాకు రాదు, వచ్చినా చెయ్యను"

"మీకు కుట్రలు పన్నడం, జీవితాల్తో ఆడుకోవడం తప్ప వంట చెయ్యడం రాదా? రాకపోతే మీ అమ్మగారి దగ్గర ట్రైనింగ్ తీస్కోండి. అంతేగాని ఆవిడచేత వంటచేయిస్తే నేను ఒప్పుకోను. ఆవిడ గత ముప్ఫైఏళ్లుగా ఈ ఇంట్లో జీతంలేని నౌకర్లాగా, ఆజన్మఖైదీలాగా బతుకుతోందని నాకు తెలిసింది. ఇకమీదట ఆవిడకి పూర్తి రెస్టు ఇవ్వదలిచేను. మీరు వంటచేసి, కేరియర్ పట్టుకుని ఆఫీసుకి తీసుకురండి"

ప్రభాకర్‌కి ఆ మాట చెంపదెబ్బలా తగిలింది. ఆ ఆఫీసునించే తను డిస్మిస్ అయ్యేడు. ఆ ఆఫీసులో అందరూ తన పెళ్లికి వచ్చేరు. అక్కడేం జరిగిందో అందరూ చూశారు. ఇప్పుడు వాళ్లంతా తన గురించి ఎంత నీచంగా మాట్లాడుకుంటారో తను ఊహించగలడు, అలాంటి వారిముందుకి, పెళ్లానికి కేరియర్ మోసుకెళ్లే మనిషిగా ఇప్పుడు వెళ్తే, ఇంక అక్కడ తనకెంత గౌరవం జరుగుతుందో బాగా తెలుసు. ఆ పని చేసేబదులు ఈ మేడమీదనించి దూకి చావడం బెటరనుకున్నాడు.

"మాట్లాడరేం?" సింధుజ రెట్టించి అడిగేసరికి అతను ఆలోచనలనించి బయటపడి "ఆఫీసువాళ్లకి నా ముఖం ఎలా చూపించేది?" అన్నాడు కాస్త తగ్గుస్వరంతో

"ఇప్పుడు మీ ముఖం ఎలా వుంటుందో వాళ్లకి చూపించడానికే మిమ్మల్ని కేరియర్ తీసుకురమ్మంటున్నాను. నన్ను దెబ్బకొట్టాలని ప్రయత్నించినవాళ్లు, ఎలాంటి బతుకు బతుకుతారో నిరూపించడానికి మీకు ఈ పని అప్పజెప్తున్నాను" సింధుజ అతన్ని హర్ట్ చెయ్యడానికే అంత ఆవేశంగా మాట్లాడుతోంది.

"నన్ను వంట చెయ్యమన్నావ్ చేస్తాను.




ముప్పైరోజుల్లో వంటలు, వగైరా పుస్తకాలు కొనేసి, అందులో చెప్పిన ప్రకారం రకరకాల వంటలు చేస్తాను. ఇంకా కావాలంటే నీ బట్టలు ఉతికేస్తాను. ఇంకా ఏం చెయ్యమన్నా చేస్తాను. కానీ నీ ఆఫీసుకి కేరియర్ తెచ్చే పనిమాత్రం చచ్చినా చెయ్యను. ఆ బదులు, ఈ మేడమీద నించి దూకి చావడం మంచిది''

మధులత అంతవరకూ ఈ సంభాషణంతా ఆసక్తిగా గమనిస్తోందే తప్ప జోక్యం చేస్కోలేదు. కానీ ప్రభాకర్ అంత ఖచ్చితంగా చెప్పేసరికి ఆమె జోక్యం చేస్కోక తప్పలేదు. ''నువ్వు ఏంచేస్తావు, ఏం చెయ్యవూ అని మేం అడగడం లేదయ్యా! మేం చెప్పినపని నువ్వు చచ్చినట్టు చెయ్యాలి అని చెప్తున్నాం. యుద్ధంలో జయించిన రాజుకి, ఓడిపోయిన రాజు బానిసవుతాడు, బానిసంటే తెలుసుగా! వాడికి బాధ్యతలు తప్ప హక్కులంటూ ఏవీ వుండవు. నీకూ మాకూ జరిగిన యుద్ధంలో మేం విజయం సాధించేం. నువ్వు సింధుజ మెడలో తాళి కట్టడం అంటే అర్థం ఏవిటో తెలుసా? జీవితమంతా నువ్వు మేం చెప్పినట్టు నడుచుకుంటావని చెప్పే ఎగ్రిమెంటుమీద నువ్వు సంతకం చేసినట్టూ అని అర్థం''అంది

మధులత ఎంతో వ్యంగ్యంగా చెప్పిన మాటలకి ప్రభాకర్ అహం దెబ్బతిన్నట్టుగా ఫీలయి, ఆ ఉక్రోషంతోనే అన్నాడు ''అసలు నా జీవితంమీద, ఎక్కడో గుంటూరు నించివచ్చిన మీ అధికారం ఏవిటండి? సరే, మేం ఏదో చేశాం, మీరూ ఏదోచేసి మా పెళ్లి జరిపించేరు, ఇకనైనా మా చావుకి మమ్మల్ని వదిలేసి మీరు దయచెయ్యొచ్చుగా''

వాదన పెరిగింది.

అతని దవడ పేలిపోయేలా కొట్టింది మధులత.

తృళ్లిపడి మంచంమీదనించి లేచాడు ప్రభాకర్.

చెంపని చేత్తో తడుముకుంటూ తను ఎక్కడున్నాడా అని చుట్టూ చూశాడు. తను ఇంకా తన గదిలో తన మంచంమీదనే వున్నాడు. సింధుజ తనని పిలవడం విని, ''ఇంక నా కుక్కబతుకు ఈ క్షణంనించి ఆరంభమవుతుంది'' అనుకోవడంలో వచ్చిన ఊహ ఇది!

అతన్ని పిల్చుకుంటూ సింధుజ ఇప్పుడు నిజంగానే అతని గదిలోకి వచ్చింది. ఆమె పక్కన మధులత లేదు. ''ఏవిటండీ ఎన్నిసార్లు పిల్చినా పలకడంలేదు. ఏం చేస్తున్నారు? నిద్రపోతున్నారా?'' సింధుజ కోపంగా అడగడంలేదు. పెడసరంగా అడగడంలేదు. ఎంతో సౌమ్యంగా నవ్వుతూ అడుగుతోంది.

''ఏంలేదు.... బాత్‌రూమ్‌లో వుండిపోయి... మీ మధుల్లత ఆంటీ ఏదీ? వారింకా మేడమీద వున్నారా?'' ఎటువంటి అధికారం ప్రదర్శించకుండా, చాలా గౌరవం ప్రదర్శిస్తూ అడిగాడు.

''ఆవిడ రాలేదే. వచ్చిందని ఎవరు చెప్పేరు?''

అదంతా తన వూహని ఆమెకు చెప్పలేక, గోడవైపు చూస్తూవుండిపోయేడు.

''సర్లెండి, నేను ఆఫీసుకి వెళ్తున్నాను''

''వెళ్లిరా''

''ఇప్పుడు మీరేం చెయ్యాలంటే-''

''నాకు తెల్సు, వంటచేసి కేరియర్ కట్టి నేను ఆఫీసుకి తీసుకురావాలి'' కంగారు కంగారుగా అనేశాడు.

ఆమె అతనివైపు రెండు మూడు క్షణాలు అలాగే రెప్పార్పకుండా చూసి, పగలబడి నవ్వింది.

''ఆ పనులు చెయ్యమని మీకెవరు చెప్పేరు? వంట చెయ్యడానికి మీ అమ్మగారున్నారు. కేరియర్ తీసుకరావడానికి, కేరీజు మనిషి వుందని మీ అమ్మగారు చెప్పేరు. అయినా వంటచెయ్యడాలు, కేరీజులు మోసుకెళ్లడాలూ మీ మగాళ్లు చేస్తే ఏం బావుంటుందండి? మీకు ఉద్యోగం పోవడం నాకు చాలా బాధగానే వుంది. ఎంతో మంచి మనిషైన రఘుపతిగారు ఇలా చెయ్యడం నాకూ, మధులత ఆంటీకి చాలా ఆశ్చర్యం, బాధా కలిగించేయి. అయితే ఒకటిలెండి, జరిగిందాన్ని బట్టి చెప్తున్నాను. మళ్లీ మీరు ఆ ఆఫీసులో పనిచెయ్యడం నాకూ ఇష్టంలేదు, ఆంటీకీ ఇష్టంలేదు. ఎంతైనా మీరూ మనసున్న మనుమలేకదా! మరోచోట ఎక్కడైనా మీకు ఉద్యోగం దొరికితే బావుణ్ణని మా

ఆంటీతో చెప్తామని వెళ్లేను. కానీ అప్పటికే ఆవిడ కేశవవర్మగారి కంపెనీలో మీకు స్టెనో వుద్యోగం కోసం మాట్లాడ్డం జరిగిపోయింది. మీరా కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ని ఎడ్రస్ చేస్తూ ఫార్మల్‌గా ఓ అప్లికేషన్ పంపించండి. వాళ్లూ ఏదో చిన్న ఇంటర్వ్యూ చేసి మీకు ఎపాయింట్‌మెంట్ ఆర్డర్సు పంపిస్తారు'' అంటూ సింధుజ తన హేండ్‌బేగ్‌లోనించి ఓ చిన్న స్లిప్‌తీసి అతనికిచ్చి, అందులో వున్న ఎడ్రస్‌కి అప్లికేషన్ పంపమని చెప్పి వెళ్లిపోయింది.

ప్రభాకర్‌కేమీ అర్థం కాలేదు. ఇప్పుడు సింధుజ చెప్పింది నిజమా? కలా? పెళ్లి తర్వాత, ఆమె తనపట్ల ఎలా ప్రవర్తిస్తుందని ఊహించాడో అందుకు పూర్తి భిన్నంగా వుంది. ఇందాక తన ఊహలో ఆమె ఓ నియంతలాగా, రింగ్‌మాస్టర్‌లాగా మాట్లాడింది. కానీ ఇప్పుడు? తను అవకాశవాదినని తెలియకముందు ఎంత ప్రేమగా మాట్లాడిందో, ఇప్పుడూ అదేవిధంగా, అంతకంటే ఎక్కువ ప్రేమతోనే మాట్లాడుతోంది. ఈ ప్రవర్తనని శంకించడానికి వీల్లేదు. తనలాంటి దుర్మార్గుల్ని కూడా సహృదయంతో క్షమించేవాళ్లున్నారని చదివేడు. సినిమాల్లో చూసేడు. కానీ అలాంటి ఉత్తములు పూర్వకాలంలో వుండేవారు. సినిమాల్లో అటువంటి మహానుభావుల పాత్రల్ని రచయితలు కావాలని సృష్టిస్తారని అనుకున్నాడు. అలాంటి మనుషులు నిజజీవితంలో కూడా ఉంటారని అది కూడా ఎక్కడో కాదు ఇక్కడే నీ పక్కనే ఉన్నారని ఎవరైనా చెప్పినా నమ్మేవాడు కాదు, కానీ ఇప్పుడు సింధుజని చూస్తుంటే...'' ఈ ఆలోచనలతోనే ఆరోజంతా గడిపేడు.

★ ★ ★

సాయంత్రం సింధుజ ఆఫీసునించి వచ్చేసరికి అన్నపూర్ణ మంచంమీద పడుకుని సన్నగా మూలుగుతోంది. సింధుజ ఆమె గదిలోకి వెళ్లి ''ఏం జరిగింది అత్తయ్యా'' అంది.

''ఇందాక నూతి దగ్గర కాలుజారి పడిపోయేనమ్మా. అక్కడ బాగా నాచుపట్టేసింది. ఏరోజుకారోజు శుభ్రం చేద్దామనుకుంటూనే బద్ధకించేను. రేపు తప్పకుండా శుభ్రం చేసేస్తానమ్మా'' అన్నపూర్ణ ఏదో సంజాయిషీ ఇస్తున్నట్టుగా చెప్పింది.

''నాకు సంజాయిషీ ఎందుకు అత్తయ్యాగారూ. నేను వెళ్లి ఆ నాచు సంగతి చూస్తానుగాని, మీకు జ్వరం కూడా వచ్చింది. డాక్టరుదగ్గరకి వెళ్లకపోయేరా?''

''వద్దమ్మా, మీ మావయ్యగారు కోప్పడతారు'' అంటూ అటుతిరిగి పడుకుంది.

''ఒంట్లో బాగులేనప్పుడు డాక్టరు దగ్గరకి వెళ్తే ఆయనెందుకు కోప్పడతారు? ఒకవేళ ఆయన కోప్పడితే మీ అబ్బాయి ఇంట్లోనే ఉన్నారుగా. ఆయన్ని తీసుకువెళ్లాల్సింది''

''వాడికి తండ్రి మాటే తప్ప నా విషయం పట్టదమ్మా. మీ మావయ్య మొదట్నించి వాడినలా పెంచేరు''

''అయితే నేను తీసుకువెళ్తాను'' అంటూ అన్నపూర్ణ ఎంత వద్దంటున్నా వినకుండా బలవంతాన ఆటోరిక్షాలో డాక్టరు దగ్గరకి తీసుకువెళ్లింది.

ఆ సంగతి తెలిసి మట్టయ్య అదేదో అంతఃపురంలో వచ్చిన తిరుగుబాటుగా ఫీలై ఆవేశంతో చిందులేశాడు. గంట తర్వాత డాక్టరు దగ్గర్నించి ఆడవాళ్లిద్దరూ తిరిగొచ్చేరు. వాళ్లని హాల్లోనే నిలదీసి, ఇలాంటివి మళ్లీ జరిగితే సహించనన్నాడు.

అంతా విన్నాక ''మీరు సమాధానం చెప్తారా? నన్ను చెప్పమంటారా?'' అని అన్నపూర్ణనడిగింది సింధుజ. ఆమె తలదించుకుని మౌనం వహిస్తే సింధుజే సమాధానం చెప్పింది. ''చూడండి మావయ్యగారూ, జీతానికి పనిచేసే ఉద్యోగస్థులక్కూడా కొన్ని హక్కులుంటాయి. కొన్ని సెలవుదినాలుంటాయి. వారానికోసారి కంపల్సరీ హాలిడే వుంటుంది. వాళ్లకి జబ్బులూ జ్వరాలు వచ్చినప్పుడు వైద్య సహాయం పొందడానికి కొన్ని వసతులుంటాయి. రిటైరయింతర్వాత గూడా జీవితం సుఖంగా సాగడానికి ప్రావిడెంటు ఫండు, గ్రేట్యూటీ ఇస్తారు, పెన్షన్ ఇస్తారు. కానీ ఇంటి ఇల్లాలంటే జీతం ఇవ్వక్కర్లేని నౌఖరు, హక్కులు లేని బానిస, విశ్రాంతి అక్కర్లేని మెషిను అనే మీ ఉద్దేశమైతే దాన్ని మీరు వెంటనే మార్చుకోవలసిన అవసరం వుంది. ఇంట్లో ఓ కుక్కకి అనారోగ్యం కలిగితే దాన్ని





డాక్టరుకి చూపిస్తామే, అలాంటిది మీ జీవితాన్ని పంచుకుని మీకు జీవితమంతా సేవలు చేసే మీ భార్యకి ఆ కుక్కపాటి అదృష్టం కూడా లేదా? ఇంటిపనులు చెయ్యడం తప్ప, ధన సంపాదన చెయ్యడంలేదనే మీరు మీ ఆవిణ్ణి లోకువగా చూస్తే, మీ సంగతేవిటో ఆలోచించండి, మీరు ఇంటిపనులూ చెయ్యడం లేదు, ఉద్యోగమూ చెయ్యడంలేదు. కేవలం పేకాట అడ్డంలోనే కాలక్షేపం చేస్తున్నారు. ఏమైనా అంటే నేను మగవాణ్ణి ఇంటికి పెద్దనీ అంటారు. పెద్దరికం అనేది మీ చేతల్ని బట్టి వస్తుంది. మరి, మీ చేతలు ఎలా వుంటాయో, నాకు బాగా అనుభవమేగదా! ఇంక మీరో అనుమానం మనిషని విన్నాను. హుం... అనుమానం అనేది అసమర్థుడి లక్షణం. అదో ఇన్ఫీర్యార్టీ కాంప్లెక్సు. మీరు అనుమానించినట్టే మీ భార్యా మిమ్మల్ని అనుమానిస్తే మీ కాపురంలో కల్లోలమేకదా! చిన్నదాన్ని. మీలాంటి పెద్దల అడుగుజాడల్లో నడవవలసినదాన్ని. కానీ, మీరు నా చేతనే చెప్పించుకునే పరిస్థితి ఏర్పడిందంటే, అది నేను మానసికంగా ఎదిగాననడానికి లక్షణం కాదు, మీరు వ్యక్తిగా, నైతికంగా దిగజారిపోయేరనే నిరూపిస్తుంది''

సింధుజ ఆవేశంగా, అనర్గళంగా మాట్లాడుతుంటే ప్రభాకర్ అవాక్కయి వింటున్నాడు. మట్టయ్య మీద మాత్రం ఆ మాటల ప్రభావం రవంత కూడా పడలేదు. మాటలు దళసరిగా వున్న అతని చర్మాన్ని దాటి గుండెలో దూరలేక పోయేయి.

''ఆ లాయరమ్మ నీకు లెక్చర్లు బాగా నేర్పి పంపిందే'' అన్నాడు వ్యంగ్యంగా.

''సారీ మావయ్యగారూ, ఇవి నాకు మధులత ఆంటీ నేర్పినవో, మరొకరు నేర్పినవో కాదు. నా జీవితం నాకు నేర్పింది. పురిటికందుగా వున్నప్పుడే నా తల్లిని పోగొట్టిన నా దౌర్భాగ్యం నేర్పింది. మారుటి తల్లి పెంపకంలో ప్రేమాభిమానాలు సంపాదించుకోలేని నా దురదృష్టం నేర్పింది. అత్తయ్యగార్ని చూడగానే, నాకు తల్లి దొరికిందని సంతోషించేను...'' అంటుంటే మట్టయ్య అవమానంగా ఫీలయి ''ఈ ఇంట్లో ఆడాళ్లు లెక్చర్లిస్తే మగాళ్లు వెఱ్ఱిపీనుగుల్లా వినాల్సిన దుస్థితి కలగకూడదు. ఇంకా లెక్చర్లు ఆపుచేసి ఇంటిపని చూడండి'' అనేసి తన గదిలోకి వెళ్లిపోయాడు.

సింధుజ చెప్పిన మాటలు వృధాకాలేదు. అన్నపూర్ణ తీవ్రంగా స్పందించింది. తన గురించి ఆలోచించే మనిషి ఈ ఇంట్లో ఇప్పుడు కనిపించింది. తననో మనిషిగా గుర్తించే మరో మనిషి ఇప్పుడు ప్రవేశించింది. నేను బానిసనీ కాదు, యంత్రాన్నీ కాదనే భావన అప్పుడే ఆ క్షణమే ఆమె హృదయక్షేత్రంలో అంకురించింది. ప్రభాకర్‌ని కూడా ఆలోచింపచేసే సంఘటన మరొకటి జరిగింది. ఆ వీధిలో వినాయక నవరాత్రి ఉత్సవాలు జరుపబోతున్నారు. ఆ ఉత్సవాలు నిర్వహించే కమిటీవారు మట్టయ్యని ''మీ పేరుమీద ఓ కలర్ పిక్చర్ వేయించండి'' అని అడిగారు. ఇప్పుడు నవరాత్రి ఉత్సవాల్లో 16 యం.యం.గాని 35 యం.యం. సినిమాలుగానీ వేయిస్తున్నారు. లేదా లలిత సంగీతం ఆర్కెస్ట్రా పెడుతున్నారు తప్ప బుర్రకథలు బాగా తగ్గిపోయాయి. ఇంకా హరికథలైతే పట్టణాల్లో కనబడ్డమే మానేశాయి. మట్టయ్య సినిమాలు వేయించడానికి డబ్బు ఇవ్వలేనుగాని, నా చందాగా ఓ అయిదువందలు వేస్కోండి అని నెలకిందటే అనేశాడు. ఇప్పుడు వాళ్లు డబ్బు కలెక్ట్ చేస్కోడానికి వచ్చేరు. అయితే వాళ్లకి మాట ఇచ్చేనాటికీ, ఇప్పటికీ పరిస్థితులు మారిపోయాయి కాబట్టి, అయిదువందలు ఇవ్వడం సమస్యగా మారిపోయి, డబ్బులు ఇచ్చే బాధ్యత ప్రభాకర్‌మీద పెట్టేడు.

''నా దగ్గరెక్కడున్నాయి? మాట ఇచ్చింది నువ్వే కాబట్టి నువ్వే ఇచ్చుకో'' అనేశాడు ప్రభాకర్.

''పేకాట్లో డబ్బులొస్తే నేనే ఇచ్చేవాణ్ణి. కానీ ఈ దిక్కుమాలిన పెళ్లైందగ్గర్నించీ అంతా దరిద్రంగానే వుంటోంది. ఒక్కరోజూ ఒక్కాటా గెలవడంలేదు'' అంటూ ఆ కార్యకర్తలవైపు తిరిగి ''చూడండి బాబూ, ఈ సంవత్సరానికి నేనేం ఇచ్చుకోలేను. నన్ను వదిలెయ్యండి'' అన్నాడు తన నిస్సహాయతని వ్యక్తంచేస్తూ.

''అలా అంటే ఎలా సార్! మీరందరూ

ఇచ్చే డబ్బుని దృష్టిలో పెట్టుకునే తొమ్మిదిరోజులకీ తొమ్మిది ప్రోగ్రాములు ఫిక్స్ చేసేశాం. ఇప్పుడు మీరు కాదంటే వాళ్ల దగ్గర మాకు మాటవస్తుంది. మన వీధికి చెడ్డపేరూ వస్తుంది'' అని ఒక కార్యకర్త అంటే, మరో ఆయన ''మీరు మాజీ కౌన్సిలరుగారూ, కాబోయే మినిస్టరుగారూ అయివుండి, ఆఫ్టరాల్ అయిదువందలు ఇవ్వడమే మీ లెవెల్‌కి ఇన్సల్టు. ఇప్పుడా డబ్బు ఇవ్వలేనంటే మరీ ఇన్సల్ట్ కదండి'' అన్నాడు.

''ఒరే నాయనా, కాబోయే మినిస్టర్నే కాదురా, కాబోయే చీఫ్ మినిస్టర్ని కూడా నేనే! కానీ ఈ ఇంటికొచ్చిన మహాతల్లి నా అదృష్టరేఖని చీపురుతో తుడిచేసి ఫినాయిల్‌వేసి కడిగేసింది...'' మట్టయ్య అలా అంటున్నప్పుడే సింధుజ ఆఫీసునించి వచ్చి, విషయ మంతా విన్నది, ''పోనీ మీరైనా ఇవ్వండి మేడమ్'' అన్నాడో కార్యకర్త వినయంగా.

ప్రభాకర్ సింధుజ ఏమంటుందా అని ఆమెవైపే ఆసక్తిగా చూశాడు.

''మీకు శక్తి లేనప్పుడు దానధర్మాలు మానెయ్యాలి, లేదా మీ శక్తిమేరకి తగ్గించాలి. కానీ నోరుందికదాని ఎంత బడితే అంత చందాలు ప్రకటిస్తే ఇలాగే వుంటుంది. అయినా ఇప్పుడీ యింట్లో సంపాదించే మనిషి ఒక్కరూ, తినేవాళ్లు నలుగురు. నాకొచ్చే రెండువేల్లోను డిడక్షన్సు పోగా చేతికందేది పద్దెనిమిదివందలు. అందులో అయిదువందలు చందాకింద ఇచ్చేస్తే మిగిలిన పదమూడు వందల్తో ఇల్లెలా గడుస్తుంది? నా పెర్సనల్ ఖర్చులెలా భరించగలను? నేను అయిదువందలు కాదుగదా అయిదురూపాయలు కూడా ఇవ్వను. ఇంట్లో ఇబ్బంది పడుతూ, దేవుడి సంబరాలకి చందాలివ్వడం మూర్ఖత్వం అనిపించుకుంటుంది. ఇస్తామని మాట ఇచ్చి ఇప్పుడు ఇవ్వననడంవల్ల మీ పరువు పోతుందనుకుంటే ఆ పరువు సంగతేదో మీ తండ్రీకొడుకులే చూస్కోండి''

వీపుమీద ఓ దెబ్బపడేసరికి ప్రభాకర్ ఉలికిపడ్డాడు. ఆ దెబ్బవేసింది మట్టయ్య. ''కుర్రాళ్లంతా వెళ్లొస్తాం అని చెప్తుంటే అలా గుడ్లప్పగించి చూస్తావేంరా? నిలబడి నిద్రపోవడం ఎప్పట్నించి నేర్చుకున్నావ్?'' తండ్రి అలా అంటుంటే ప్రభాకర్ కంగారుపడి, ఆ కుర్రాళ్లతో ''సారీ బాబూ, ఒకటి రెండురోజుల్లో నేనెక్కడైనా ఏర్పాటుచేసిస్తాను'' అన్నాడు.

''మీరెందుకివ్వడం? మీ మిస్సెస్‌గారు ఇచ్చేశారు కదండి'' అంటూ కుర్రాళ్లంతా వెళ్లిపోయేరు. అంటే సింధుజ చేసిన వాదనంతా తన ఊహేనన్నమాట అనుకున్నాడు.

''నువ్వెందుకిచ్చేవ్? నేను ఎక్కడో అప్పుచేసి ఇచ్చేవాణ్ణికదా'' అన్నాడు గిల్టీగా ఫీలవుతూ.

''మీరేవిటి? నేనేవిటి? ఇది మన ఇల్లు. నేను ఈ ఇంటికోడల్ని. అయిదువందల చందా మన శక్తికిమించిందే అనుకోండి. కానీ మావయ్యగారు మాటిచ్చేక దాన్ని అమలు జరపాల్సిన బాధ్యత, ఆయన పరువు నిలపాల్సిన బాధ్యత మనమీద వుందిగదండి'' అంది ఎంతో సౌమ్యంగా.

ప్రభాకర్ ఏదో అనాలనుకున్నాడు గాని, అనలేకపోయేడు. అన్నపూర్ణ మాత్రం ''మీ మావయ్యకి ఒకప్పుడు పరువుంటేకదమ్మా ఇప్పుడు పోవడానికి! ఒకవేళ ఓ పిసరంత పరువువుందని ఆయననుకున్నా అది కాస్తా నీ పెళ్లిటైములోనే పోయింది'' అనేసి ఇంట్లోకి వెళ్లిపోయింది.

భార్య వెలిబుచ్చిన అభిప్రాయంతో, ఆమె చేసిన కామెంట్‌తో మట్టయ్య కుతకుతలాడిపోయేడు. ముప్పై ఏళ్లుగా కుక్కిన పేనులా పడివున్న పెళ్లాం ఇప్పుడు తననే వ్యంగ్యంగా మాట్లాడుతోందంటే అదంతా ఈ సింధుజ మహిమే! వస్తుందనుకున్న డబ్బూపోయి, పెద్దలముందు పరువూపోయింది. ఇప్పుడు ఇంట్లో కూడా పరువుపోతే, తన భవిష్యత్తు అంతా నాశనమైపోయినట్టే. దీనికేదో పరిష్కారం ఆలోచించాలి. పక్కలో వున్నది పాము అని తెలిశాక దానికి పాలుపోసి పెంచడం మూర్ఖత్వమే అవుతుంది. ఏదో చెయ్యాలి ఏదో చెయ్యాలి అని పదేపదే అనుకున్నాడు.

సింధుజ ప్రవర్తన ప్రభాకర్‌లోని అవకాశవాదిని బలహీనపరుస్తోంది. అతనిలో మిగిలిన దుర్మార్గపు ఆలోచనల్ని దారి మళ్లిస్తోంది. సింధుజ వ్యక్తిత్వానికి తలవంచి జోహార్లు





అర్పించదగ్గ సంఘటనలు మరో రెండు మూడు జరిగాయి. దాంతో ప్రభాకర్‌లో వున్న దుర్మార్గుడు దాదాపుగా చనిపోయినట్టే! ఓరోజు మధులత ఆ ఇంటికొచ్చి సింధుజని ప్రోగ్రెస్ ఏవిటని అడిగింది. సింధుజ చెప్పిన సమాధానం ఆమెనెంతో సంతోషపెట్టింది. ''యుద్ధం చేసి కొన్ని సమస్యల్ని సాధించాలి, ప్రేమతో మరికొన్ని జయించాలని నేను చెప్పిన సిద్ధాంతాన్ని చక్కగా అమలు జరిపేవు'' అంటూ అభినందించింది.

''ఆయన విషయంలో నేను ఆశించిన పరివర్తన వచ్చిందిగాని మా మావయ్యగారిలో ఎటువంటి మార్పూ రాకపోగా, నన్ను శాశ్వతంగా తొలగించే మార్గం వెదుకుతున్నాడని నా అనుమానం'' అంటూ తను ఎందుకు అనుమానపడిందో సింధుజ వివరించింది. అంతా విన్నాక మధులత కాస్సేపు మౌనంగా వుండిపోయి ఆలోచనలోపడింది. తర్వాత తన గెస్టుహౌస్‌కి వెళ్తూ, ''ఏమైనా నువ్వు కాస్త జాగ్రత్తగా వుండాలి'' అని హెచ్చరించింది.



సింధుజ మట్టయ్య తన మీద మళ్లీ ఏదో పథకం వేస్తున్నట్టుగా అనుమానించిందేగాని, ఆ పథకం తాలూకు వివరాల్ని మాత్రం తెల్సుకోలేకపోయింది. నిజంగానే మట్టయ్య ఓ పథకం వేశాడు. అది, ఇలా అనుకుని అలా అమలు జరిపే పథకం కాదు. అందుకే ఓ వారం రోజులు టైము తీసుకున్నాడు. అతను ప్రతిరోజూ పేకాట ఆడేది ఆ వీధి చివర క్లబ్బులోనే. ఒకరోజు క్లబ్‌నించి రాత్రి పది గంటలకే ఇంటికి బయలుదేరాడు.

''ఇదేంటి మట్టయ్యా, రాత్రి పన్నెండుదాటి తారీఖు మారేదాకా క్లబ్బు వదలని వాడివి, ఇవాళ పది గంటలకే దుకాణం కట్టేశావ్! ఏం నీ కొత్త కోడలుగారు పది దాటేక ఇంటికొస్తే తలుపులు తియ్యనని రూలు పెట్టిందా?'' రామస్వామి అనే పేకాట ఫ్రెండు సరదాగా జోక్ చేశాడు.

మరొకాయన ''రూలు పెట్టినా మనం ఆశ్చర్యపడనక్కర్లేదండి. ఎందుకంటే మట్టయ్యా కొడుకు పెళ్లి విషయంలో, ఈయన కిలాడీలా ఎత్తువేస్తే ఆ అమ్మాయి జగత్‌కిలాడీలా పై ఎత్తు వేసి మరీ కోడలిగా ఈయన ఇంటికొచ్చింది. ఇప్పుడు ఆవిడ ఆడే పేకాటలో మట్టయ్యా జోకర్ ముక్కయిపోయేడు'' అంటూ మరో జోక్ పేల్చేసరికి అందరూ పగలబడి నవ్వేరు. అందుకు మట్టయ్యా ఏమీ ఫీలవకుండా, ఏదో మనోవేదన అనుభవిస్తున్నట్టుగా ముఖం పెట్టి అన్నాడు, ''నవ్వండిబాబూ... నవ్వండి... జరిగిపోయిన ఎత్తులు, పై ఎత్తులు అన్నీ ఆ పెళ్లితో కంచికి వెళ్లిపోయేయని భావించి నేనూ మీతో పాటే నవ్వేసేవాణ్ణి. కానీ ఆ భగవంతుడు నాకా అదృష్టం కూడా రాయలేదే! బందిఖానాలో పెట్టి రామదాసుని పరీక్షించినట్టు, నన్ను ఏ జైల్లోనూ పెట్టకుండానే పరీక్షిస్తున్నాడు'' అంటూ నీళ్లురాని కళ్లని రుమాలుతో తుడుచుకున్నాడు.

''నీకేం కష్టం వచ్చిందయ్యా! ఏడిపించడం తప్ప ఏడవడం తెలియని నువ్వేడుస్తున్నావు?'' అంటూ రంగారావ్ సారా షావుకారు కాసింత జాలి చూపిస్తూ అన్నాడు.

''ఏం చెప్పమంటారు రంగారావుగారూ! మా వాడి పెళ్లి ఎన్ని డొంకలు తిరిగి, ఎన్ని తిట్లు కాయించి, నా పరువు తీయించి అయిందో మీ అందరకీ తెల్సిందేగదా! సరే అయిపోయింది. చరిత్రని క్రీస్తు పూర్వం, క్రీస్తు తర్వాత అని రెండు భాగాలుగా ఎలాగైతే చెప్తారో, టానిక్కుల పబ్లిసిటీలో టానిక్కులు వాడకముందు, వాడింతర్వాత అంటూ ఒక బక్కవాణ్ణి, ఒక దుక్కలాంటివాణ్ణి ఎలాగైతే చూపిస్తారో నా విషయం గూడా నా కొడుకు పెళ్లి చెయ్యకముందు దుర్మార్గాల మట్టయ్యా, వే





సింతర్వాత సన్మార్గాల మట్టయ్య అని రెండు భాగాలుగానే చెప్పుకోవాలండి. ఎంచేతంటే జరిగిన అవమానంతో పశ్చాత్తాపం చెంది, నేనిప్పుడు బాలయోగి, తాజుద్దీన్ బాబా, తలకోన మొల్తాడు మహర్షి, ఇంకా ఆ పైపు మహర్షు లుంటారే, ఆ విధంగా బతికేస్తున్నాను''

''నువ్వు మహర్షిగా మారిపోతే పేకాట ఎందుకాడుతున్నావ్?'' అంటూ జోగారావు జోక్ చేస్తే, చేతిలోవున్న పేకముక్కల్ని విసిరికొట్టేడు మట్టయ్య.

''ఏడుస్తున్నోణ్ణి వేళాకోళం చెయ్యడం కాదు. ఆ ఏడుపులో మీరూ వాటా పంచుకోవాల. మనసులోని బాధ ఓ పేకదస్తాలాంటిదయ్యా! ముక్కలు పంచేకొద్దీ దాని సైజు తగ్గిపోతుందనే మీకు చెప్తున్నాను. సరే భగవంతుడి నిర్ణయం అలాగున్నప్పుడు నేను దానికి తల ఒగ్గక తప్పదు కదాని, ఆ అమ్మాయిని కోడలిగా తెచ్చుకున్నాను. కన్నకూతురికంటే ఎక్కువగా చూసుకుంటున్నాను. కానీ అప్పుడే నాకు తెల్సింది... మా కోడలికి నిద్దట్లో నడిచే జబ్బుందని'' అంటూ ఠక్కుమని ఆగి, ఆ మాటకి అక్కడున్న వారంతా ఎలా రియాక్టయేరా అని అందరి ముఖాలవైపూ దొంగచూపులు చూసేడు.

అందరూ ఏదో కొత్త న్యూసు వింటున్నట్టుగా అతనివైపు ఆసక్తిగా చూశారు. హమ్మయ్యా... అందరూ నమ్మడానికి సిద్ధంగానే వున్నారని తృప్తిపడి మళ్లీ చెప్పనారంభించాడు. ''ఆ జబ్బుని మామూలుగా స్లీప్‌వాక్ అని, డాక్టర్లు మాత్రం దాన్ని సోమ్నాంబులిజం అని అంటారట. ఆ జబ్బున్నవాళ్లు నిద్దట్లో నడుచుకుంటూ వెళ్లిపోయి గోతుల్లో కొంతమంది పడి చచ్చిపోయేరట. కొంతమంది లారీలకింద బస్సులకిందపడి చచ్చిపోయేరట'' అంటూ ఆ వ్యాధివల్ల ఎవరెవరు ఎలాంటి ప్రమాదాలకి లోనై ప్రాణాలు పోగొట్టుకున్నారో వివరించి, సడన్‌గా దుఃఖాన్ని తట్టుకోలేనట్టుగా భోరుమంటూ ఏడ్చేశాడు.

''మొన్న రాత్రి నేను క్లబ్బునించి ఇంటికెళ్తుండే సమయానికి మా కోడలు రోడ్డు మీద కళ్లు మూసుకుని నడుచుకుంటూ వెళ్తోంది. నేనూ మా అబ్బాయీ కనక ఆవిణ్ణి పట్టుకుని పక్కకి లాగడం ఒక్కక్షణం ఆలస్యమైవుంటే, ఎదుట్నించి వస్తున్న లారీ కిందపడి ఠపీమని చచ్చిపోయి వుండేది'' అతను చెప్పింది అందరూ శ్రద్ధగా వింటున్నారు. మట్టయ్యకి రెండు నాలికలు, నాలిక్కి రెండేసి మాటలు, మాటకి రెండేసి అర్థాలు వుంటాయి. అంచేత అతను చెప్పింది నిజమా? కాదా? అనే సందేహం అందరికీ వచ్చినా, చెప్పింది స్వయానా కోడలి విషయం కాబట్టి అబద్ధం ఎందుకు చెప్తాళ్లే, అని కూడా అనుకున్నారు. షావుకారు రంగారావు సిగరెట్ వెలిగించి, పొగ వదుల్తూ ''మట్టయ్యగారు చెప్పింది వింటుంటే, వెనకటికి మా మావయ్య సంగతి జ్ఞాపకం వస్తున్నదయ్యా'' అన్నాడు.

''అంటే మీ మామయ్యక్కూడా ఇలాంటి జబ్బుండేదా?'' మట్టయ్య ఆసక్తిగా అడిగాడు.

''వుండేదండి... అప్పటికి మేం చిన్న కుర్రోళ్లం. మాది పల్లెటూరుగదా, మా మావయ్య మా ఇంటి ముందున్న పాకలో మంచం ఏసుకుని పడుకునేవాడు. అర్ధరాత్రికాడలేచి, నడుచుకుంటూ వెళ్లిపోయేవాడు. వచ్చిన గొడవెక్కడంటే, అతగాడు ప్రతీరోజూ తిన్నగా వెళ్లి మున్సబుగారి ఇంటి అరుగుమీదే పడుకునేవాడు. మున్సబుగారి కోడలు పిటపిటలాడుతూ సినిమా ఏక్టరు లెవెల్లో వుండేది. ఆవిడకి, మా మావయ్యకి కనెక్షన్ వుందేమో, లేకపోతే వూళ్లో మరే ఇల్లూ లేనట్టు తిన్నగా మా ఇంటికొచ్చి తొంగోడం ఏటని మున్సబు చాలా గొడవ పెట్టేవాడు. నాకేటీ తెల్దు మొర్రో, అస్సలు నేనిక్కడకెలాగొచ్చేనూ అని మా మావ గోలపెట్టేవాడు. అది పల్లెటూరు కాబట్టి, ఇట్టాంటి జబ్బు ఒకటి వుందని కూడా తెలీక, అతనికి దెయ్యమో, కామినీ పిశాచమో పట్టిందనుకుని భూతవైద్యుడి చేత వైద్యం చేయించేరు. డబ్బులు ఖర్చయ్యేయి. మా మామకి వేపరెమ్మలతో కొట్టిన దెబ్బలు మిగిలాయి తప్ప, జబ్బు మాత్రం తగ్గలేదు. కొన్నాళ్లపాటు, అతను పడుకున్నప్పుడు మంచానికి తాళ్లేసికట్టేరు'' అంటూ చేతిలోవున్న సిగరెట్ పారేసి మరొకటి వెలిగించాడు. మట్టయ్య అతన్ని అడిగి ఓ సిగరెట్టు తీస్కుని తనూ వెలిగించి,

"ఆ తర్వాతేమైంది?" అన్నాడు ఆసక్తిగా.

"తాళ్లతో కట్టేయడంవల్ల మునుపట్లా ఎక్కడికీ వెళ్లేవాడుకాదు. కానీ, ఓ నెలా రెండు నెలలు గడిచేక, అతగాడికి పట్టిన దెయ్యం వదిలిందని తాళ్లతో కట్టడం మానేశారు. ఆ తర్వాతొకరోజు, నిద్దట్లో నడుచుకుంటూ తాటి తోపులోకి వెళ్లిపోయేడు. అక్కడే నాగుపాము కరిచేసి అక్కడికక్కడే నురగలు కక్కుకుంటూ చచ్చిపోయేడు"

రంగారావు చెప్పింది విన్నాక అందరూ గుండె బరువెక్కినట్టుగా ఫీలై, మౌనంగా వుండిపోయేరు. కొన్ని క్షణాల తర్వాత జోగారావన్నాడు,

"మీ మావయ్యంటే ఆరు బయటపడుకునేవాడు కాబట్టి, నిద్దట్లో నడిచి వెళ్లే అవకాశం వుంది. కానీ మట్టయ్యగారి కోడలి విషయం వేరు. రాత్రిపూట తలుపులన్నీ గడియపెట్టి వుంటాయి కాబట్టి బయటకి వెళ్లే అవకాశం లేదు. మరావిడ ఎలా వెళ్లిపోయిందో నాకు అర్థం కావడం లేదు"

మట్టయ్య అతని మీద చిరాకు ప్రదర్శిస్తూ "ఇందులో అర్థం కాకపోవడం ఏం వుందండీ? నేనా అర్ధరాత్రి అయేవరకూ ఇల్లు చేరనుగదా. మా ఆవిడ ఇంటి తలుపులు బార్లా తెరిచే వుంచుతుంది. ఇప్పుడు నేను తొందరగా ఇంటికి పారిపోవాలనుకుంటున్నది కూడా అందుకే గబుక్కుమని వెళ్లిపోయి, తలుపులు మూసేసి లోపల్నించి తాళం కూడా వేసేస్తాను. ఇప్పుడు రంగారావుగారు చెప్పింది విన్నాక నాకు మరీ బేజారు ఎక్కువైపోతోంది. వస్తానండి, ఇప్పటికే ఆలస్యమైపోయింది" అంటూ హడావిడి నటిస్తూ వెళ్లిపోయేడు.

ఆ మర్నాడే షావుకారు, రంగారావు ప్రభాకర్ కి ఎదురుపడి, మీ ఆవిడకి ఫలానా విధమైన జబ్బుందటకదా, మీ నాన్న చెప్పేడు. ఇప్పుడు అలాంటి జబ్బులు నయం చెయ్యడానికి బోలెడంత మంది డాక్టర్లున్నారు. మరేం కంగారుపడకు. అంటూ ధైర్యం చెప్పి వెళ్లిపోయాడు. అతని ముందు ప్రభాకర్ సింధుజ జబ్బు విషయమై ఔననిగాని, కాదనిగాని చెప్పలేదు. సింధుజ, తను ఒకే ఇంట్లో వుంటున్నా ఒకే గదిలో పడుకోవడంలేదు. అంచేత ఆమెకా జబ్బు వుందేమో అని గూడా అనుకోలేకపోయేడు. ఎందుకంటే, నిద్దట్లో నడుస్తున్న సింధుజని తనూ, తన తండ్రి పట్టుకుని తీసుకొచ్చినట్టుగా రంగారావుతో చెప్పేడట. అంటే, సింధుజ విషయంలో తన తండ్రి ఏదో కొత్త పథకం వేస్తున్నట్టుగా అర్థమవుతోంది. గబగబా ఇంటికి వెళ్లి మట్టయ్యనే అడిగాడు.

"ఔనురా, సింధుజ ఈ ఇంటి కోడలుగా వుండడంవల్ల నీకు గాని, నాకుగాని లాభం వుండదు. మనకంటే తెలివి తక్కువది పెళ్లాంగావుంటే సుఖంగాని, మనకంటే తెలివైంది అయితే మనకది మొగుడవుతుంది. అంచేత దానికి నిద్దట్లో నడిచే జబ్బుందని వీధిలో బిల్డప్ ఇచ్చేను. రేపు పదో తారీఖు రాత్రి పది గంటలకి గమ్మత్తుగా బయటకి రప్పించి నిర్మానుష్యంగా వున్న చోట దాన్ని లారీతో డేష్ కొట్టించే ఏర్పాటు చేశాను. డేష్ కొట్టగానే లారీ దానిమట్టుకది రయ్‌మంటూ వెళ్లిపోద్ది. ఆ కేసుని హిట్ అండ్ రన్ కేసు కింద పోలీసులు రాసేసుకుంటారు. దాంతో ఏ గొడవా లేకుండా దాని బెడద వదిలిపోద్ది. ఆ తర్వాత నీకు కనీసం పది లక్షలు వచ్చే సంబంధం చూసి పెళ్లి చేస్తాను" అంటూ మట్టయ్య తను తెలివిగా తయారు చేసిన పథకాన్ని వివరించాడు.

తండ్రి ఏం చేసినా, ఏం చెప్పినా తను ఇంతవరకు సహాయకుడిగానే పని చేశాడు. అతని మార్గాన్నే అనుసరించాడు తప్ప ఏనాడూ ప్రశ్నించలేదు. కానీ ఇప్పుడు? సహకరించాలా? నిరాకరించాలా? చెప్పినవాడు కన్న తండ్రి. ఈ పథకం నెరవేరితే లాభమే కలుగుతుంది. ప్రభాకర్ తీవ్రంగా ఆలోచించనారంభించాడు.

★ ★ ★

ఆరోజు పదవ తారీఖు.

సింధుజ చావుకి మట్టయ్య నిర్ణయించిన ముహూర్తం ఆరోజే! తండ్రి చెప్పిన ప్రకారం ఆరోజు రాత్రి ప్రభాకర్ ఇంట్లో వుండకూడదు కాబట్టి సాయంత్రం ఏడు గంటలకే ఇంటి నించి వెళ్లిపోయేడు. రాత్రి పది దాటుతుండగా మట్టయ్య అంబిక అనే నాటకాలమ్మా

యిని తీస్కుని ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్ దగ్గరకి వచ్చేడు. అంబిక రకరకాలుగా గొంతు మార్చి మాట్లాడ్డంలో ప్రావీణ్యం సాధించిన మహిళ. మట్టయ్యా చెప్పిన ప్రకారం అంబిక మధులత గొంతు ననుకరిస్తూ సింధుజకి ఫోన్ చేసింది. తనకి గుండె నెప్పిగా వుందని, వెంటనే కార్డియాలజిస్టు దగ్గరకి వెళ్లాలని, తోడుగా సింధుజ రావాలని చెప్పింది. కారు డ్రైవరు వెళ్లిపోయేడు కాబట్టి, కారు పంపే అవకాశం లేదు. ఏదైనా ఆటో ఎక్కి వచ్చెయ్యమంది. అంబిక ఎంతో గుండె నెప్పితో బాధపడుతున్న పేషెంటులా నటిస్తూ చెప్పేసరికి ఆమె ప్రావీణ్యం గురించి తెలిసిన మట్టయ్యా గూడా మరోసారి ఆశ్చర్యపోయి, చెప్పిందానికంటే మరో యాభై ఎక్కువిచ్చి పంపించాడు.

సింధుజ ఫోన్ పెట్టేసి, గబగబ బట్టలు మార్చుకుని బయలుదేరింది. "ఇంత రాత్రి పూట ఎక్కడకి బయలుదేరావమ్మా" అని అన్నపూర్ణ అడిగితే, మా ఆంటీకి సీరియస్‌గా వుందని చెప్పింది. ఆమె కూడా ఆతృతపడుతూ బయలుదేరబోయిందిగాని "ఫర్వాలేదత్తయ్యా... నేను వెళ్తాన్లెండి. మరీ అవసరమైతే మీకు ఫోన్ చేస్తాను. అప్పుడు వద్దురుగాని" అంటూ హడావిడిగా బయటకి నడిచింది. సమయానికి అబ్బాయి కూడా ఇంట్లో లేడని అన్నపూర్ణ బాధ పడుతూనే తలుపులు గడియ పెట్టింది.

ఆ వీధిలో పగలే ఆటోలు దొరకవు. ఇంక రాత్రి పూట అయితే చెప్పనవసరంలేదు. ఆటో స్టాండ్ దగ్గరకి నడుచుకెళ్లాల్సిందే! వీధిదీపాలు వెలగక పోవడంవల్ల వీధి అంతా చీకట్లో మునిగిపోయింది. సింధుజ చీకట్లో వడివడిగా నడుస్తోంది. వీధిలో ఎవరూ తిరుగాడ్డంలేదు. కొంత దూరం నడిచేక ఓ ఆటో వచ్చి ఆగింది. ఆగడం, అందులో వున్న ఓ బలమైన మనిషి ఆమెను విసురుగా లోపలకి లాగడం ఆటో ముందుకు దూసుకుపోవడం, అంతా క్షణాల మీద జరిగిపోయింది. సింధుజ ఎంత గింజుకున్నా ఆ బలాఢ్యుడి పట్టు రవంత కూడా నడలలేదు. ఆమె అరవకుండా నోట్లో రుమాలు కుక్కాడు.

నిర్మానుష్యంగా వున్న రోడ్డు పక్కన నిలబడ్డ మట్టయ్యా దగ్గరకి ఆటో వచ్చి ఆగింది. రౌడీ సింధుజని బయటకి నెట్టి తనూ ఆటో దిగేడు. ఆటో వెళ్లిపోయింది. మట్టయ్యా తన చేతిలో వున్న టార్చి లైటుని ఓ వైపు ఫోకస్ చేశాడు. అంతవరకు చీకట్లో వున్న లారీ స్టార్టయింది. హెడ్ లైట్లు వెలిగాయి. రౌడీ సింధుజని బలంగా పట్టుకుని రోడ్డు మధ్యన నిలబడ్డాడు. లారీ స్పీడుగా ముందుకొస్తోంది. అది దగ్గరకి రాగానే దాని చక్రం కిందకి సింధుజని తోసి రౌడీ ఒడుపుగా పక్కకి తప్పుకోవాలి. సింధుజ గింజుకుంటోంది. లారీ రయ్‌మంటూ వస్తూ వస్తూ టక్కున ఆగిపోయింది.

లారీ ఎందుకు ఆగిపోయిందో మట్టయ్యాకి అర్థంకాక వెనక్కి చూశాడు. పోలీసు జీపు కనిపించింది. అందులోనించి యస్పీ ఉపారాణి, మరో యస్సై, నలుగురు కానిస్టేబుల్సు దిగారు. పోలీసులు ఎలా వచ్చేరో మట్టయ్యాకి అర్థం కాలేదు. అతని సందేహం ఇంకా నివృత్తి కాకుండానే మరో వైపునించి వైట్ ఎంబాసిడర్ కారు వచ్చి ఆగింది.

అందులోనించి మధులత దిగింది!

ఆమెతోపాటు దిగిన వ్యక్తి ప్రభాకర్!

మట్టయ్యాకేం జరిగిందో అర్థంకాలేదు. తన పథకం ఎక్కడో బెడిసికొట్టింది. తనకీ తన కొడుక్కీ తప్ప తెలియని విషయం యింత మందికి తెలిసిపోవడం ఏమిటి? మట్టయ్యా చీకట్లో పరుగెత్తనారంభించాడు. యిద్దరు కానిస్టేబుల్సు అతని వెంటబడి, ఎక్కువదూరం వెళ్ళకుండానే అతన్ని పట్టుకుని లాక్కొచ్చేరు. జీపు దిగగానే యస్సై, కానిస్టేబుల్సు రౌడీని, లారీ డ్రైవర్‌ని పట్టుకున్నారు.

"నాకేం తెలీదు. ఈ రౌడీ ఎవరో నాకు తెలీదు. ఆ డ్రైవరెవరో నాకు తెలీదు తెలీదు" అంటూ మట్టయ్యా పిచ్చివాడిలా అరిచాడు. కానీ, రౌడీ వూరుకోలేదు. "ఛ వూర్కోండి, మీరు చెప్తేనేకదా మేం చేశాం. యిప్పుడు మీమట్టుకు మీరు తప్పేసుకుంటే ఎలా?" అన్నాడు.

మధులత మట్టయ్యా దగ్గరకొచ్చింది. ఆ నిశీధిలో లారీ కారు, జీపులైట్ల వెలుగులో ఆమె కళ్ళు ఆకలిగొన్న ఆడపులి నేత్రాల్లా మెరుస్తున్నాయి.

"సింధుజని నీ యింటినించి తప్పించే




ప్రయత్నాలేవో జరుగుతున్నాయని అనుమానించి సింధుజ నాతో చెప్పిందగ్గర్నించి నేను నీ మూమెంట్స్‌మీద నిఘా వేసుంచేను. నీ కోడలికి నిద్దట్లో నడిచే జబ్బుందని నువ్వు కావాలని ప్రచారం చేస్తున్నావన్న విషయం తెలిసి, నువ్వు చేయబోయే దుర్మార్గం కొంతవరకు వూహించాను. సింధుజని తెలివిగా హత్య చేయడానికి వేసిన పథకాన్ని నువ్వు ప్రభాకర్‌కి చెప్పేవు. మునుపటిలాగే నీ కొడుకు నీకు సహాయం చేస్తాడనుకున్నావు. కానీ, ప్రభాకర్ మునుపటి మనిషి కాదు. అతనిలో పరిపూర్ణమైన మార్పు వచ్చింది. ఎవర్ని చేరదీయాలో, ఎవర్ని దూరం చేస్కోవాలో ఆలోచించే విచక్షణాజ్ఞానం వచ్చింది. అందుకే, నువ్వు కన్నతండ్రివని కూడా ఆలోచించకుండా ప్రభాకరే పోలీసు కంప్లయింట్ యిచ్చేడు''

మట్టయ్య ఆమె మాటలు నమ్మలేనట్టుగా ప్రభాకర్‌వైపు చూశాడు. ప్రభాకర్ ఎటువంటి బాధ వ్యక్తంచేయకుండా, ఓ మంచిపని చేశానన్న ఆత్మవిశ్వాసం ప్రదర్శిస్తూ, ''ఔను నాన్నా! చిన్నప్పట్నించీ నీ అడుగుజాడల్లో, నీ మాట మీదే నడుచుకున్నాను. మా అమ్మని ఎన్నోసార్లు తిట్టినా, కొట్టినా నేను నోరు మెదపలేదు. ఒక్కసారీ అడ్డుకోలేదు. బహుశా, భార్యని భర్త యిలాగే అదుపుచేయాలేమో అని కూడా అనుకున్నాను. నీ ట్రైనింగ్‌లో నేను అవకాశవాదిగా తయారయ్యేను. ప్రేమించి, పెళ్ళిచేసుకోబోయే సింధుజ జీవితంతో చెలగాటాలాడేను. వ్యభిచారిగా ముద్రవేయడంలో నీకు సహకరించేను. అయినా సింధుజ నన్ను పెళ్ళిచేసుకుంది. పెళ్ళైంతర్వాత ఆమె నన్ను ద్వేషిస్తుందని, వేధిస్తుందని, నా తప్పులు ఎత్తి చూపి, నన్ను దెప్పిపొడుస్తుందనీ అనుకున్నాను. నీ పెంపకంలో పెరిగిన నా సంస్కారం అంతవరకే ఆలోచించింది. కానీ, నా భయాలకి భిన్నంగా, నా వూహలకి విరుద్ధంగా సింధుజ నన్ను మునుపటిలాగే ప్రేమించసాగింది. నా కన్నతల్లికి నేను అందించలేని అభిమానాన్ని కోడలిగా ఆమె అందించింది. తల్లిగా ఆమెను గౌరవించింది. ఆమె తరపున ఎదిరించింది. ఇవన్నీ చూశాక నాలో నువ్వు ప్రాణంపోసి పెంచుతున్న అవకాశవాది, దుర్మార్గుడు నన్ను విడచి వెళ్ళిపోయేరు. నేను యిప్పుడు వుత్తముడిగా మారిపోయేనని చెప్పను. కానీ నాలోని నీచుడుమాత్రం శవంగా మారేడని చెప్పగలను. పరిపూర్ణ ప్రేమస్వరూపంగా కనిపించే సింధుజముందు నిలబడే అర్హత నాకు లేదని గ్రహించాను. ఆ యోగ్యత సంపాదించాలని తపించేను. అలాంటి సమయంలోనే, నువ్వు సింధుజని హత్యచేసే ప్లాన్ చెప్పేవు. తొలిసారిగా నీమీద ద్వేషం కలిగింది. నువ్వు నా తండ్రిగా కాకుండా హంతకుడిగానే కనపించేవు. నీ మార్గమే మంచిదని నేను యింకా నమ్మితే, రేపు నా పిల్లలకీ నేను యిదే నేర్పించాలి, ఈ మార్గాన్నే నడిపించాలి. కానీ అది నాకు యిష్టంలేదు. నీకు మంచి చెప్పి మార్పించాలనుకున్నాను. నీ హత్యాప్రయత్నాన్ని ఆపుచెయ్యాలనుకున్నాను. కానీ అందుకు నా శక్తి చాలదని తెలుసు. అందుకే నీకు బదులుచెప్పలేదు. చెప్పడంవల్ల నువ్వు మారకపోగా పథకాన్ని మరోలా మార్చి, నాక్కూడా తెలియకుండా మరోవిధంగా ఈ మారణకాండని జరిపిస్తావు. అప్పుడు నేను సింధుజని రక్షించుకునే అవకాశం కూడా వుండదు. యిప్పుడు నేను నీ కొడుకుగా ఆలోచించకూడదు. భార్యని రక్షించుకోవలసిన భర్తగా ఆలోచించాలి. అందుకే మధులత ఆంటీకి చెప్పి మరీ పోలీస్ కంప్లయింట్ యిచ్చేను'' అన్నాడు.

మట్టయ్యకి యిదంతా అయోమయంగా వుంది. కని, యిరవై ఎనిమిదేళ్ళు పెంచిన తండ్రికంటే నిన్నగాక మొన్న వాడి జీవితంలో కొచ్చిన సింధుజ, ఆమె తరపున పనిచేసిన మధులతల ప్రభావమే తన కొడుకుమీద పనిచేసింది. ఈరోజుతో తనకి శని విరగడైపోతుందనుకున్నాడుగాని, సరిగ్గా ఈరోజునించే శని తనని పట్టుకుంటాడని వూహించలేకపోయేడు. మధులత మళ్ళీ చెప్పనారంభించింది.

''నీ పథకం సంగతి మాకేకాదు, సింధుజకీ తెలుసు. నీ ఆట కట్టించడానికి ఏమీ తెలియనట్టుగానే తనూ నటించింది. నువ్వు ఎక్కడున్నావో తెలుసుకుని రోడ్డుకి ఆవైపు నేను, ఈవైపు పోలీసులు. గంటనించి వెయిట్‌చేస్తున్నాం. నిన్ను రెడ్‌హేండెడ్‌గా పట్టుకోవాలనే

యస్పీ ఉషారాణిగారు ఈ పథకం వేశారు. ఓ అమాయకురాలిమీద కళంకం మోపినప్పుడే నిన్ను అరెస్టు చేసి జైలుకి పంపాల్సింది. కానీ మేం సాధించాల్సింది కక్షకాదు, నీలో పరివర్తన కలిగించాలని నిన్ను క్షమించేం. కానీ నీలో మార్పు రాలేదు. జరిగినదాంతో నీలోని మానవత్వం మెరుగుపడవలసిందిపోయి, నీలోని రాక్షసుడు మరింత బలపడ్డాడు. అయితే ఏ భవిష్యత్తూ లేని నీలాంటివాళ్ళు మారకపోయినా, ఎంతో భవిష్యత్తున్న ప్రభాకర్‌లో మేం ఆశించిన మార్పు వచ్చింది. అతనికిప్పుడు భార్య కావాలిగాని, అనుక్షణం దుర్మార్గాలు బోధించే నీలాంటి తండ్రి కాదు. నీ అరెస్టుతో నేనొచ్చిన పని నూటికి నూరొంతులు నెరవేరినట్టే'' అంటూ ఆ తర్వాత కర్తవ్యం మీదేనన్నట్టుగా ఆమె యస్పీవైపు చూసింది. ఇనస్పెక్టరు మట్టయ్యకి, రౌడీలకి బేడీలు వేశారు. నన్ను క్షమించండి అని మట్టయ్య అందామనుకున్నాడుగాని అనలేదు. యింత పకడ్బందీగా ప్లాన్ వేసి, తన మనస్తత్వాన్ని స్కానింగ్‌చేసి చూసినట్టుగా వాళ్ళు చూసేశాక తనని ఎంతమాత్రం క్షమించరని తెలుసు. రేపు కోర్టులో లాయర్ని పెట్టి వాదించినా లాభంలేదు. ఎందుకంటే తన కొడుకే తనని అరెస్టు చేయించినప్పుడు కోర్టుమాత్రం ఎందుకు వదిలిపెడుతుంది? అంచేత ఎటువంటి క్షమాపణలు చెప్పకుండా జెయిలుకు వెళ్ళిపోవడం మినహా మార్గం లేదనుకుంటూనే పోలీస్ జీపు ఎక్కాడు. యస్పీ ఉషారాణి మధులతని అభినందిస్తూ, "మీలాంటి ఆంటీలు వూరికి ఒక్కరున్నా యిలాంటి చీడపురుగుల్ని ఏరిపారెయ్యవచ్చు. మీరు ఈ ఊరికి ఎందుకు షిఫ్ట్ అవకూడదు?'' అంది.

"నేకాకపోయినా నాలాంటి మనిషి మరొకరు ఈ వూళ్ళోనే వుంటుందిలెండి?'' అంది మధులత, ఆ మనిషి సింధుజే అన్నట్టుగా ఆమె వైపు చూస్తూ.

★ ★ ★

మట్టయ్యని అరెస్టు చేసినందుకు అన్నపూర్ణ కించిత్తుగూడా బాధపడలేదు. కంటతడి పెట్టలేదు. మధులత దగ్గరకొచ్చి "జరిగిందానికి నేను బాధపడ్డం లేదమ్మా! నరకాసురుడు చనిపోయినందుకు సంతోషపడుతూ దీపావళి పండగ చేసుకుంటున్నాం. పదిమందికీ హాని కలిగించేవాడు అంతమయితే, అతని భార్యా బిడ్డలు తప్ప అందరూ ఆనందిస్తారు. పండగ చేసుకుంటారు. కానీ మా ఆయన విషయంలో నాకొడుకే అతన్ని అరెస్టు చేయించాడు. నేను ఇప్పుడు బాధపడితే వాడు చేసింది తప్పుపని అయినట్టుకదా! అందుకే వాడి మంచిపనిని నేనూ అంగీకరిస్తున్నాను. ఇకమీదట నేను మట్టయ్య భార్యనని చెప్పుకోను. ప్రభాకరానికి తల్లినని చెప్పుకుంటాను. సింధుజకి తల్లిలాంటి అత్తనని చెప్పుకుంటాను'' అంది. ఆమె గత ముప్పై ఏళ్ళుగా మట్టయ్యవల్ల అనుభవించిన హింస ఎంతటిదో ఆమె నోట్లోనించి వచ్చిన ప్రతీ అక్షరం సాక్ష్యం చెప్తున్నట్టుగా వినిపించింది మధులతకి.

★ ★ ★

మధులత ఆ రోజు గుంటూరుకు ప్రయాణమవుతోంది.

గెస్టుహౌసుకి ఆ రోజు సింధుజ, ప్రభాకర్, చంద్రమౌళి, రుక్మిణి, భానుమూర్తి, సుజాత అందరూ వచ్చేరు. గుంటూరు తన కారులోనే వెళ్లమని కేశవవర్మగారు ఓ ఏసీ కారు పంపించారు. అందరూ హడావిడిగా ఆ కారులో సామాన్లు సర్దుతున్నారు. సింధుజకి తప్ప మిగిలిన వారందరికీ మధులతతో కొన్ని రోజుల పరిచయమే అయినా, ఆమె వెళ్లిపోవడం అందరికీ బాధగానే వుంది. సింధుజ అయితే వుదయంనించి ఏడుస్తూనే వుంది. మొసలి నోట చిక్కిన గజేంద్రుడి మొర విని విష్ణుమూర్తి వచ్చి ఆదుకున్న విషయం భాగవతంలో చదివింది, కానీ తన విషయంలో మధులత దేవతలాగే వచ్చి ఆదుకుంది. ఇప్పుడామె వెళ్లిపోతుందనేసరికి సింధుజ తట్టుకోలేకపోతోంది. కాంపౌండులోని ఓ కారు వచ్చి ఆగింది. ఎవరా అని అందరూ ఆశ్చర్యంగా చూశారు. కారులోనించి జడ్జి రంగనాథరావు దిగేడు. అతనెందుకొచ్చేడో ఎవరికీ అర్థం కాకపోయినా, అందరూ మౌనంగా నమస్కరించారు. వారిని మౌనంగానే పలకరించి మధులత రూమ్‌లోకి నడిచాడు.

అద్దం చూస్తూ బొట్టు పెట్టుకుంటున్న మధు





లత అద్దంలో కనిపించిన రంగనాధరావుని చూసి, చిన్నగా నవ్వుతూ వెనుదిరిగింది.

"నాకు సెండాఫ్ ఇవ్వడానికి మీరూ వచ్చేరే" అంది.

"నేనొచ్చింది నీకు మరోసారి సెండాఫ్ ఇవ్వడానిక్కాదు. నిన్ను నా జీవితంలోకి ఆహ్వానించడానికి" ఎంతో సిన్సియర్‌గా చెప్పి, సోఫాలో కూర్చున్నాడు.

అతని ఆహ్వానమేమిటో మధులతకి అర్థం కాలేదు. అసలు వారి సంభాషణేమిటో గుమ్మం దగ్గర నిలబడ్డ వారెవరికీ అర్థం కాలేదు.

"ఆరోజు ఇక్కడకొచ్చినా సింధుజ రావడంవలన నేనొచ్చిన పనేమిటో చెప్పకుండానే వెళ్లాల్సొచ్చింది. కానీ ఇప్పుడు నువ్వు వెళ్లిపోతున్నావని తెలిసి వచ్చేను" అంటూ ఓసారి గుమ్మం దగ్గర నిలబడ్డ వాళ్ల వైపు చూశాడు. వారు కాస్సేపు దూరంగా వెళ్తే బావుణ్ణనుకున్నాడుగాని, ఆ మాట చెప్పలేకపోయేడు. మధులతయినా వాళ్లని వెళ్లమంటుందనుకున్నాడుగాని, ఆమె చెప్పలేదు.

"చెప్పండి" అంది.

"నా భార్య మూడేళ్ల కిందట చనిపోయింది"

మధులత ముఖంలో ఎటువంటి మార్పు కనిపించలేదు. ఎందుకంటే జడ్జిగారి భార్యపోయిన విషయం ఏదో మాటల సందర్భంలో కేశవవర్మగారు ఆమెకు చెప్పేరు.

"మనం విడిపోయింతర్వాత నువ్వు ఎక్కడున్నదీ నాకు తెలియదు. సింధుజ కేసు విషయంలో నువ్వు కోర్టులో కనిపించినప్పుడే మళ్లీ నిన్ను చూశాను. నిన్ను నా జీవితంలోకి ఆహ్వానించాలని అప్పుడే నిర్ణయించుకున్నాను" ఎన్నో కేసులకి తీర్పు చెప్పిన జడ్జీగారు తన నిర్ణయాన్నిగూడా మధులత జీవితం విషయంలో ఇచ్చేతీర్పులాగే చెప్పేడు.

మధులత ఆంటీ ఒకప్పుడు ఈ జడ్జీగారి భార్యనే విషయం అక్కడవున్న వారందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఆమెను చిన్నప్పట్నించి ఎరిగిన సింధుజకీ ఆ విషయం తెలియదు. తను ఎప్పుడూ ఆమె భర్త విషయం అడగలేదు. ఆమె ఎప్పుడూ చెప్పలేదు. ఆంటీ ఏం చెప్తుందాని అందరూ ఆసక్తిగా చూశారు.

"మీ భార్య చనిపోయిందని నాకు తెలుసు. ఆ విషయమే కాదు, నన్ను వదిలించుకోడానికి నాకు సంతాన యోగం లేదని మీరు ఆనాడు డాక్టరుకి డబ్బిచ్చి అబద్ధం చెప్పించిన విషయమూ తెలుసు. కానీ ఆ రోజు మీరు నానించి రాబోయే డబ్బునే తప్ప నన్ను ప్రేమించడం లేదని తెలిశాక, నేను మీ అభిప్రాయాన్ని గ్రహించి మీ జీవితంలోనించి వెళ్లిపోయేను. కానీ ఇప్పుడు మీరు నన్ను ఖాళీ అయిపోయిన మీ భార్య స్థానంలోకి ఆహ్వానిస్తున్నారు. బట్.. అయామ్‌సారీ, ఈ ఆహ్వానాన్ని మన్నించలేనందుకు మన్నించండి.

లైట్లు ఆరిపోయినప్పుడు కొవ్వొత్తులు వెలిగిస్తాం. ఆ చిన్న కాంతితోనే గడిపేస్తాం. కానీ మళ్లీ లైట్లు వెలిగాక, ఆ కొవ్వొత్తిని ఆర్పేస్తాం. మళ్లీ ఎప్పుడైనా లైట్లు పోయేవరకూ దాని సంగతే పట్టించుకోం. మీరు నన్ను అలాంటి కొవ్వొత్తిగానే భావించి ఆహ్వానిస్తున్నారనుకుంటాను. కానీ నేనిప్పుడు కొవ్వొత్తిని కాదు. నేను పదిమందికీ వెలుగు చూపించే వీధిదీపంగా ఏనాడో మారిపోయేను. అంటూ గుమ్మం దగ్గర వున్న వారందర్నీ చూపించి ఆనాడు నాకు పిల్లలు పుట్టరన్న ఒకే ఒక్క కారణంగా నన్ను మీ జీవితంనించి తొలగించేరు. కానీ ఈనాడు చూసేరా, నాకు ఎంతమంది పిల్లలున్నారో! వీళ్లందరూ నా పిల్లలేనండి. నా జీవితంలో మూడు వంతులు గడిచిపోయింది. మిగిలిన జీవితంలో ఇంకా ఇలాంటి బిడ్డలు ఎంతమంది పుట్టుకొస్తారో! నన్ను ఇంత మట్టి చెయ్యడానికీ పిల్లలు చాలు. నేను మీ భార్యగా వుంటే కేవలం మీకు సేవ చేయడానికి మాత్రమే ఉపయోగపడతాను. కానీ నేనుగా వుంటే ఇలాంటి దారి తప్పి నడుస్తున్న ఎంతో మంది పిల్లలకి మంచిదారి చూపించే ఆంటీగా మిగిలిపోతాను. ఈ జన్మకా అదృష్టం చాలు. నన్ను ఇలాగే వెళ్లిపోనివ్వండి"

మధులత అలా చెప్తుంటే అక్కడున్న వారందరి కళ్లల్లోను నీళ్లు తిరిగేయి. సింధుజ "ఆంటీ"అంటూ వచ్చి ఆమెను కౌగలించుకుని బావురుమంటూ ఏడ్చేసింది. ఆమె భుజం తడుతూ "నువ్వు ఏడవకూడదు సింధూ... ఏడ్చేవారిని వూరడించడానికి, వాళ్లకి న్యాయం చెయ్యడానికే ఇక మీదట నువ్వు కృషి చెయ్యాలి. అప్పుడే ఈ ఆంటీ సంతోషిస్తుంది" అంటూ కారు దగ్గరకి నడిచింది. అందరూ ఆమెను అనుసరించారు.

"మళ్లీ ఎప్పుడొస్తారు మేడమ్" అని ప్రభాకర్ అడిగాడు.

"ఈసారి నేను మీ దగ్గరకి లాయర్‌గాను, మీ ఆంటీగానూ కూడా రాను. మీరు కనబోయే బిడ్డకి అమ్మమ్మగానే వస్తాను. మీరు బారసాలకి ఎప్పుడు పిలుస్తారనేది మీరే నిర్ణయించాలి" అంటూ అందరి వైపు చూసి "విష్ యు ఆల్ ద బెస్ట్" అంటూ గాలిలో చెయ్యి వూపుతూ కారులో కూర్చుంది.

రంగనాధరావుతో సహా అందరూ సజలనయనాలతో ఆమెకు వీడ్కోలు చెప్తూ గాలిలో చేతులూపుతుంటే రయ్యి మంటూ కారు ముందుకు దూసుకుపోయింది.







## చతుర ఫీచర్

# చేదు నిజాలు

## అడ్డుతెర

ఆరోజు అక్టోబర్ 25 1991. బైరాగఢ్ ప్రాంతంలోని సింధూటాకీస్ దగ్గర గస్తీలో వున్నాడు, హెడ్‌కానిస్టేబుల్ మాన్‌సింహ్ భాటీ. కిటకిటలాడుతున్న క్యూలో నిలుచున్న వాళ్ళను పరీక్షగా చూస్తున్న మాన్‌సింహ్ దృష్టి ఓ యువకుడిపై నిలిచింది. అప్పుడే అతన్ని గమనించిన ఆ యువకుడు హఠాత్తుగా క్యూ నుండి విడిపోయి పరుగు లంకించుకున్నాడు. అతని వెంటపడిన మాన్‌సింహ్, అతికష్టంమీద చేజిక్కించుకున్నాడు. నన్ను చూడగానే ఎందుకు పారిపోతున్నావ్, ఏంటి సంగతీ- అని ప్రశ్నించాడు. తాను అతన్ని చూసి పారిపోవటంలేదనీ, టికెట్ కోసం జేబులో చేయిపెట్టగా డబ్బుల్లేని ఖాళీ జేబు తగిలిందనీ, సినిమా ప్రారంభం కావటానికి చాలా కొద్దిసమయం వుండటంతో తొందరగా ఇంటికెళ్లి డబ్బు తెచ్చుకోవాలని పరిగెడుతున్నానే తప్ప, మరేమీ లేదనీ బదులిచ్చాడు ఆ యువకుడు. ఈ సమాధానం మాన్‌సింహ్ పోలీసు బుర్రకు రుచించలేదు. అతన్ని ఎక్కడో చూపినట్టు అనిపిస్తూంది కానీ, ఎక్కడ చూసిందీ గుర్తు రావటంలేదు.

మళ్లీ పోలీస్ అధికారం గొంతులో ఉట్టిపడుతుండగా ప్రశ్నించాడు-

''నీ పేరేంటి?''

''కిషోర్''

''అమ్మయ్య, నిన్నెక్కడ చూశానో ఇప్పుడు అర్థమయింది. పోలీస్ స్టేషన్‌లో నీ ఫొటో చూశాను. పద, స్టేషన్‌కి''

''స్టేషన్‌కా? కానీ నేనేం నేరం చేశాను సార్?''

''కిషోర్, ఇంకా అమాయకత్వం నటించకు. నువ్వు హత్య చేశావని నాకు తెలుసు. మర్యాదగా స్టేషన్‌కి పద''

కాసేపు వాదనల తరవాత గత్యంతరం లేదని గ్రహించి, మాన్‌సింహ్ వెంట నడిచాడు కిషోర్.

★ ★ ★

భోపాల్ నివాసి శివనారాయణ్ బైరాగి మూడో కూతురు ఛాయ. ఛాయ పెళ్ళీడుకు రాగానే ఆమె పెళ్ళి కూడా జరిపిస్తే తన బాధ్యత తీరుతుందనే ఆరాటంతో వరుడి వేటలో వడ్డాడు శివనారాయణ్ బైరాగి. అప్పుడు జ్యోతికాంత్ అనే యువకుడి గురించి తెలిసిందతనికి. భోపాల్‌లోనే తిరానారోడ్, సుల్తానియా వీధిలోని నంబర్ 101వ ఇంట్లో వుంటున్న జ్యోతికాంత్‌కు స్థిరమైన ఉద్యోగమేదీ లేకపోయినా, ఒకసారి పెళ్ళయి బాధ్యతలు పైనపడితే అతనే కుదురుకుంటాడనే అభిప్రాయంతో ఆ సంబంధం ఖాయం చేసుకున్నాడు శివనారాయణ్ బైరాగి. జ్యోతికాంత్‌తో ఛాయ వివాహం 1980వ సంవత్సరంలో జరిగింది.

జ్యోతికాంత్‌తో కాపురం ఛాయకు మొదట్లో బాగానే వుంది. కానీ అతనికి ఏ ఉద్యోగమూ లేకపోవటంతో రానురానూ ఇల్లు గడవటం కూడా దుర్లభమైన పరిస్థితి వచ్చింది. దాంతో తమ సంసారం విషయం భర్తతో చర్చించింది ఛాయ. తామిద్దరికే కష్టంగా వుంటే కొద్దిరోజులకు పిల్లలకు పిల్లలు పుట్టుకొచ్చారంటే, రోడ్డుపైకెక్కాల్సిన గతి వస్తుందనీ, ఏదో ఒక ఉద్యోగం చూసుకొమని, స్థిరపడమనీ భార్య చెప్పిన మాటలు జ్యోతికాంత్‌కు కూడా నిజమేననిపించాయి. ఉద్యోగం దొరకటం కష్టమే అయినప్పటికీ, తొందరలోనే కుదురైన ఉద్యోగం చూసుకునే ప్రయత్నం చేస్తాననీ

ఛాయకు మృదువుగా చెప్పి, ఆమెను కుదుటపరచాడు. కానీ నెలరోజులు గడిచినా ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. అతనికి మనస్తాపం పట్టుకుంది. ఉద్యోగం దొరకకపోవటమేకాక ఇంట్లో పరిస్థితి కటకటగా వుంది. ఈ ఉద్యోగవేటలో స్నేహితుల చుట్టూ తిరగటంలో చెడుసహవాసాలు ఏర్పడ్డాయి. తాగుబోతులూ, జూదగాళ్ళతో స్నేహాలు పెంచుకున్నాడు. ఎక్కడా ఉద్యోగం దొరకకపోవటంతో, రైల్వేస్టేషన్ దగ్గర వచ్చిపోయే యాత్రికులను జూదంలోకి దింపి,



మూడుముక్కల కాయ్‌రాజాకాయ్ ఆడటం మొదలెట్టాడు జ్యోతికాంత్. అది ప్రారంభం మాత్రమే.

పెళ్ళయిన ఆరేళ్ళకల్లా నలుగురు పిల్లలు పుట్టుకొచ్చారు వాళ్లకు. మొదట్లో ఇంటి ఖర్చులకు డబ్బులిచ్చేవాడు జ్యోతికాంత్. కానీ పిల్లలు పుడుతూ, వాళ్ళు పెరుగుతూ వాళ్ళ అవసరాలతోపాటు ఇంటిఖర్చు పెరుగుతూపోయినకొద్దీ ఇంటిని పట్టించుకోవటం మానేశాడు. పొద్దున్న ఇంట్లోంచి బయలుదేరితే అర్ధరాత్రిలోగా ఇంటికొచ్చే అలవాటే లేదు. క్రమంగా అప్పుడప్పుడూ ఇంటికి రాకుండా బైటనే గడపటం ప్రాంభించాడు. రాన్రానూ యిల్లు గడవటం కష్టమైపోయింది ఛాయకు. పిల్లల చదువులటుంచి, వాళ్ళకు తిండిపెట్టటం కూడా గగనమయింది. ఆకలితో అల్లాడే పిల్లలను ఓదార్చలేని అశక్తతో, అడపాదడపా ఇంటికొచ్చే జ్యోతికాంత్‌తో వచ్చీ రాగానే ఘర్షణ పడటం, అతని చేతిలో దెబ్బలు తినటం నిత్యకృత్యంగా మారింది. రానురానూ వీళ్ల పోట్లాటలు చుట్టుపక్కలవాళ్ళకు తలనెప్పిగానూ, ఛాయకు తలవంపులుగానూ తయారయ్యాయి. వాళ్ళ పొరుగునుండే రతన్‌జీ అనే ఆయన ఓరోజు ఛాయను కూచోబెట్టుకుని అనునయించాడు-

"పోట్లాటలవల్ల లాభంలేదమ్మా. అసలు దీనికి కారణం డబ్బు లేకపోవటమే. నేను మీకో మార్గం చూపిస్తాను. ఏదో ఓ బ్యాంకులో అప్పు తీసుకుని ఒక టాక్సీ కొనుక్కోండి. డ్రైవర్‌కు కూడా పెద్ద జీతం ఇవ్వాల్సిన అవసరం వుండదు. ఖర్చులూ, బ్యాంకు వాయిదాపోను కొద్దోగొప్పో డబ్బు మిగులుతుంది. కొన్నాళ్ళకు టాక్సీ సొంతమవుతుంది. ఇంట్లో ఆదాయమార్గమంటూ ఒకటుంటే పోట్లాటలు అవే తగ్గుతాయి"

రతన్‌జీ మాటలు ఛాయతోపాటు జ్యోతికాంత్‌కు కూడా నచ్చాయి. భార్యాభర్తలిద్దరూ ఏవో తంటాలుపడి, బ్యాంక్ ఆఫ్ ఇండియా




వారి సహకారంతో ఓ టాక్సీ కొనుక్కున్నారు. ఓ డ్రైవర్‌ను కూడా పెట్టుకున్నారు. టాక్సీ నడవటం ప్రారంభించగానే ఇల్లు హాయిగా గడవసాగింది.

టాక్సీ రాకతో డబ్బు సమస్యలు ఒకరకంగా తీరిపోయి, మరోరకంగా మొదలయ్యాయి. రోజూ ఖచ్చితంగా సాయంత్రంపూట వచ్చి, ఛాయ దగ్గర ఎంతో కొంతసొమ్ము తీసుకుపోవటం మొదలెట్టాడు జ్యోతికాంత్. జూదంలాంటి చట్టవిరుద్ధమైన కార్యకలాపాల్లో పాల్గొంటున్న నేరంమీద అప్పుడప్పుడు పోలీసులు అతన్ని అరెస్ట్ చేయటం, కొన్నిసార్లు జైలుకు పంపటం కూడా సాధారణమైపోయింది. దీంతో విసిగిపోయిన ఛాయ తన మార్గం మార్చుకుని ఇంటినీ, సంసారాన్నీ పట్టించుకోనట్టయితే, ఏకంగా వదిలేసుకోమని భర్తనే హెచ్చరించింది. కానీ లాభం లేకపోయింది. జ్యోతికాంత్ ధోరణి మారలేదు. అతనితోపాటు డ్రైవర్లు కూడా ఒక సమస్యయ్యారు ఛాయకు. రిపేర్ల పేరుతో తరచూ డబ్బు స్వాహాచేసే డ్రైవర్లతో వేగలేక వాళ్ళను తరచుగా మార్చవలసివచ్చేది. కొత్త డ్రైవర్ రాగానే మళ్ళీ మొదలయ్యే కథతో విసిగిపోయింది ఛాయ. ఓ నమ్మకస్తుడైన డ్రైవర్ దొరికితే బావుండుననుకుంటూ అలాంటి వాడికోసం అన్వేషిస్తున్న ఛాయకు కిషోర్ ఎదురయ్యాడు.

కిషోర్ మరొకరి టాక్సీ నడుపుతున్నాడు. అతను మంచివాడని వింది ఛాయ. అయితే తొందరలోనే కిషోర్‌కూ, అతని యజమానికీ వ్యవహారం చెడింది. ఓరోజు ఛాయ దగ్గరకొచ్చాడు కిషోర్. జరిగిందంతా చెప్పి,

"వదినా, ఇక నన్ను నువ్వు ఉంచుకోక తప్పదు" అన్నాడు నవ్వుతూ.

అతని మాటల్లోని శ్లేష అర్థం చేసుకున్న ఛాయ కూడా,

"అబ్బో మాటలు చాలా జోరుగా వున్నాయే. నాక్కూడా నీలాంటి డ్రైవర్ అవసరమే వుంది" అని బదులిచ్చింది.

ఛాయ దగ్గర డ్రైవర్‌గా చేరిపోయాడు కిషోర్. తొందరలోనే మంచి డ్రైవర్‌గా ఆమె అభిమానం సంపాదించుకున్నాడు కిషోర్. ఛాయ వయసు 29 సంవత్సరాలు. ఆమె నలుగురు పిల్లల తల్లి. అయినా ఆమె అందం చెక్కుచెదరలేదు. మరీ, కిషోర్ కళ్లకు ఆమె తనకు ఈడు జోడులాగా కనిపించసాగింది. ఆమెను మాటలతో కవ్వించసాగాడు. ఛాయ కూడా మంచి యవ్వనంలో వుంది. ఆర్థికపరమైన కష్టాలు తొలగిపోయాయి. ఇక ఆమెకు తక్కువైనదల్లా భర్త ఆదరణ మాత్రమే. ఇలాంటి పరిస్థితుల్లో ఓరోజు ఎప్పటికన్నా తొందరగా టాక్సీ కట్టేశాడు. ఆరోజు అతని మాటలకు అనువైనరీతిలో, అనుకూలమైన జవాబులిచ్చి, అతనిలోని భయసందేహాలను పోగొట్టింది. అప్పటికీ, మాటలుదాటి ముందుకు సాగని కిషోర్‌ను తనే ప్రేరేపించి ప్రోత్సహించింది. ఆరోజు తొలిసారిగా చాలా రోజులుగా భర్త దగ్గర పొందలేని సుఖంతోపాటు, ప్రశాంతతనూ, తనకో తోడున్నాడన్న నిశ్చింతనూ పొందింది ఛాయ. కిషోర్ లేకుండా జీవించలేననుకునేంతగా అతనిపట్ల ఆకర్షితురాలయింది. ఆ తరవాత వీలుదొరికినప్పుడల్లా ఛాయ, కిషోర్‌లు ఇంట్లోనే కలవసాగారు. క్రమంగా వీళ్ల వ్యవహారం ఇరుగుపొరుగుకు అనుమానం కలిగించనారంభించింది. ఆ గుసగుసలు జ్యోతికాంత్ చెవిని చేరుకున్నాయి కూడా. దాంతో టాక్సీ వ్యవహారాలన్నీ తనే స్వయంగా చూసుకుంటాననీ, కిషోర్‌తో ఛాయ మాట్లాడను కూడా కూడదనీ ఆమెను హెచ్చరించాడు జ్యోతికాంత్. 'టాక్సీ డబ్బులన్నీ నీ చేతిలో పోస్తే ఏమవుతుందో నాకు తెలుసు'నని బదిలిచ్చింది ఛాయ. క్రమంగా వాదనలు పెరిగి, దెబ్బలాటలోకి దిగటంతో ఇరుగు, పొరుగూ వచ్చి విడదీశారు. కోపంతో బుసలు కొడుతూ వెళ్ళిపోయాడు జ్యోతికాంత్. అతన్ని శాపనార్థాలు పెడుతూవుండిపోయింది ఛాయ.

ఇది జరిగిన తరవాత ఛాయ, కిషోర్‌లు కలుసుకోవటం ఆగిపోయింది. ఓరోజు చుట్టుపక్కల ఎవరూ లేకపోవటంతో ఛాయను ఆరాతీశాడు కిషోర్. ఛాయతో తనకు అక్రమ సంబంధం వున్నప్పటికీ ఆమెను 'వదినా' అనీ, జ్యోతికాంత్‌ను 'అన్నయ్యా' అనీ మర్యాదగానే పిలుస్తాడు కిషోర్. ఆరోజూ అలాగే మర్యాదగానే అడిగాడు-

"ఏమైంది వదినా? ఈమధ్య అదోలా

వుంటున్నావు. అన్నయ్యా మళ్లీ నీకేమైనా చికాకు కలిగించాడా ఏంటి?''

''అవును కిషోర్. దీనికి పరిష్కారం చూడాలి'' అంటూ, అతినెమ్మదిగా అతనితో ఏదో మాట్లాడింది ఛాయ.

అలా రహస్యంగా మాట్లాడుకుంటూ ఇద్దరూ లోపలికెళ్లారు. గదిలో కూర్చుని గుసగుసలుగా మాట్లాడుకోసాగారు. తలుపులు దగ్గరగా వేసి మాట్లాడుకుంటూ వుండిపోయారు. మాటల తరవాత ఇద్దరికీ ఏకాంతం గుర్తొచ్చింది. చాలారోజుల ఎడబాటులో వున్న ఇద్దరూ పరిసరాలు మరిచిపోయి ఒకటయ్యారు. హఠాత్తుగా గొళ్ళెంవేయని తలుపు తెరుచుకుంది. జ్యోతికాంత్ గదిలో ప్రత్యక్షమయ్యాడు. కిషోర్ ఒళ్ళో వున్న ఛాయను చూడగానే అతనికి కాసేపు ఏంచేయాలో పాలుపోలేదు. నిజానికి వాళ్ళిద్దరినీ అలా పట్టుకోవాలనే చాలా రోజుల్నుంచీ కాపువేసి చూస్తున్నాడు జ్యోతికాంత్. కానీ కళ్ళారా చూసి అచేతనుడయ్యాడు. అతను తేరుకునేలోగా కిషోర్ అక్కణ్ణించి వెళ్లిపోయాడు. ఎదురుగా వున్న భార్యను చితకబాదనారంభించాడు జ్యోతికాంత్. ఛాయ అరుపులువిని వచ్చిన ఇరుగుపొరుగువాళ్ళు వాళ్ళను విడదీశారు. ఇద్దరూ పరస్పర వ్యతిరేకంగా పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదులు చేశారు. పోలీసులు భారత విచారణా స్మృతి సెక్షన్ 151 కింద ఇద్దరినీ చాలాన్ చేసి జెయిల్‌కు పంపారు. వారంరోజుల తరవాత ఇద్దరూ బైటికొచ్చారు. కానీ జ్యోతికాంత్ తన ఇంటికి వెళ్లగా, ఛాయ కిషోర్ ఇంటికెళ్ళింది. ఆ రోజునుండి కిషోర్‌తోనే వుండసాగింది ఛాయ.

కిషోర్ అవివాహితుడు. ఛాయ రాకతో ఇల్లు హాయిగా గడవనారంభించింది. దాంతో అతనికి ఛాయపట్ల మరింత అనురాగం ఏర్పడింది. భోపాల్‌లోని కుటుంబకోర్టులో జ్యోతికాంత్, ఛాయలు ఇద్దరూ ఒకరిపై మరొకరు చేసుకున్న విచారణ ప్రారంభం కావటంతో, ఆ కేసులో ఛాయకు న్యాయం జరిపించడానికి పైరవీప్రయత్నాలు కూడా చేశాడు కిషోర్.

ఆరోజు 1991వ సంవత్సరం అక్టోబర్ 19వ తేదీ. రాత్రి పడుకోకుండా అశాంతితో కూర్చున్న ఛాయను విషయం ఆరాతీశాడు కిషోర్-

''ఏమైంది ఛాయా? ఒంట్లో బాగాలేదా?''

''ఒంట్లో బాగానే వుంది, కానీ...''

''కానీ?''

''కానీ...'' కాసేపు తటపటాయించి అడిగింది ఛాయ- ''నీకు నిజంగా నామీద ప్రేమ వుందా కిషోర్?''

''దాంట్లో అనుమానం ఎందుకు? నేనేమైనా నిన్ను నొప్పించానా ఛాయా?'' నొచ్చుకుని అడిగాడు కిషోర్.

''లేదు కిషోర్, నీమీద నాకు నమ్మకముంది. కానీ మనం ఇలా ఎంతకాలం వుండగలం చెప్పు. మనిద్దరికీ ఒకరిపైన ఒకరికి ఎంత ప్రేమ వున్నా మనది అక్రమ సంబంధమనే అంటుంది లోకం. అలాగని, మనిద్దరం పెళ్ళి చేసుకోవాలంటే ఆ నీచుడు బతికున్నంత కాలం వీలుకాదు...''

''అంటే... జ్యోతికాంత్...?''

''.... .... ....''

''.... .... ....''

★ ★ ★

తెల్లవారింది. ఆరోజు 20వ తేదీ. పొద్దున్న 9 గంటలు కావస్తోంది. పిల్లలంతా ఇంట్లోనే వున్నారు. పొరుగున వున్న రతన్‌జీ ఇంటికి వెళ్లాడు జ్యోతికాంత్. అప్పుడే ఓ టాక్సీలో ఇంటిముందు దిగారు ఛాయ, కిషోర్‌లు. భర్త ఇంట్లోలేని విషయం తెలుసుకుని, తన పెద్ద కూతురు మమతతో అతన్ని పిలిపించింది ఛాయ. కూతురు తెచ్చిన కబురుతో ఇంటికొచ్చిన జ్యోతికాంత్‌కు గుమ్మంలోనే ఎదురయ్యారు ఛాయ, కిషోర్‌లు.

''ఏంటి సంగతి? ఇవాళ నేనెందుకు గుర్తొచ్చాను నీకు?'' కిషోర్‌ని ప్రశ్నిస్తూ దగ్గరికొచ్చాడు జ్యోతికాంత్.

''ఎందుకేముంది? శత్రువుల్ని నేనెప్పుడూ మరచిపోను'' అని బదులిస్తూనే జేబులోని రాంపురి కత్తితీసి జ్యోతికాంత్ కడుపులో పొడిచాడు.

ఆ కత్తిపోటుకు విలవిల్లాడిపోయాడు జ్యోతికాంత్. అతని కేకలకు ఇరుగు పొరుగువాళ్ళు, అతని నలుగురు పిల్లలూ పరిగెత్తుకొచ్చారు. ఛాయ తమ్ముళ్ళు గోవింద్, పూనమ్‌లు అప్పటి





కే అక్కడున్నారు. కళ్ల ముందున్న దృశ్యం ఎవరికీ మనసుల్లోకి ఇంకలేదు. అప్పటికే ఛాయ, భద్రకాళిలా జ్యోతికాంత్‌పైకి విరుచుకుపడి కిషోర్ చేతిలోని కత్తి లాక్కుని, జ్యోతికాంత్‌ని తనే కసికొద్దీ పొడిచింది. ఒక్కసారి కాదు, చాలాసార్లు. 'ధర్మార్థ కామమోక్షేచ నాతిచరామి' అని ప్రమాణం చేసి పెళ్ళాడిన భర్త ధర్మార్థ కామమార్గాలలో అతిచరించాడని తన చేతులతోనే అతనికి మోక్షం కలిగించింది ఛాయ. జ్యోతికాంత్ కిందపడిపోగానే, తమ్ముడు గోవింద్‌వైపు ఓసారి చూసి, కిషోర్‌వైపు తిరిగింది.

''చచ్చింది కుక్క. పద కిషోర్'' అని బయలుదేరతీసింది.

టాక్సీ బయలుదేరిన తరువాత తేరుకున్న గోవింద్, తదితరులు దానివెంట పడ్డారు కానీ అందుకోలేకపోయారు. టాక్సీ కనుమరుగైపోయింది. జ్యోతికాంత్ చచ్చిపోయాడని తెలిసినా ఆశ చావని గోవింద్, తన తమ్ముడు పూనమ్ ఓ పొరుగాయన విష్ణుకాంత్‌ల సహాయంతో ఆటోరిక్షాలో వేసుకుని తన బావ శవాన్ని దగ్గర్లోని హమీదియా ఆసుపత్రికి తీసుకెళ్లాడు. కానీ అక్కడి డాక్టర్ అతను మరణించిన విషయాన్ని ధృవీకరించాడు. పిల్లలతోపాటు గోవింద్ కూడా జ్యోతికాంత్ శవంపైపడి భోరున ఏడ్చాడు. హమీదియా చికిత్సాలయం దగ్గర్లోనే వున్న పోలీస్‌స్టేషన్‌లో హత్య విషయం రిపోర్ట్ చేశాడు గోవింద్. ఇన్‌స్పెక్టర్ జయసిన్హ్, భారతీయ విచారణా స్మృతి సెక్షన్ 302 కింద, ఆ నేరాన్ని కేస్ నంబర్ 430/91గా నమోదు చేసుకుని, తరవాతి తతంగం జరిపించాడు.

మరుసటిరోజు, అంటే అక్టోబర్ 21, 1991న ఛాయను అరెస్ట్ చేశారు పోలీసులు. ముందుగా తనకేమీ తెలియదనీ, అసలు తన పేరు పద్మ అనీ కాసేపు వాదించిన ఛాయ, కిషోర్ లొంగిపోయాడనేసరికి గమ్మున పోలీసులకు సహకరించింది. అయితే కిషోర్ అప్పటికి అరెస్టవలేదు. ఆ తరవాత నాలుగురోజులకు హెడ్‌కానిస్టేబుల్ మాన్‌సింహ్ భాటీకి సింధూ టాకీస్‌లో చిక్కాడు. మొదట్లో తనకేమీ తెలియదన్న కిషోర్ కూడా ఛాయ దొరికిపోవడంతో నేరం ఒప్పుకుని పోలీసులకు సహకరించాడు. అతను అందించిన ఆధారంతో లాల్‌ఘాటీ ప్రాంతంలోని ఒకచోటునుండి జ్యోతికాంత్ హత్యకు ఉపయోగించిన 12 అంగుళాల రామ్‌పురి కత్తిని స్వాధీనం చేసుకున్నారు పోలీసులు.

## ప్రాణం తీసిన ప్రేమ

''ఇంప్రెస్ మహల్'' ఆవరణలోని 24వ నంబరు ఇంట్లో ఓ హత్య జరిగిందని కంట్రోల్ రూమ్ నుండి సమాచారం అందగానే సబ్‌ఇన్‌స్పెక్టర్ కామత్‌తో హుటాహుటిన హత్యాస్థలానికి చేరుకున్నాడు ఇన్‌స్పెక్టర్ జైకర్. ఆ రోజు 1971 నవంబర్ 28.

బొంబాయి సిటీకాలేజీలో బి.ఏ చదువుతున్న ఇరవయ్యేళ్ళ అచల అందమైనదీ, తెలివైనదీ కూడా. అచల తండ్రి బల్వంత్‌రావు అక్కడే ఓ పేరున్న కంపెనీలో సీనియర్ అధికారి.

జైకర్ వెళ్ళేసరికి అచల తల్లి రమాబాయి ఏడుస్తూ శవం ప్రక్కన కూర్చొని వుంది. అక్కడి వాళ్ళు చెప్పిన సమాచారాన్ని బట్టి, మధ్యాహ్నం ఒంటిగంట కావస్తుండగా రోజూలాగే రమాబాయి గుడికి బయల్దేరింది. అప్పుడే నీటుగా ముస్తాబైఉన్న అచల, ''అమ్మా! త్వరగా వస్తావ్‌గా? నేను మ్యాటినీ షోకి వెళ్ళాలి'' అంది.

రమాబాయి పావుతక్కువ రెండుగంటలకల్లా ఇంటికి తిరిగొచ్చింది. కాని, ఎన్నిసార్లు బెల్లు నొక్కినా అచల తలుపు తెరవలేదు. విసిగిపోయిన రమాబాయి తన దగ్గరున్న తాళాలతో తలుపులు తీసుకొని లోపలికి అడుగు పెట్టింది.

అంతే! అక్కడి దృశ్యం చూసి నోట మాటరాలేదామెకి. తలుపుకు ఎదురుగా నేలపైన



రక్తపు మడుగులో పడివుంది అచల.

తేరుకున్న రమాబాయి పెద్దగా ఏడుస్తూ పక్క ఫ్లాట్‌లో ఉంటున్న ఓబ్రా ఇంటికి పరుగెత్తుకెళ్ళింది.

రమాబాయి అరుపుల్నివిని ఓబ్రా ఇంట్లోవాళ్ళంతా బయటికి వచ్చారు. ఓబ్రా రమాబాయిని భార్యకు అప్పజెప్పి వారి ఫ్లాట్‌కి వచ్చి చూశాడు. అక్కడ ప్రాణంలేని అచల పడివున్న తీరు చూసి వెంటనే పోలీసులకి, అచల తండ్రికి, బ్యాంక్‌లో పనిచేస్తున్న ఆమె అన్నకి ఫోన్‌చేశాడు.

విషయం అందినవెంటనే పోలీసులు, ఫోటోగ్రాఫర్లు, వేలిముద్రల నిపుణులు హడావుడిగా వచ్చారు.

అచల శవాన్ని పరీక్షగా చూసిన తరువాత, పిస్తోలును గుండెకు గురిపెట్టి కాల్చడంవల్ల అచల చనిపోయిందనీ, శరీరంపైన వేరే గాయాలేవీ లేవనీ తేల్చిచెప్పాడు పోలీసు సర్జన్.

ఇల్లంతా పరిశీలించి చూశాడు జైకర్. వస్తువులన్నీ ఉండవలసినచోట నీటుగా సర్దివున్నాయి. విలువైన వస్తువులేవీ తాకిన గుర్తులు లేవు. దానినిబట్టి దొంగతనం కోసం ఆ హత్యా జరగలేదని తెలుసుకున్నాడతను. అచల ఒక పాదానికైతే చెప్పు ఉంది గాని మరో చెప్పు కొంత దూరంలో పడివుంది. అప్పుడే వచ్చిన బల్వంత్‌రావుని, అచల అన్న అరుణ్‌ని ప్రశ్నించిన తరువాత, అచలకు ఎలాంటి ప్రేమ వ్యవహారాలూ లేవని తెలిసింది.

అలాగే ఆ "ఇంప్రెస్ మహల్" ప్రాంగణంలోని వారెవ్వరికీ కూడా ఈ హత్యతో సంబంధం లేనట్టు నిర్ధారించుకున్నాడు ఇన్‌స్పెక్టర్. రమాబాయి గుడికి వెళ్ళిన సమయంలో బయటి వ్యక్తి ఎవరో వచ్చి అచలను హత్యచేసి వుండవచ్చుని ఊహించారంతా. మహల్ వాళ్ళెవరూ తాము హంతకుడినిగాని, అలాంటి వ్యక్తులనుగానీ గమనించలేదన్నారు.

అక్కడి గూర్ఖా ఇచ్చిన సమాచారాన్నిబట్టి మధ్యాహ్నం ఒకటిన్నర కావస్తుండగా బెల్‌బాటమ్, నీలం, తెలుపు రంగులున్న చొక్కా ధరించిన పాతిక సంవత్సరాల యువకుడెవరో ట్యాక్సీలో మహల్‌కి వచ్చాడు. తిరిగి అతను బయటకు వచ్చి వెళ్ళిపోయేవరకూ ట్యాక్సీ అక్కడే ఎదురుచూస్తూ వుంది. తరువాత ఆ ట్యాక్సీలోనే వెళ్ళిపోయాడతను.

లిఫ్ట్‌మాన్ కూడా ఆ యువకుడు పైకి లిఫ్ట్‌లో వెళ్ళాడని చెప్పాడు. అలాంటి వ్యక్తిని తామెన్నడూ చూడలేదన్నారు అచల తల్లిదండ్రులు.

పోలీస్‌స్టేషన్‌కి తిరిగొచ్చిన ఇన్‌స్పెక్టర్ జైకర్ ట్యాక్సీ డ్రైవర్స్ యూనియన్‌కి ఫోన్‌చేసి ఆ వ్యక్తిని ట్యాక్సీలో తీసికెళ్ళిన డ్రైవర్ గురించి వాకబుచేసి ఆ డ్రైవర్ గనుక అక్కడ వుంటే పంపించమని చెప్పాడు.

మరునాడు హత్యకు సంబంధించిన రిపోర్టులు అందాయి. ముందుగది తలుపుపైన దొరికిన వేలిముద్రలు వారి రికార్డులో లేవని తెలుసుకున్నారు పోలీసులు. హంతకుడు ఆర్మీ, నేవీ, పోలీసు అధికారులుపయోగించే సైలెన్సర్ రివాల్వర్‌ను ఉపయోగించాడని తెలిసింది.

అచల ఇంటికి వెళ్ళి ఇన్‌స్పెక్టర్ ఆమె పుస్తకాల ర్యాక్‌ని, వార్డ్‌రోబ్‌ని పరీక్షించాడు. పుస్తకాలన్నీ ఒక్కటొక్కటీ జాగ్రత్తగా చూస్తున్న జైకర్‌కి వాటి అడుగున ఉత్తరాల దొంతర కనిపించింది. అవన్నీ కాలేజీ అడ్రసుతో అచల పేరవున్నాయి. ఉత్తరాలనిండా పచ్చి బూతు విషయాల్ని అసభ్యమైన మాటలతో వర్ణించారెవరోగానీ.

ఆ ఉత్తరాల గురించి అచల కుటుంబసభ్యులకేమీ తెలియదని గ్రహించాడు. అవన్నీ తన వెంట తెచ్చాడు జైకర్. అవి శ్రద్ధగా చదివిన తరువాత ఆ రాసినతను అచల కాలేజీలోనివాడేననీ, ప్రేమలో ఓడిపోయానన్న బాధతో ఈ హత్య చేసివుంటాడనీ ఊహించాడు.

అచల చదువుతున్న సిటీకాలేజీకి వెళ్ళాడు ఇన్‌స్పెక్టర్. ఎంతో ప్రయత్నించినమీదట అచల స్నేహితురాళ్ళద్వారా కొన్ని విషయాలు రాబట్టాడతను. ఆశ అనే అమ్మాయి ప్రిన్స్‌పాల్ అడిగిన మీదట చెప్పింది, "ఆ ఉత్తరాలు నితిన్ రాసాడు సార్! కానీ అతనే ఈ హత్య చేశాడని మాత్రం చెప్పలేను. నితిన్ నాసు





కూడా గతంలో రెండు మూడు ఉత్తరాలు రాశాడు. నాలాగే అచల కూడా వాటిగురించి పట్టించుకోలేదు నితిన్ రౌడీ. అతనికి భయప డి మేం మాట్లాడలేదు అతని స్నేహితులు మోహన్, రమేష్, అజయ్, మహేష్‌లు కూడా నితిన్‌ని అసహ్యించుకునేవారు. వాళ్లంతా మంచివాళ్లండీ'' అంది.

''మీరు ఆరోజు మ్యాట్నీకి వెళుతున్నట్టు నితిన్‌కి తెలుసా?'' అని అడిగాడు ఇన్‌స్పెక్టర్.

''లేదు. అతను కాలేజీకిరాక వారంరోజులు



కావస్తున్నది. నిన్న నితిన్ వాళ్ళ అన్నయ్య పెళ్ళి జరిగింది'' అని చెప్పింది ఆశ.

నితిన్ ప్రిన్సిపాల్‌కి పంపిన శుభలేఖను పరిశీలిస్తే, అందులో ఉన్న ముహూర్తం సమ యానికే సరిగ్గా అచల హత్య చేయబడిందని తేలింది.

ఆ పెళ్ళి శివాజీ పార్క్‌లో జరిగింది. అది ఇంప్రెస్ మహల్‌కి చాలా దూరంలో వుంది. ట్యాక్సీలో ఎంత స్పీడ్‌గా వచ్చినా హత్యచేసి వెళ్ళడం అసాధ్యమని గ్రహించాడు ఇన్‌స్పె క్టర్. నితినే ఈ హత్య చేశాడనడానికి వేరే ఆధారాలేవీ దొరకలేదు.

నాలుగు రోజులు గడిచాక శంకరన్ అనే ట్యాక్సీ డ్రైవర్ ఇన్‌స్పెక్టర్ వద్దకు వచ్చాడు.

అతను చెప్పిన వివరాలనుబట్టి హత్యకు కొంత క్లూ దొరికినట్టయ్యింది.

''నేను భారతీయ విద్యాభవన్ గేటుగుండా వస్తుండగా నన్నాపి హార్క్‌నెస్ రోడ్డువైపు తీసు కుపొమ్మన్నాడో యువకుడు. ఇంప్రెస్‌మహల్‌కి కొంతదూరంలో ట్యాక్సీ దిగి వెళుతూ నన్ను కొంతసేపు వెయిట్ చేయమన్నాడు. తిరిగి వచ్చిన అతని ముఖంలో కంగారు స్పష్టంగా కనిపించింది. దారిలో ఎదురుగా వున్న అద్దంలోంచి అతన్ని చూశా. అతనెందుకో అసౌ కర్యంగా ఫీలవుతున్నట్టు అనిపించింది. ఏం జరిగిందని అడిగాను. ఏమీ లేదని దాటవేశా డు. ఎక్కినచోటే ట్యాక్సీ ఆపించుకొని, ఇరవై రూపాయలనోటు నా చేతిలో పెట్టాడు. చిల్లర తిరిగి ఇచ్చేద్దామనుకునేలోగానే పెద్దపెద్ద అంగలేస్తూ వెళ్ళిపోయాడు''

ఇన్‌స్పెక్టర్ ఆ టాక్సీడ్రైవర్ వెంటవెళ్ళి వాకబుచేసి ఆ యువకుడు మెహతామాన్షన్ అపార్ట్‌మెంట్‌లో ఉంటున్నాడని తెలుసుకు

న్నాడు.

తర్వాత ఇన్‌స్పెక్టర్ సిటీకాలేజీకి ఒకర్ని పంపి మెహతామాన్షన్‌లో ఉంటున్న అబ్బాయిలెవరైనా ఆ కాలేజీలలో చదువుతున్నారేమో కనుక్కొరమ్మన్నాడు.

అతను తెచ్చిన కాలేజీలో చదివే అబ్బాయిల అడ్రసుల లిస్టు చూస్తున్న ఇన్‌స్పెక్టర్‌కి మహేష్ పేరు కనిపించిందోచోట. ఆశ మంచబ్బాయిలని చెప్పిన వాళ్లలో మహేష్ కూడా ఉన్నాడు. అచల హత్య జరిగిన రోజు మహేష్ కాలేజీకి రానట్టు అటెండన్స్ రిజిస్టర్‌లో వుంది. పైగా ఆరోజునుండీ మహేష్ కాలేజీకే రావడంలేదు.

ఇన్‌స్పెక్టర్ వెంటనే వెళ్ళి మెహతామాన్షన్‌కు చుట్టుపక్కల వున్న దుకాణాల్లో వాకబుచేశాడు. కిళ్ళీకొట్టతను, బ్రాందీ షాపతను ఇచ్చిన సమాచారం అతనికెంతగానో ఉపయోగపడింది. మహేష్‌కి ఈమధ్య తాగడం ఎక్కువయ్యిందనీ, ఓరోజు వాళ్ల అక్కతో షాపుకొచ్చాడని, వాళ్ళ అన్నయ్య్యే ఫోన్లో మాట్లాడుతూ, తాను ఆరోజే బొంబాయి వచ్చినట్టు బ్రీచ్‌కాండీ ఆసుపత్రిలో చేరాలనుకుంటున్నట్టూ ఎవరితోనో చెప్పగా తాను విన్నాననీ అన్నాడు.

మఫ్టీలో వున్న పోలీసుల్నీ శంకరన్‌ని బ్రాందీ షాపువద్ద మహేష్‌కోసం కాపలా కాయమని చెప్పి కామత్‌బీచ్‌కాండీ ఆసుపత్రికి వెళ్ళాడు. నవంబర్ 26న ఉమేన్ అనే ఆర్మీ ఆఫీసర్ ట్రీట్‌మెంట్ కోసం వచ్చాడనీ, అతని వెంట వచ్చిన మహేష్ అనే వ్యక్తి మరునాడు కూడా వచ్చాడుగానీ ఆ తరువాత కనిపించడంలేదనీ చెప్పారు ఆసుపత్రివారు.

బ్రాందీ షాపుకు తిరిగొచ్చిన ఇన్‌స్పెక్టర్‌తో టాక్సీడ్రైవర్ అప్పుడే ఆ షాపులోకి అడుగుపెట్టిన ఓ వ్యక్తివైపు చూపిస్తూ, "సర్! అతనే ఆరోజు నా టాక్సీలో ఎక్కింది" అన్నాడు. మత్తుగా, నీరసంగా బ్రాందీషాపు మెట్లు దిగుతున్న ఆ వ్యక్తే మహేష్!

ఇన్‌స్పెక్టర్ తన బృందంతోనూ, శంకర్‌తోనూ టాక్సీలో మెహతామాన్షన్ వెళ్ళి మహేష్ ఉంటున్న అపార్ట్‌మెంట్ కాలింగ్‌బెల్ నొక్కారు. పూలలుంగీ, కట్ బనియన్ ధరించిన మహేష్ తూలుతూ కనిపించాడు వారికి.

గదినిండా కమ్ముకున్న సిగరెట్ పొగ, నేలపై చిందరవందరగా వున్న విస్కీ సీసాలు, బల్లపై పరచినట్టున్న అచల ఫొటోలు, మహేష్ వాలకాన్ని చూసి అతనేదో తీవ్రమైన మానసిక వ్యధ అనుభవిస్తున్నాడని తెలుసుకున్నారు.

వచ్చిన ఆ ముగ్గురినీ చూసి పరిస్థితి అర్థంచేసుకున్నాడు మహేష్. వారిని కూర్చోమని చెప్పి అడిగిన ప్రశ్నలన్నిటికీ జవాబు చెప్పాడు మహేష్. ఆవేశంగా, బాధగా మహేష్ చెప్పిన విషయాలన్నీ ఓపిగ్గా విన్నారాముగ్గురూ.

"అచలను నేనే హత్యచేశాను. అంతేకాదు ఆమెను గాఢంగా ప్రేమించాను కూడా" అన్నాడు.

మహేష్ కుటుంబం గోవాలో ఉండడంతో అతనొక్కడూ చదువుకోసం బొంబాయిలో ఉంటున్నాడు. స్వతహగా మహేష్ భయస్తుడు. నలుగురితో కలిసిపోయే స్వభావం కాదు. మంచి కవి కూడా. అచల, మహేష్‌లు ఇద్దరూ ఒకే కాలేజీలో చదువుకున్నారు. మొదట్లో అచలతో దూరంగా వున్నా రానురాను ఆమెపట్ల ఉత్సాహం చూపించడం మొదలుపెట్టాడు. అచల నవ్వు మహేష్‌ని పిచ్చివాణ్ణి చేసేది. ఆ తరువాత అచలను తాను ప్రేమిస్తున్నట్టు తెలుసుకున్నాడు. ఆమె ప్రేమ కోసం పరితపిస్తూ ఆ మాట ఆమె ఎదురుగా చెప్పే ధైర్యంలేక కవితలు రాసి ఇచ్చేవాడు. అచల వాటిపట్ల ఏమాత్రం శ్రద్ధ చూపలేదు. వాటిగురించి మాట్లాడేది కూడా కాదు.

కాలేజీ వ్యవహారాలలో ఇద్దరూ కలిసి పనిచేయడం, క్యాంటిన్‌కి వెళ్ళి కలిసి టీ తాగుతున్న అచల మహేష్ రాసిన కవితల గురించి ఏమీ మాట్లాడేది కాదు.

మహేష్ తనని ప్రేమిస్తున్నట్టు గ్రహించినా మామూలుగానే ఉండేది. అచల నిర్లక్ష్యం అతన్ని దహించివేసింది. తన అసమర్థత, పిరికితనం తనకు మనశ్శాంతి నివ్వలేకపోయాయి. తనకు దక్కని అచల నవ్వు మరెవరి సొంతమూ కావడానికి వీల్లేదు. అలా జరగాలంటే ఆ ఇద్దరిలో ఎవరో ఒకరే ఉండాలనుకొన్నాడు.

చివరగా అచలను చంపితే తప్ప తన ఈ




బాధకు అంతం వుండదని నిర్ణయించుకున్నాడు. ఆవేశంలో ఉచితానుచితాలు మరిచిపోయాడు. పరిస్థితులు కూడా అందుకు సహకరించాయి.

ఒక రోజు క్యాంటీన్‌లో స్నేహితులతో మాట్లాడుతున్న అచల పక్కనే మరో టేబుల్‌దగ్గర కూర్చున్న మహేష్ వారి మాటల్ని విని సినిమా ప్రోగ్రామ్ గురించి తెలుసుకున్నాడు.

రమాబాయి గుడికి వెళ్లడం, అచల ఆ సమయంలో ఒంటరిగా వుండటం మంచి అవకాశంలా అనిపించిందతనికి. బీచ్‌కాండీ ఆసుపత్రిలో చికిత్సకై చేరిన ఉమేష్ పిస్తోలు అందుకు సహాయపడింది.

తన ప్రేమ ఎలాంటిదో కవితలద్వారా తెలుసుకోలేకపోయిన అచలకు రివాల్వర్ ద్వారా తెలపాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

ఆ మర్నాడు మధ్యాహ్నం కాలింగ్‌బెల్ శబ్దం విని తలుపు తీసిన అచల మహేష్‌ను తొలిసారిగా తన ఇంటి గుమ్మంలో చూసి ఆశ్చర్యపోయింది.

"హల్లో! మహేష్ ఏమైనా విశేషాలా?" అని అడిగింది నవ్వుతూ.

ఆ నవ్వే ఆమె పాలిటి మృత్యువైంది. మహేష్ జవాబివ్వకపోగా తనవైపు అదోలా చూడడంతో భయపడిపోయింది అచల. రెప్పపాటు కాలంలో జేబులోంచి రివాల్వర్ తీసి ఆమెకు గురిపెట్టి కాల్చాడు.

ఆ తరువాత తలుపుల్ని బిగించేసి మెట్లు దిగివచ్చి టాక్సీ ఎక్కాడు.

అతని పిచ్చిప్రేమకి అచల బలికావడంతో ఆ బాధనుండి విముక్తికోసం తాగుతున్నానన్నాడు మహేష్. అతను చెబుతున్నంతసేపూ అచలకోసం అతను పడే ఆవేదనను అర్థంచేసుకున్నారు వాళ్ళు.

విచారణ అనంతరం మహేష్‌ను పోలీసులు అరెస్టు చేశారు. అచలను హత్యచేశాడనే బలమైన ఆధారాలుండడంతో అతనికి యావజ్జీవ కారాగారశిక్ష విధించింది కోర్టు.

# యాదృచ్ఛికం

సుమిత్ర క్యాలెండరుకేసి విచారంగా చూస్తూ కూర్చుంది. ఆరోజు 1980 మార్చి తొమ్మిదవ తేదీ. ఆమె భర్త కనిపించకుండాపోయి సరిగ్గా పదిరోజులయింది.

సుమిత్ర భర్త మౌలీరామ్. లక్నో సమీపంలో గోమతి నది ఒడ్డునానుకొని ఉన్న రాంపూర్ గ్రామంలో నివసిస్తున్నారు వాళ్ళు. వ్యవసాయదారుడైన మౌలీరామ్‌కు డబ్బుకు లోటులేదు. పంటభూములూ, పంటలు కూడా ఎక్కువగానే ఉండడంవల్ల ఆదాయం బాగానేవుంది.

లక్నోలో డాన్సర్‌గా పనిచేసిన సుమిత్రను మౌలీరామ్ ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ఆ పెళ్ళి మౌలీరామ్ తల్లికి ఇష్టంలేదు. ఆ కారణంగా ఆమె సుమిత్రమై ద్వేషం పెంచుకొన్నది.

మౌలీరామ్ కుటుంబసభ్యులే కాకుండా భైలారామ్ అనే దూరపు బంధువు కూడా చాలాకాలంనుంచీ వారి ఇంట్లోనే ఉంటున్నాడు. భారీ విగ్రహంతో ఠీవిగా అందంగా ఉండేవాడతను. మౌలీరామ్‌కు పొలంపనిలో సహాయంగా ఉండేవాడు.

పండిన పంటను లక్నోలో అమ్మి డబ్బు తెచ్చుకునేవాడు మౌలీరామ్. అతను లక్నో వెళ్ళినప్పుడల్లా ఒంటరిదైన సుమిత్ర, అత్తగారు తనతో మాట్లాడకపోవడంతో భైలారామ్‌తోనే కబుర్లు చెబుతూ కాలక్షేపం చేసేది. భర్తకు ఆమె అలా భైలారామ్‌తో చనువుగా ఉండడం ఇష్టంలేదు. అందువలన అతను భార్యతో "అతనితో కబుర్లతో కాలక్షేపం చేసేబదులు అమ్మకు వంటలో సాయంచెయ్యొచ్చుగా" అన్నాడు ఓరోజు.

దానికి సుమిత్ర, "మీ అమ్మకు నేనంటే అసహ్యం, ఆమె నన్ను వంటింట్లోకి అడుగుపెట్టనివ్వదు. మాది తక్కువకులం అని ఆమెకు

నాపై చిన్నచూపు. ఏంచేయాలో తోచక నేను భైలారామ్‌తో కబుర్లు చెప్తాను. అయినా ఇందులో తప్పేముంది?'' అంటుందామె.

ఈ కారణంవల్ల క్రమంగా భార్యభర్తలమధ్య వివాదాలు బయల్దేరాయి. చుట్టుపక్కల ఇళ్ళల్లో ఉండేవారందరికీ వీరి గొడవలు తలనొప్పిగా తయారయ్యాయి.

మౌలీరామ్ కనిపించకుండాపోయినరోజు కూడా ఇద్దరూ గొడవపడ్డారు. అందువలన మౌలీరామ్ అదృశ్యానికి సుమిత్రే కారణమని

ఇలా పదిరోజులు గడిచిపోయాయ్. ఈ గొడవ భరించలేక భైలారామ్ ఓరోజు పోలీసులకు రిపోర్టుచేశాడు.

పోలీసులడిగిన ప్రశ్నలకు భైలారామ్, తరచుగా ఇద్దరూ గొడవపడేవారనీ, మౌలీరామ్‌కు సుమిత్ర పరాయిమగవాళ్ళతో మాట్లాడటం ఇష్టంలేదనీ చెప్పాడు.

''మరి ఆవిడకు అలా ఎవరితోనైనా మాట్లాడ్డం అలవాటుందా?'' అని అడిగారు పోలీసులు.



ఆమె అత్తగారు విందాబాయ్ తిట్టిపోసేది.

దానికి భైలారామ్, ''ఎందుకలా గొడవచేస్తున్నావ్. ఇప్పుడు మౌలీరామ్ కనిపించకుంటే ఏమయ్యిందనీ? అతను లేకపోవడంవల్ల ఇల్లు చాలా ప్రశాంతంగా ఉంది. అలా ఉండడం నీకిష్టంలేదా?'' అన్నాడు కోపంగా.

''అంటే నువ్వు కనీసం పోలీసు రిపోర్టు కూడా ఇవ్వవా?'' అని అడిగింది విందాదేవి ఆతృతగా.

సుమిత్ర కలగజేసుకుంటూ, ''పోనీయ్, పోలీస్ రిపోర్ట్ ఇవ్వరాదూ'' అంది భైలారామ్‌తో.

దానికి భైలారామ్, ''నాతో తప్పిస్తే సుమిత్ర ఎవరితోనూ మాట్లాడదు'' అన్నాడు.

''మీకూ, సుమిత్రకూ మధ్య ఏమైనా ప్రేమ వ్యవహారం నడుస్తోందా?'' అని అనుమానంగా అడిగారు పోలీసులు.

భైలారామ్ దానికి సమాధానం చెప్పక తిరిగి పోలీసులనే, ''మీరు సుమిత్రను కూడా ఎందుకు ప్రశ్నించరు'' అని అడిగాడు.

ఆ మర్నాడే రాంపూర్ గ్రామంలో పోలీసుల పరిశోధన ప్రారంభమైంది. గ్రామస్థులంతా సుమిత్ర, మౌలీరామ్‌లు రోజూ పోట్లాడుకునేవారనీ, ఇద్దరిమధ్య గొడవ శృతిమించినరోజే మౌలీరామ్ గోమతి నదివైపు వెళ్ళగా చూశామని చెప్పారు.




మాలీరామ్ తల్లి, "సుమిత్ర వచ్చినప్పటి నుండీ నా కొడుక్కు చెడురోజులు దాపురించాయ్. వాడికి దానిపై అసహ్యంపుట్టి ఇంటి నుండి వెళ్ళిపోయాడు" అని చెప్పింది.

ఇన్‌స్పెక్టర్ సుమిత్రను, "భైలారామ్‌పైన ప్రత్యేకమైన అభిమానంగానీ వుందా?" అని అడిగాడు.

దానికి సుమిత్ర, "లేదు... నేను మాలీరామ్‌ను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాను. నా జీవితంలో మరెవ్వరికీ చోటులేదు" అంది ఏడుస్తూ.

"మీరు భైలారామ్‌తో తరచుగా మాట్లాడుతూ ఉంటారా?" అని ప్రశ్నించారు పోలీసులు సుమిత్రను.

పోలీసులడిగిన ప్రశ్నకు సుమిత్ర, "పెళ్ళయినంతమాత్రాన ఆ స్త్రీ మరో మగాడితే మాట్లాడితే తప్పేంటి?" అని తిరిగి ప్రశ్నించింది.

భైలారామ్‌ను గట్టిగా బెదిరించి అడిగితే ఇంకా ఏమయినా ఆధారాలు దొరకవచ్చనుకున్నాడు ఇన్‌స్పెక్టర్. అందువల్ల మార్చి 12న అతన్ని పోలీస్‌స్టేషన్‌కు పిలిపించారు.

ఇన్‌స్పెక్టర్ భైలారామ్‌తో, "మాలీరామ్ గురించి ఏమీ తెలియలేదు. అతను ఆత్మహత్య చేసుకున్నాడని మేమనుకుంటున్నాము. మీరేమంటారు?" అని అడిగాడు.

"మీరు చెప్పింది నిజంసార్!" అన్నాడు భైలారామ్.

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవ్?"

"గోమతి నదివైపు వెళుతుండగా అతన్ని చాలామంది చూశామన్నారు. అంత గొడవ జరిగాక అతను ఆత్మహత్య చేసుకోక ఏమౌతాడు?" అన్నాడు భైలారామ్.

"నదిలో దూకిన తరువాత అతను మనసు మార్చుకొని బయటికి రావచ్చుగా?" అనుమానంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఆ అవకాశం లేద్సార్. ఎందుకంటే... అతనికి ఈదటం రాదు"

"అసలు అతను చచ్చిపోవాలని ఎందుకనుకుంటాడు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్, ఎలాగైనా అతన్నుండి నిజం రాబట్టాలని.

"సుమిత్రతో గొడవ భరించలేక అతను ఆత్మహత్యకు సిద్ధమయ్యాడు" తనకు బాగా తెలుసన్నట్టు చెప్పాడు భైలారామ్.

"నువ్వు, సుమిత్ర చనువుగా ఉండటం ఇష్టంలేక కూడా ఈపని చేసిఉండొచ్చుగా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"కావచ్చు" అన్నాడు భైలారామ్.

కేసుగురించి కొంత అర్థమయింది ఇన్‌స్పెక్టర్‌కు. భైలారామ్‌చేత నిజం కక్కించాలని అతని ప్రయత్నం.

"మొన్న ఫిబ్రవరి 28న నువ్వు, మాలీరామ్ ఇద్దరూ కలిసి నది ఒడ్డుకు వెళ్ళారు. సుమిత్ర గురించి మాట్లాడటానికి అతను నిన్నక్కడికి రమ్మన్నాడు. అవకాశం దొరికిందికదా అని, మాలీరామ్‌కు ఈదటం రాదన్న విషయం తెలిసిన నువ్వు అతన్ని నదిలోకి తోశావు... ఔనా?" అని రెట్టిస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"కాదు, ఇది అబద్ధం" అని అరిచాడు భైలారామ్.

"అబద్ధాలతో తప్పించుకోవాలని చూడకు భైలారామ్. నువ్వు మాలీరామ్‌ను నదిలోకి తోసినప్పుడు చూసిన సాక్షులున్నారు. నీకు మరణశిక్ష ఖాయం" నిజం రాబట్టాలని ఇన్‌స్పెక్టర్ దబాయించాడు.

భైలారామ్ మొహంలో రంగులు మారాయి. "సర్! నన్ను రక్షించండి. నేను నిజం చెప్పేస్తాను. ఆరోజు సాయంకాలం దాదాపు అయిదవుతోంది. వ్యక్తిగత విషయాలేవో మాట్లాడటానికి నన్ను గోమతి నదిదగ్గరికి రమ్మన్నాడు మాలీరామ్. మాటల్లో నన్ను ఇల్లొదిలి వెళ్ళిపొమ్మన్నాడు. నేను వెళ్ళనన్నాను. కత్తితీసి నన్ను బెదిరించాడు. నేను భయపడిపోయి, నన్ను నేను కాపాడుకోవటంకోసం అతన్ని ఒక్కతోపు తోశాను. దెబ్బతో అతను వెళ్ళి నదిలో పడ్డాడు. నేనతన్ని రక్షించేలోపలే ఓ పెద్ద అల వచ్చి అతను కొట్టుకుపోయాడు"

అంతే! కథ కోర్టుకు వెళ్ళింది. భైలారామ్‌కు పదేళ్ళ కఠిన కారాగారశిక్ష విధించారు. జైలు నుంచి విడుదలైవచ్చిన తరువాత సుమిత్ర, భైలారామ్‌లు వివాహం చేసుకుని హాయిగా కాపురంచేసుకోసాగారు.

# బంధం పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర'లో ప్రచురితమైన ఎమ్.లక్ష్మీరమణకుమారి నవల 'బంధం'పై పాఠకులనుండి అందిన సమీక్షలలో ఉత్తమంగా భావించిన ఆరింటిని ఎన్నికచేసి అందిస్తున్నాం.

## నాణానికి మరోవైపు

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

పెళ్లి వయస్సు వచ్చిన ఆడపిల్ల ముక్కూ మొహం తెలీని పదిమందిముందు పెళ్లిచూపుల పేరిట కూచోడం, వాళ్లు చేసే శల్యపరీక్షలను ఎదుర్కోవడం జరుగుతుంది. ఆడపిల్లను కన్నపాపానికి అనేక ఆటుపోట్లను ఎదుర్కొని, తల్లిదండ్రులు పెళ్లితంతు జరుపుతారు. ఆ తరువాత ఆ అమ్మాయి ఎటువంటి జీవితాన్ని ఎదుర్కోవలసివస్తుందోననే అంతులేని భయంతో అత్తారింట ప్రవేశించి అక్కడి వాతావరణంలో భర్త, అత్తమామల మనస్తత్వాల మధ్య కత్తిమీద సాములా ఆమె అనుభవించే ఒడుదుడుకులను చూస్తూనే ఉన్నాం. అయితే ఈ నవలలోని కథానాయకుడు పెళ్లిచూపులలోను, ఆ తర్వాత వర్ధ అగచాట్లు, వివాహానంతరం అనుభవించిన ఆవేదన చదువుతుంటే సహజంగా జరిగేదానికి భిన్నంగా, నాణానికి మరోవైపు చూపించాలనే రచయిత్రి తాపత్రయం కన్పిస్తుంది.

సూటిగా చెప్పాలంటే ఏ భార్యాబాధితుడో ఈ కథ వ్రాసి రచయిత్రి పేరు పెట్టుకున్నట్లు తోస్తుంది. చిత్రం ఏమిటంటే ఈ కథలో పురుషులందరూ భార్యాబాధితులే. లోతుగా విశ్లేషిస్తే ఒకరకంగా వీరంతా చవట దద్దమ్మలు. తమ చేతకానితనానికి భార్యని రాక్షసిగా భావించడం వీరి బలహీనతే.

కూతుర్ని కోడల్ని ఒకేలాగా ఏ అత్తమామలూ చూడనట్లే అత్తమామల్ని తల్లిదండ్రులతో సమానంగా ఏ కోడలూ చూడలేదు. ఆ స్థానంలో ఉన్నవారిలో ఏ చిన్న బలహీనతయినా భూతద్దంలో కన్పించడం సహజం. అయితే నీ తల్లిదండ్రులు నీకెలాగో నా తల్లిదండ్రులు నాకూ అంతే అనే భావం భార్యకర్థమయ్యేలా భర్త ప్రవర్తించాలి. కొత్తలో భార్య బెరుకుతనాన్ని పోగొట్టడం కోసం తను వెన్నెముకలేని మగాడవనక్కర్లేదు. తన గౌరవాన్నే తను కాపాడుకోలేకపోయినవాడు తన తల్లిని భార్య గౌరవించడం లేదని బాధపడడంలో అర్థంలేదు.

తన మనస్సుమీద తనకే ఆధిపత్యంలేని దశలో స్త్రీద్వేషిగా మారిన శరత్ తన భార్య మీద కక్ష తీర్చుకున్న విధానం ఏమాత్రం హర్షించదగ్గది కాదు. అవసరం లేనప్పుడు అప్పులు చేసి భార్య కోరికలు తీర్చడం ఎంత నేరమో, భర్తగా తన బాధ్యతలనుంచి పారిపోవడం కూడా అంతే ఘోరం. అదుపులో లేని భార్యను తన ఆశయాలకనుగుణంగా మార్చుకుని సంసారాన్ని సుఖమయం చేసుకునే ధైర్యాన్ని ప్రదర్శించడానికి బదులు తన పిరికితనాన్ని మరింత చూపించుకుంటూ తననుతాను ఇంకా హింసించుకోవడం ఏవిధంగా అభినందనీయం?

-పి. నిర్మలాసుబ్రహ్మణ్యం
మానేపల్లి

## సినిమా టిక్?

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'బంధం' కథాగమనం బాగున్నప్పటికీ, శరత్ పాఠకులనుండి ఆశించింది జాలే అయితే





అది అంతగా పొందలేకపోవచ్చు. కారణం ఒక పురుషుడివల్ల స్త్రీ బాధపడితే ఆ నిమిషానికి, ఆ స్త్రీపట్ల సానుభూతి, ఆ పురుషుడిపట్ల నిరసన కల్గినా, పితృస్వామ్య సమాజానికి అల వాటుపడ్డ పాఠకులకి ఒక స్త్రీవలన పురుషుడు బాధలుపడే ఇల్లు వదిలిపోతే, ఆ పురుషుడిప ట్ల జాలికంటే, ఒక చేతకానివాడిపట్ల కలిగే తూష్ణీభావమే ఎక్కువ. నవల ఆద్యంతమూ మనకి శరత్ అలా ఒక చేతకానివాడుగానే, గోచరించి, జాలికి బదులు తూష్ణీభావానికే ఎక్కువ గురయ్యాడు.

సజాతి ధృవాలు వికర్షించుకొన్నట్లే. అత్తింట్లో అడుగుపెట్టిన కోడలికి, అత్తగారికి మధ్య ఘర్షణలు ఆరంభంలో అతిసహజం. మారిన పరిస్థితుల్లో శేషజీవితం గడపవలసిన ప్రదేశంలో నివసించాల్సిన ఆ ఇద్దరిలో తన ఉనికిని ప్రదర్శించి బలపర్చుకోవాలన్న తపన కోడలిదైతే, కనిపెంచిన కొడుకు మరొక స్త్రీ అధీనంలోకి వెళ్లిపోతాడన్న ఆరాటం అత్తగారిది. తానూ ఒకప్పటి కోడల్నేనన్న విశ్లేషణ అత్తగారిలో ఉండదు. తాను రేపటి అత్తగారినన్న ఆలోచన కొత్త కోడలిలోనూ ఉండదు. ఈ ఇద్దరినీ సమన్వయపరచవలసిన ఆవశ్యకత, బాధ్యత మగవాడిది. ఆ బాధ్యత నిర్వహించడం మానేసి, తనకి పోట్లాటలు అసహ్యం అనటం, సమాధానపర్చుకోవడం ఆత్మ వంచన అవుతుంది కాని మంచితనం అనిపించుకోదు. తండ్రిని కోల్పోయి, తల్లి అధీనంలో పెరగడం, అతనిలోని ఈ మెతకతనానికి కారణం కావచ్చు. దానికి గోవిందయ్య, గుర్నాధం కుటుంబంల సహవాసం ఓ కారణం కావచ్చు.

అన్నింటికంటే నవల ముగింపు, సినిమా కాలుష్యంసోకిఅసహజంగా ఉంది. జీవితభాగస్వామిని తన మాటలతో మార్చి కాపురాలు చక్కదిద్దే 'జాగృతినారి' కార్యకర్త శిరీష అంత సులువుగా రాజేశ్వరి విషయంలో ఓటమి ఒప్పేసుకోవడం విచిత్రంగా ఉంటే, దుఃఖిస్తున్న పరపురుషుణ్ణి ఒక వివాహిత, ఎంత సోదర భావం ఉన్నా అలా గుండెల్లోకి చేర్చుకొని ఓదార్చడం, సరిగ్గా అదే సమయానికి ఆమె భర్త నాటకీయంగా వచ్చి ఆమెమీద (మిథ్యా క్రోధంతో) చేయిచేసుకోవడం గట్రా, దారుణంగా మరీ సినిమా టిక్‌గా ఉన్నాయి.

-కె.వి. రమాకాంత్,
విజయనగరం

## చక్కని కథాకథనం

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

సమాజంలో ఎంతోమంది భార్యా బాధితులు ఉన్నా వారి పాత్రలు వెలుగులోకి రావు. 'బంధం' నవలలో అటువంటి అజ్ఞాతవ్యక్తుల సమస్యలు కరుణరసాత్మకంగా చిత్రించారు. స్త్రీద్వేషిగా ప్రవేశపెట్టబడిన శరత్ పాత్ర, అతడు అలా మారడానికి సహేతుక కారణాలతో వివిధ సంఘటనల రూపంలో పాఠకుల కళ్ళకు కట్టినట్లు వివరించారు. ఒక్క శరత్ పాత్రతో సరిపెట్టకుండా మరిన్ని భార్యాబాధితుల పాత్రలు ప్రవేశపెట్టి, వారి కష్టాలు, కన్నీళ్లు వివరించడంతో రచయిత్రి ఈ సమస్యని ఎంత తీవ్రంగా తీసుకున్నారో అర్థం అవుతుంది. ఒకపక్క ఆ పాత్రలు కష్టాలు పడడానికి కొంతవరకూ కారణం వారి నిస్సహాయత, చేతకానితనం అని వివరిస్తూనే మరొకపక్క ఏదోవిధంగా సంసారం రోడ్డున పడకుండా చూసుకోవాలనే తాపత్రయం అని చెబుతారు. అటు మగువలో, ఇటు మగవాడిలో పరివర్తన తీసుకురావడానికి రచయిత్రి ఒక మంచి ప్రయత్నం చేశారు.

'బంధం' నవల కొత్తగా పెళ్లి చేసుకోబోయే యువతీయువకుల ముందరికాళ్లకు బంధం వేస్తుంది. స్త్రీ, పురుషులు మనసా, వాచా, కర్మణా ఒకటై జీవించాలని చెబుతుంది మన పవిత్ర వివాహబంధం. ప్రతివ్యక్తికి వ్యక్తిత్వం వుంటుంది. ఎదుటివ్యక్తి వ్యక్తిత్వాన్ని గౌరవించవలసిన బాధ్యతా వుంటుంది. దానిని తోసిరాజనడమే సమాజంలో జరిగే ఇన్ని అనర్థాలకు మూలం. రచయిత్రి అన్నట్లు వివాహబంధం ద్వారా ఒకటి అయిన భార్యాభర్తలు ఒకరినొకరు "ప్రేమించి గౌరవించడంలో శాంతి, అర్థం చేసుకొని జీవించడంలో సుఖం వుంటాయి" దీనికి భిన్నంగా ఒకరిపై ఒకరు అధికారం

కోసం చెరోవక్కకూ లాగితే ఆ పసుపుతాడు కాస్తా పుటుక్కుమంటుంది. అటువంటి జంటలకు ఇంటిలో సుఖమే కాదు, సమాజంలో గౌరవం కూడా వుండదని హెచ్చరించారు రచయిత్రి.

ఒకవక్క రాజేశ్వరి వంటి కర్కశ హృదయంగల స్త్రీ ప్రవర్తనకు నలిగిపోతున్న శరత్ లాంటి మగవాడిపై పాఠకులకు జాలి కలిగిస్తూనే, మరొకవక్క స్త్రీజాతి అంతా అలానే లేదని చెప్పడంకోసం శాంతమ్మవంటి మాతృమూర్తి ఔన్నత్యాన్ని అడుగడుగునా ప్రతిబింబింపజేసి కథాకథనాన్ని చక్కగా బేలన్స్ చేయడంలో సమర్థత చూపారు.

చక్కటి సందేశం 'బంధం' నవల ద్వారా అందించిన రచయిత్రి లక్ష్మీరమణకుమారిగారికి అభినందనలు.

-కాళహస్తి ఉమా
నంగయగూడెం

## వివాహబంధం

*(నాలుగవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

**అ**న్ని బంధాలకన్నా శక్తివంతమైనది స్త్రీ పురుషుల వైవాహిక 'బంధం'. ఒకరినొకరు ద్వేషించుకునే పరిస్థితుల్లో కూడా, అవసరమైతే సహజమైన రక్తసంబంధాలను కూడా తెంపుకుని స్త్రీ పురుషులు ఈ బంధాన్ని నిలుపుకోవటానికే ప్రయత్నిస్తారు. చాలా చాలావరకు రచనలలో పురుష ప్రపంచపు దుర్మార్గాలే చోటుచేసుకునివున్నాయి. ప్రభుత్వం ఇచ్చిన కొన్ని రక్షణలూ, సదుపాయాలూ, ప్రజల సానుభూతీ స్త్రీలకే వుంటుంది. కానీ కట్నకానుకలకోసం భార్యలను అగ్నికి ఆహుతిచేస్తూ వ్యసనాలకు బానిసలై అసహాయురాలైన స్త్రీని తమ శారీరకబలంతో హింసించే పురుషులు వున్నట్లే, అత్తింటివారి పొడ గిట్టక, తమ తాహతుకి మించిన కోరికలుకోరి, చీరలు, నగలకోసం అహాయిత్యాలకు పాల్పడుతూ తమ పంతాలను నెగ్గించుకునేటందుకు సంసారాలను నరకప్రాయం చేసే స్త్రీలూ వున్నారు. భార్యలను కాల్చివేసే భర్తలు వున్నట్లే, కనిపించకుండా భర్తలను కాల్చుకుతినే భార్యలూ వున్నారు. ఇలా వెలుగులోకిరాక, కనీసవు సానుభూతికి కూడా నోచుకోని భార్యాబాధితుల సమస్యల్ని కూడా హృద్యంగా చిత్రించిన రచయిత్రి అభినందనీయురాలే!

కేవలం భార్యాబాధితులమీదే కథ అంతా నడిపివుంటే రచన అసమగ్రంగా వుండేది. పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీలుపడే కష్టాలను కూడా పొందుపరచి స్త్రీ పురుష సంబంధాలపై, సమస్యలపై రూపొందించబడిన సమగ్రమైన నవల ఇది. శరత్, రాజేశ్వరిల పాత్రలు మనకు ఎలా జీవించకూడదో చెబితే రాఘవ, శిరీషలు ఎలా జీవించాలో మనకు నేర్పుతారు. చిన్న చిన్న త్యాగాలూ, సర్దుకుపోవటాలూ, ఒకరి మీద మరొకరికి గాఢమైన నమ్మకం సంసార బంధానికి పునాదులని నిరూపిస్తారు.

శరత్ వేడిపాలు తాగిన పిల్లిలాగా తన జీవితంలో తారసపడిన స్త్రీలవల్ల, పొందిన అనుభవాలవల్ల మొత్తం స్త్రీజాతి పట్లే ద్వేషాన్ని పెంచుకుంటాడు. తను సుఖంగా వుండటంకోసం తన ప్రాణాన్నే త్యాగం చేసిన తన తల్లి కూడా ఒక స్త్రీయే అని విస్మరిస్తాడు. రచయిత్రి కథాగమనంలో చాలా నేర్పుగా శరత్ అపోహల్ని తొలగించి తనను పీడించే పురుషుడినే నవమాసాలూ గర్భంలో మోసే స్త్రీజాతి ఔన్నత్యాన్ని తెలుసుకునేలా చేశారు. చివరివరకు అనూహ్యమైన మలుపులు తిరిగి, ఉత్కంఠభరితంగా సాగిందీ రచన.

"ఏంటో సగం బ్రతుకంతా నిష్ప్రయోజనంగా, నిరర్థకంగా గడిచిపోయింది. తెలివి వచ్చేసరికే సగంకాలం గడిచిపోయింది" అని రాజేశ్వరిలాగా నిట్టూర్చే పరిస్థితినుండి కొందరినైనా ఈ నవల రక్షిస్తుందని ఆశిద్దాం.

-తూములూరి కనకదుర్గ,
గుంటూరు

## సహజత్వానికి దర్పణం

*(ఐదవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

**వి**వాహ సమయంలో వేదమంత్రాల సాక్షిగా ఒకరై కష్టసుఖాల్లో కలసివుంటామని ప్రమాణా




లు చేసుకుని మూడునాళ్ల ముచ్చట తీరగానే భార్యాభర్తలు ఒకరినొకరు వేధించుకుంటూ, ఆనందడోలికలలో తేలియాడాల్సిన సంసారాన్ని కలహాలతో, కన్నీళ్లతో, అనుమానాలతో, అవమానాలతో నాశనం చేసుకునే భార్యాభర్తలకు ఈ నవల చక్కని గుణపాఠం చెపుతుంది.

ఇక సమీక్ష విషయానికి వస్తే నాణానికి ద్విముఖాలున్నట్లే ఈ నవలను చెప్పినతీరులో కూడా రెండు అంశాలు ఉన్నాయి. నవల సగభాగంవరకూ ఆడంబరాలకుపోయి భర్తలను రాచిరంపాన పెట్టే స్త్రీల మనోస్థితిగతులను అద్భుతంగా మలచిన రచయిత్రి మిగిలిన సగభాగం పురుషుల చేతిలో స్త్రీలు ఎలా బాధింపబడుతున్నారో మన కళ్ళకు కట్టేలా చిత్రించారు. స్త్రీ పురుషులిరువురిలో కూడా మంచి, చెడు ఉంటాయని చెపుతూనే చివరిలో రచయిత్రి స్త్రీ పక్షపాతిగా వ్యవహరించారు. అయితే దీనిలో విమర్శించాల్సిన పనిలేదు.

భార్యాబాధితులైన గుర్నాధం, వీరాంజనేయులు, ఆఫీసర్‌లాంటివారు మనకు నిత్యం తారసపడుతూనే ఉంటారు. జ్యోతిలాంటి అభాగినులు, ప్రకాష్‌లాంటి కిరాతకులు దర్శనమిస్తూనే ఉంటారు. ఈ నవల చదువుతూ ఊహల్లో విహరించే అవకాశం పాఠకులకు ఇవ్వలేదు రచయిత్రి. సహజపాత్రలతో, మన కళ్ళముందు జరిగే సంఘటనలనే తన నవలలో ఇన్‌వాల్వ్‌చేసి గొప్ప ట్రీట్‌మెంట్ ఇచ్చింది రచయిత్రి. ఇలాంటి రచనలు చేయడానికి సామాజిక పరిశీలన, వాస్తవికత కావాలి. ఆ రెండూ పుష్కలంగా ఉన్నాయి. ఇంత మంచి నవల వ్రాసిన లక్ష్మీరమణకుమారిగారికి అభినందనలు. మంచి నవలలు ప్రచురించే బాధ్యత తీసుకున్న 'చతుర'కు ప్రత్యేక అభినందనలు.

-మెండెం శ్రీధర్,
ముదినేపల్లి

## బంధాలు బాంధవ్యాలు

**(ఆరవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)**

కత్తికన్నా గొప్పదిగా పెద్దలు వర్ణించిన కలమనే ఆయుధాన్ని ఈనాడు దాదాపు అందరు రచయిత(త్రు)లూసంధిస్తున్నది పురుషాధిక్య సమాజంపైనే. అటువంటి సాంప్రదాయానుసార రచనలకు భిన్నంగా అందునా ఒక రచయిత్రి స్త్రీలకే కాదు పురుషులకి కూడా సంసారిక సమస్యలు వుంటాయనే నిజాన్ని కళ్లకు కట్టినట్లు 'బంధం' నవల ద్వారా సాక్షాత్కరింపచేసిన తీరు బావుంది. భర్తల వేధింపులు, అత్తల ఆరళ్లు, ఆడబిడ్డల ఈసడింపులు వంటి రొటీన్ డైలాగులకు భిన్నంగా ఒక స్త్రీ (భార్య) తల్లీకొడుకుల అనురాగబంధాన్ని ఎలా విచ్ఛిన్నం చేయగలదో తెలియచెప్పిన తీరు హృద్యంగా వుంది. ఇది చదువుతుంటే ఏదో నవల చదువుతున్నట్లుగాకాక మన పరిసరాలలో జరుగుతున్న ఒక సంఘటనను వీక్షిస్తున్న భ్రాంతి కలుగుతుంది.

దాదాపుగా నవల అంతా ఒక్క శరత్ చుట్టూ మాత్రమే పరిభ్రమించినప్పటికీ అతని చుట్టూ పాత్రలు అల్లబడినతీరు సహజంగా ఉంది. ఎవరో శిరీషలాంటి వాళ్ళు తప్ప శరత్ చుట్టూ అల్లబడిన పాత్రలన్నీ అతనిని మానసికంగా క్రుంగదీసినవే కావడం కాకతాళీయం కావచ్చు. ఒక్క శరత్ మాత్రమే కాకుండా అతని స్నేహితులు, కొలీగ్స్ అందరూ కూడా భార్యాబాధితులుగా చిత్రీకరింపబడటం చూడబోతే రచయిత్రి స్త్రీ ద్వేషా ఏమిటి? అన్న భావన వచ్చే ప్రమాదముంది. కాని చివర్లో శిరీష పాత్ర ద్వారా రచయిత్రి ఈ భావాన్ని తొలగించే ప్రయత్నంలో సఫలీకృతులైనట్లే చెప్పాలి. ఒక సాధారణ కథను కూడా ఓ విభిన్నకోణంలో సాక్షాత్కరింపచేసిన తీరు ముచ్చట గొలిపింది. పట్టునడలని సంఘటనలతో సహజత్వానికి దగ్గరగా వుండేరీతిలో పాత్రలను మలచినతీరు నవలను ఆద్యంతం చదివేలా చేసింది. వెరసి చాలాకాలానికి ఓ మంచి నవలను చదివామనే మధురానుభూతిని మిగిల్చిన రచయిత్రి సాహసానికి మరోసారి అభినందనలు.

-కాకర్ల శ్రీనివాస్,
గుంటూరు



# చతురప్రపంచం

## నీటిపై తేలియాడే ఆకాశ హర్మ్యం

లంకానగర ముట్టడికిగాను తన కోతిమూకతో సముద్రంపై వారధి కట్టించడానికి పూనుకొన్నాడు శ్రీరామచంద్రుడు. సముద్రుని వరప్రభావంవల్ల నీళ్ళలో పడేసిన ప్రతి బండరాయి మునిగిపోకుండా తేలియాడడంతో వారధి కట్టడం వానరులకు ఎంతో సులువైపోయింది. ఆ తర్వాత కథ అందరికీ తెల్సిందే గదా? అయితే ఇక్కడ ఇప్పుడు చెప్పుకోవల్సిన విషయమేమంటే ఏ సముద్రుని వరప్రభావం లేకుండానే జపనీయులు సముద్రాలమీద, నదులమీద తేలియాడే ఆకాశహర్మ్యాలు కట్టిస్తున్నారట. ఈ విషయం తెల్సుకొని ప్రపంచదేశాలన్నీ 'ఔరా' అంటూ ఆశ్చర్యంతో ముక్కుమీద వేలేసుకున్నాయి.

ఇలాంటి మహత్తర కార్యక్రమానికి రూపకల్పన చేసినవాడు ప్రొఫెసర్ సిట్టోటోకియా. పోర్ట్ ఐలెండ్ కాంప్లెక్స్ పేరుతో ఒసాకా నగరానికి 3 కిలోమీటర్ల దూరంలో గోబో నది సముద్రంలో సంగమించే ప్రదేశంలో నీటిమీదే ఓ 'రియల్ ఎస్టేట్ కాంప్లెక్స్'ను నిర్మించాడాయన. 9 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో 35 అంతస్తులతో నిర్మితమైన ఆ భవనంలో సుమారు 20,000 మంది నివసించవచ్చు. అపర 'మయసభలా' కన్పించే ఆ కాంప్లెక్స్‌లో స్విమ్మింగ్‌పూల్సు, ప్లేగ్రౌండ్స్, సిన్మా ఆడిటోరియమ్స్ కూడా ఉన్నాయి. భవనం మొత్తానికి అవసరమయ్యే విద్యుచ్ఛక్తి చుట్టూరా ఉన్న సముద్రజలాలనుంచి ఉత్పత్తిఅయ్యే ఏర్పాట్లున్నాయి. అంతే కాదు జలపరివేష్ఠిత భవనం కావడంవల్ల చేపలు, రొయ్యల వంటివి పుష్కలంగా లభించి,ఆహార సమస్యను తీరుస్తాయి. జపాన్‌కి సహజమైన భూకంపాల బెడద ఆ భవనానికి లేదట. అలాగే నగరాల్లో ఉండే కాలుష్యం వగైరాలక్కడ మచ్చుకి కూడా కన్పించవు. మరో ముఖ్యమైన విశేషం ఏమంటే ఒసాకా పట్టణం నుంచి ఆ కాంప్లెక్సుకి రైలు మార్గాలు కూడా నిర్మించారు. "ఎంతైనా జపానువాడి బుర్రే బుర్ర" అంటున్నారు విదేశీయులు.



## సర్పాల సతీసహగమనం

ప్రజల మూఢవిశ్వాసాల్ని అడ్డంపెట్టుకుని అందినంతవరకూ డబ్బు దండుకోవడం ఓ కళ! ఆ 'కళ'లో నిష్ణాతులైన వారు మనదేశంలో కోకొల్లలు. రూపకన్వర్ సతీసహగమనం చేసి సంచలనం సృష్టించిన థియోరాల గ్రామానికి సమీపంలోనే ఉన్న 'తండా' అనే గ్రామంలో ఇటీవల 'సర్పాల సతీసహగమనం' జరిగినట్లు కథలు ప్రచారమౌతున్నాయి.



ఆ కథాక్రమం బెట్టిదనిన-

ఓనాడు తండా గ్రామంలో కొందరు గ్రామస్థులు ఓ చోట బావితవ్వుతున్నారు. ఆ అలికిడికి ప్రక్కనే ఉన్న పొదలోంచి ఓ పాము బయటికి వచ్చింది. పాము కంటపడడం ఆలస్యం వాళ్లంతా దాన్ని చుట్టుముట్టి చంపేశారు. అనంతరం ఎండుపుల్లలు చెత్తా చెదారం పోగుచేసి నిప్పంటించి ఆ మంటలో ఆ పామును పడేసారు. అంతలో ఆ ప్రక్క పొదలోంచే మరో పాము బయటకు వచ్చి, వారంతా చూస్తుండంగానే ఆ మంట చుట్టూ మూడు ప్రదక్షిణాలు చేసి అందులో దూకేసి సజీవదహనం అయిపోయిందట. ఆ తర్వాత మరో సర్పం వచ్చి అగ్ని చుట్టూ ప్రదక్షిణాలుచేసి మళ్ళీ పొదల్లోకి మాయమైపోయిందట. మంటలో దూకి మరణించిన పాము మొదటి పాముకి భార్య అనీ, అది సతీసహగమనం చేసిందనీ రెండవసారి ప్రదక్షిణాలు చేసి మాయమైన పాము వాటి సంతానమనీ అర్థంచేసుకున్న ఆ గ్రామస్థులు అక్కడ ఆ తర్వాత పెద్ద ఉత్సవం, తతంగం అన్నీ చేయాలని పట్టుపట్టారు. చుట్టుప్రక్కల గ్రామాలలో చందాలు దండిగా వసూలు చేసి గ్రామపెద్ద అయిన నాథూసింగ్ చౌధురి ఆ కార్యక్రమాన్ని వైభవంగా జరిపించాడు. సుమారు 20 వేల మంది ప్రజలు ఆ ఉత్సవాలకి హాజరైనట్టు వార్త. అక్కడ ఇప్పుడు గుడి కట్టాలనే ప్రయత్నంలో ఉన్నారట కొందరు. "అసలిదంతా పెద్దనాటకం. గుడి అయితే నిత్యఆదాయం కళ్లజూడవచ్చుననే వీళ్ల పథకం" అని గిట్టని వాళ్లు చెవులు కొరుక్కుంటున్నారు.

## మూగజీవాల అనాథాశ్రమం

అంగవైకల్యంగల జంతుజాలానికీ, దిక్కూమొక్కూ లేని పశుసంతతికీ 'స్వర్గధామం' అనదగ్గ ఆశ్రమం మైసూర్‌లోని చాముండీ హిల్స్ ప్రాంతంలో ఉంది. ఇంచుమించు 60 సంవత్సరాలక్రితం ఛార్లెస్ టాడ్ హంటర్ అనే ఇంగ్లీషాయన స్థాపించిన ఆ ఆశ్రమం ఇప్పటికీ మూడు

పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతోంది. చక్కని పోషణ, శ్రద్ధాసక్తులతో కూడిన పర్యవేక్షణల కారణంగా వట్టిపోయిన పశువులు కూడా తిరిగి పాలిస్తున్నాయి. కేవలం పాల ఉత్పత్తులద్వారానే ఏడాదికి అరవైవేల రూపాయల ఆదాయం ఆశ్రమానికి లభిస్తోంది. అలాగే సుమారు పాతికవేల వరకూ పేడ మొదలైన ఎరువుల అమ్మకాలద్వారా వస్తోంది. అయితే ఆశ్రమ నిర్వహణకి




సిబ్బంది జీతభత్యాలకి కలిపి ఏడాదికి తొమ్మిదిలక్షల రూపాయలకు పైగానే ఖర్చవుతోంది. ఆ సొమ్ముని చందాలద్వారా, విరాళాలద్వారా ప్రజలనుంచి సేకరిస్తారు ఆశ్రమనిర్వాహకులు. అలా వచ్చే విరాళాలలో పెద్దమొత్తాలు జైన మతస్థులనుంచే లభిస్తాయట.

"సంవత్సరం సంవత్సరానికీ ఇక్కడ అనాథ పశువుల సంఖ్య పెరుగుతూనే ఉంది. కానీ అదే స్థాయిలో విరాళాలు పెరగడంలేదు. ధర్మదాతలెవరైనా ముందుకొచ్చి ఆశ్రమ భూభాగంలో కొన్ని పశువుల కొట్టాల్ని నిర్మించి పెడితే బావుంటుంది" అంటున్నారు నిర్వాహకులు. కేవలం కర్ణాటకలోనివేగాక ప్రక్కరాష్ట్రాలనుంచి కూడా అనాథ పశువులీ ఆశ్రమానికి తరలివస్తున్నాయి. వాటికి అవసరమైన గడ్డి కొనడానికే రోజుకు సుమారు 2,500 రూపాయలవరకూ ఖర్చవుతుందట. అయినా శక్తి వంచనలేకుండా వైద్యసౌకర్యాలతోసహ అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు నిర్వాహకులు. ప్రస్తుతం ఆ ఆశ్రమంలో కేవలం పశువులేగాక, గుర్రాలు, కుక్కలు, పావురాలు కూడా తలదాచుకుంటున్నాయి.

## టైపురైటర్ కథ

టైప్ రైటర్ గురించి ఈ రోజుల్లో తెలియనివాళ్లెవరు? అయితే దీనిపుట్టుక, పరిణామదశలలో వచ్చిన మార్పులు, చేర్పుల గురించి చాలామందికి తెలియదనే చెప్పాలి. తొలిదశలో కొందరు ప్రముఖులు తాము రాసే ఉత్తరాలు అందంగా అచ్చుగుద్దినట్లుగా ఉండాలని భావించారు. అదుగో ఖచ్చితంగా ఆ ఆలోచన నుంచే టైప్‌రైటర్ రూపుదిద్దుకోవడం ప్రారంభించింది. అధికారికంగా 1868లో టైప్‌రైటర్‌ను కనుగొన్నట్లు చరిత్ర చెబుతున్నప్పటికీ అప్పటికి చాలా సంవత్సరాలముందునించే దానికవసరమైన కృషి జరుగుతూ వచ్చింది.

తొలిసారిగా 1714లో హెన్రీమిల్ అనే ఆంగ్లే






యుడు లోహపు చువ్వలకి అక్షరాల అచ్చుల్ని అంటించి టైప్ రైటర్ని డిజైన్ చేశాడు. దాని మీద ఒక అక్షరాన్ని టైపు చేయాలంటే చాలా సేపు పట్టేది. ఆ తర్వాత 1829లో విలియంబర్ట్ అనే అమెరికన్ టైపోగ్రాఫర్ పేరుతో దాన్ని మరింత ఆధునీకరించాడు. ఎంత ఆధునీకరించినప్పటికీ టైపోగ్రాఫర్ మీద స్పీడు చేతిరాతకంటే చాలారెట్లు వెనకబడి ఉండేది. అనంతరం 1833లో గ్జేవియర్ బ్రూకర్ అనే ఫ్రెంచిదేశస్థుడూ ఆ తర్వాత 1843లో ఛార్లెస్ థ్రేబర్ అనే అమెరికన్నూ మరికొన్ని మార్పుల్ని చేశారు. 1867లో క్రిస్టఫర్ హ్యూవాస్ అనే ఆయన దాన్ని మరింత సంస్కరించి ఆంగ్ల భాషలోని 26 అక్షరాలతో పెద్దక్షరాలు, చిన్నక్షరాలూ ఉండేలా రూపొందించాడు. అటు పిమ్మట 1868లో శామ్యూల్ షోల్స్ దాన్ని పూర్తిస్థాయి టైప్ రైటర్ షేప్‌కి తెచ్చి ప్రపంచానికి అందించాడు. ఇక ప్రస్తుతం ఎలక్ట్రానిక్ టైప్‌రైటర్లు మొదలైనవి రంగప్రవేశం చేసి టైప్ రైటింగ్‌లో విప్లవశకానికి నాంది పలికాయి. గమ్మత్తేమంటే టైప్‌రైటర్ నిర్మాణానికి ఎందరో కృషి చేసినా దాని ఆవిష్కర్తగా షోల్స్ మాత్రమే చరిత్రకెక్కాడు.

## చుక్కలవాన

రాత్రివేళ ఆకాశం నుంచి నిప్పుపువ్వుల్లా రాలిపడే వెలుగు రవ్వల్ని చూసి ఒకప్పుడు వెస్టిండీస్‌ను సందర్శించిన విదేశీ యాత్రికులు విపరీతమైన ఆశ్చర్యానికి లోనయ్యేవారు. కళ్ళుమిరుమిట్లుగొల్పే ఆ వెలుగుల జడిని చూసి చుక్కలు తెగిపడ్డంలేదు గదా? అని కొందరు అనుమానం వ్యక్తం చేసేవారు.

నిజానికి అవి చుక్కలు కావు. నిప్పు పువ్వులు అంతకంటే కాదు. అవి 'కుకుజాలు' అనే ఓ జాతి మిణుగురు పురుగులు. చుక్కల్లా కాంతివంతంగా ప్రకాశిస్తుంటాయట అవి. పూర్వ కాలపు గ్రామీణ ప్రజలు వాటిని పట్టుకొని దీపాల్లా ఇళ్ళల్లో పెట్టుకునేవారట. గిరిజన స్త్రీలైతే ఏకంగా వాటిని తమ కొప్పుల్లో పూలు ముడిచినట్లు ముడుచుకునేవారట.

వెస్టిండీస్ అడవుల్లో ఓసారి ఒక సైంటిస్ట్‌కి 'మెరిసే కప్పలు' కన్పించాయి. ఇవేవో కొత్త రకం కప్పలని అతను వాటిని పరిశోధించడం మొదలెట్టాడు. అసలు విషయం అప్పుడు బయటపడింది. అవి నిజానికి మామూలు



కప్పలే. అయితే కుకుజాలనే ఈ మిణుగురుల్ని తినడంవల్లనే వాటికా ప్రకాశించే గుణం అబ్బిందని తెలియవచ్చింది. మిణుగురులు ఎందుకు మెరుస్తాయన్న విషయమై ఎన్నో పరిశోధనలు జరిగినా సరైన సమాధానం ఇంత వరకూ దొరకలేదు. వాటి శరీరంలో జరిగే ఏదో రసాయనిక చర్య మూలంగానే అవి వెలుగుతున్నాయని అంటున్నారు. ఏమాత్రం నిలబడకుండా మినుకు మినుకుమంటూ వెలిగే ఆ వెలుగు ఏమాత్రం వేడిగా ఉండదట. పైగా చాలా చల్లగా ఉంటుందట. తమ వెలుగు ద్వారా మరో మిణుగురును ఆకర్షించడమే వాటి లక్ష్యం. అందుకే అవి వెలుగుతుంటాయి అంటున్నారు శాస్త్రజ్ఞులు.

## పోయిన పళ్ళే దొరికేనులే

ఆస్ట్రేలియాలోని పెర్త్ నగరానికి చెందిన జాఫర్ అనే జాలరిగారు 'వాడిన పువ్వే వికసించెనే' అన్న లెవెల్లో 'పోయిన పళ్ళే దొరికాయిలే' అంటూ కూనిరాగాలు తీస్తూ సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయిపోతున్నాడట. ఆయనగారి అంత ఆనందానికీ కారణం లేకపోలేదు. ఎప్పుడో ఆర్నెల్లక్రితం నదిలో చేపలు పట్టేప్పుడు పొరపాటున జారి నీటిలో పడిపోయిన అతని 'కట్టుడు పళ్ళసెట్' ఇటీవలే తిరిగి దొరికిందట.

ఆ దొరికిన వైనం కూడా అతి విచిత్రంగా ఉంది. ఈమధ్య చేపలు పడుతుంటే ఓ పెద్ద చేప అతని వలలో చిక్కుకుంది. దాన్ని చూసి 'ఎంచక్కా దీన్ని మనమే ఆరగించేస్తే పోలా?' అనుకొని కూర వండమని భార్యామణి చేతికి అందించాడతను. ఆమె దాన్ని తరుగుతుంటే అలనాడు చేప కడుపులో దొరికిన దుష్యంతుని ఉంగరంలా - ఓ 'పళ్ళసెట్' బయటపడింది. విస్తుపోయిన ఆమెగారు 'కెవ్వు'న అరిచి భర్తను పిలిచింది. జాఫర్ ఆ 'కట్టుడు పళ్ళసెట్'ను అటూ యిటూ తిప్పి పరిశీలించి, ''ఆర్నెల్లక్రితం పోయిన నా పళ్ళసెట్ ఇదే... ఇదే'' అంటూ చిన్నపిల్లాడిలా గంతులు వేయడం మొదలెట్టాడు. ఆ తర్వాత ఈ వింతను గురించి ఆ భార్యాభర్తలు అడిగినవారికీ అడగనివారికీ కూడా చెబుతూ చెవుల తుప్పులు వదిలిస్తున్నారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.